## ఇప్పుడు...
## అందానికి ఒక కేలమైన్




# పాండ్స్
## కేలమైన్ లోషన్

**పూసిన అందం,**
**సంరక్షించే గుణం,**
**తాజా మురిపెం,**
**మీ చర్మానికిది లాభమయం.**

చర్మానికి ఆరోగ్యంతోపాటు అది ఒక అందాల గని కావాలని కోరుకోరామరి? ఈ రెంటి కోసమూ యిదుగో కొత్త పాండ్స్ కేలమైన్ లోషన్:

మచ్చలేని, నిర్మలమైన శోభ, చల్లదనం యిక మీ వంటిపైన—గాలిలోని, సంతోషం విరిసే, మారని ఆ తాజాదనం. మేకప్ వేసుకునే ముందైనా, లేదా దానంతట అదిగానే వాడటానికి వీలు. సుగంధం విరజిమ్మే, అందాన్నిచ్చే పాండ్స్ కేలమైన్ లోషన్.







LINTAS(M) PIL-CL-4-1811-TL

సంస్థాపకులు
కీ॥ శే॥ వి. వి. రాఘవయ్య.



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య

సంపుటి 20 | మార్చి 1982 | సంచిక 2

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

## అస్తమించని సూర్యుడు

రచన

## కొమ్మనాపల్లి గణపతిరావు

జ్యోతి, పి. బి నెం 1824, హైదరాబాదు-20

ముఖచిత్రం : రామారావు, శ్రీదేవి. వెనుక : రాజ్యలక్ష్మి

గూడాల రంగారావు
సారథ్యంలో

నవతరానికి
విప్లవ కానుక!







జైజైయ
నకేర
జునారే!






నిర్మాతలు: టి.కృష్ణ, కె.రాధాకృష్ణ దర్శకత్వం: తీరం మస్తాన్‌రావు

నవయుగ పిక్చర్స్

# రైళ్ళూ

# ఉరి తాళ్ళూ...



# తొలిమాట

కొత్త సంవత్సరం వచ్చిందని సంతోషిస్తూ తిరిగిన తొలి మలుపులోనే ఘోరం—దుస్సహ విషాద రావం!

రైలు వేగపు అభివృద్ధి-చెట్ ఫట్ బందోబస్తులని ఫెళ ఫెళలాడిస్తూ-రైలు పెట్టెలు నుగ్గు నుగ్గు-వంపకి వైబడి నెత్తురు వరదయ్యారు ప్రయాణికులు.

తెలుగు ప్రపంచం నందు ఓవర పుష్పాల్లాంటి పిల్లల్ని నిచ్చగర్తం ఓంగించిన జంట గురించి 'న్యాయం' నానా యుద్ధంచేసి చివరికి ఎలాగో సీకటి చివరి మలుపులో పుత తగెలించింది.

అలా మొదలయింది సంవత్సరం ...

సరే.... ఈ సంచికలో కథల పోటీ వివరం ఇచ్చాము. కార్టూన్ పోటీ వివరాలూ వున్నాయి.

అతి త్వరలో ప్రజరుక్ తరువాత వేరడీ గాండీవి ప్రమాణ "అక్షింత"లనే శీర్షిక నిర్వహిస్తున్నారు .... హాస్యమురసంతో కూడిన విజ్ఞాన పర్వం చ(ది)వి చూడండి..

డా. [illegible]




"జ్యోతి" తెరవగానే 'ఈ మాసం మా కోసం' ఏమిచ్చిందా అని చూస్తే, చిత్ర కళాస్రష్ట 'పికాసో' మీద వ్యాసం కనబడింది. ఆదిసాంతం చదివిన వెంటనే ఓ చిత్రకారుడిగా నాకు ఎంతో ఆనందాన్నిచ్చింది. పికాసో జననం నుంచి మరణం దాకా క్లుప్తంగా వివరణఉన్న ఆ వ్యాసం, చాలా విషయములు తెలియజేసింది. "గుయెర్నికా" చిత్రం మనసులో ఊహించుకున్నాను! ప్రచురించిన ఎడిటర్ గారికి ధన్యవాదాలు చెప్పడం ఎంతైనా సమంజసం—పోతే, ఈ సారి కథలన్నీ కమ్మగా ఉన్నాయి. 101 వ పేజీలోని కార్టూను బాగా నవ్వించింది.

పుచ్చా లక్ష్మీ నారాయణ వర్చస్వీ
హైదరాబాద్

"నిన్నటిపూవు" నవలానుబంధం ఆకెళ్ళ రామచంద్రరావు గారి రచన ఉత్తమ ప్రమాణములతో ఇతి వృత్తం వాస్తవికతకు చేరువుగా వుంది. ఈ సంవత్సరంలో ఈ నవల ఉత్తమమైనదేమో అన్న భావన మా మదిలో కల్గింది "ఈ మాసం మీకోసం" శీర్షిక ద్వారా ప్రతి నెల ఒక్కొక్క మహాపురుషుడు గురించి మాకు సునిశితంగా క్లుప్తంగా ప్రచురిస్తూ మాకు తెలియని విషయములను తెలుసుకొనేట్లు చేస్తూన్న మీ (మా) జ్యోతికి నా ప్రత్యేకాభినందనలు. ప్రచురించిన కార్టూన్స్ అన్నీ చక్కని హాస్యాన్ని చిందించయి. "నవల"కు, కథలకు బొమ్మలు సహజత్వంగా కళాత్మకం ఉట్టిపడేలా చిత్రిస్తున్న "గోపి" గార్కి నా ప్రశంసాపూర్వకాభినందనలు ప్రచురించిన కథలన్నీ బాగున్నవి. ముఖ్యంగా "బంజారా హిల్స్ లో బంగళా", "ప్రమోషన్" కథలు చాలా బాగున్నాయి. "ప్రాణంలేని నీడలు" క్రీ. శే దేవరకొండ బాల గంగాధర తిలక్ గారి కవిత ప్రచురించినందుకు థ్యాంక్స్! ఇదే విధంగా ప్రముఖకవుల కవితాకుసుమాలను ఈనాటి తరానికి "జ్యోతి" ద్వారా అయినా ప్రచురింపబడాలని నా విజ్ఞప్తి.

వై. హేమసుందర్‌రావు, హేమబిందు,
ప్రియ,
డోర్నకల్

విజయశాంతి ముఖ చిత్రంతో వెలువడిన ఫిబ్రవరి "జ్యోతి' లో కథలన్ని బాగు న్నాయి. ముఖ్యంగా రామచంద్రరావుగారి "నిన్నటి పూవు" నవల నవలా ప్రపంచ ములో ఒక విప్లవంలాంటిది. తనకు దక్కని ప్రేమ ఇంకెవ్వరికీ దక్కకూడదనే స్వభా వము గల అనుపమ పాత్రను చక్కగా వ్రాశారు వారికి మాధన్యవాదాలు. అన్ని నెల పత్రికలకన్నా జ్యోతిలోనే కవితలు ఎక్కువగా వేస్తున్నారు. చాలా సంతో షం.

జనరల్ సెక్రటరి
అభ్యుదయ సాహితి సమితి
కొత్తగూడెం.

ఫిబ్రవరి నవల 'నిన్నటి పూవు" పాత్రల చిత్రణలో....మానసిక పరివర్త నల్లో........ఎక్కడా అతిశయం లేకుండా ముఖ్యంగా ప్రధాన పాత్ర అనుపమ.... కాలాను గుణంగా.... (టీన్ ఏజ్‌లో వున్న ప్పుడా వయసులో (వి అసహజము, అవి నీతిగా కనిపించేవో) మానసిక పరివర్తన చెందుతూ తను సకాలంలో తగిన నిర్ణయం తీసుకోలేక....ఏమి పోగొట్టుకొందో....ఇత ర్లలో సహించలేక విడవడం....ఓహో... అత్యంత సజీవ, సహజ పాత్ర. ఎందరో అనుపమలు...అందరికీ నా ప్రగాఢ సాను భూతి. రచయిత ఒరవడి చాలా బాగుంది. పరిసరాలు మానసిక స్థితి వర్ణనతో ఉప మానాలు...కన్నెపిల్ల గుండె చప్పుడవడం మరొకరికి తెలీదు, వేసవి సూర్యుడు వెలిగి వెలిగి చల్లబడ్డాడు, బరువెక్కిన కన్నె పిల్ల తలలో ఆలోచనలు దిండే భరించాలి, యూనివర్సిటీ గర్భంలోంచి నిరుద్యోగులు పుట్టుకొస్తున్నారు. "బుర్రం పగలగొట్టి, జాగ్రత్తగా వెళ్ళిరా" అన్నట్టు, తన తలను గోళ్ళకేసి కొట్టుకోగా, కొట్టుకోగా.... ప్రవాహం ప్రవహించడం నేర్చుకొంది.... మొదలైనవి...ఎన్నయినా వ్రాయవచ్చు... రచయితలోని భావావేశం, పరిసరాల నిశిత పరిశీలన గురించి.

డా. కమలాకర్ లాంటి మానవ మృగా లగురించి, కొందరయినా మరో అనుపమ కాకుండావుండాలనే హెచ్చరిక...ప్రయో జన కరమైన ఇటువంటి మరెన్నో గాధలు రామచంద్రరావుగారి కలం నుండి రావా లని, మనః పూర్వకంగా కోరుతున్నాను.

ముఖచిత్రకారుకు గోపికి నా ప్రత్యేక అభినందనలు.

ఉమామహేశ్వరరావు,
గెద్దనాపల్లి.

కథలన్నీ బాగున్నా ముఖ్యంగా రామా రావు గారి "లెట్ మీ లి(లి)వ్" కథ, నాగేశ్వరరావు గారి "బంజారాహిల్స్‌లో బంగళా" కథలు చాలా బాగున్నాయి.

యండమూరిగారి "డబ్బు టుది పవర్ ఆఫ్ డబ్బు" సీరియల్ అత్యంత సస్పెన్స్‌తో మే మూహించని రీతిలో కథ క్రొత్త మలుపు తిరిగింది. ముందు ముందు ఏం జరుగుతుందోనని వచ్చే "జ్యోతి" కై ఎదురు చూస్తున్నాం.

మల్లిక్ గారి "నేను నా ప్రేమ కథ" హాస్యరస భరితంగా ఉంది. కథ చదివాక కడుపుబ్బ నవ్వుకున్నాం. రచయిత గారికి మా అభినందనలు తెల్పండి.

జి, శివశంకర్ రావ్



# జ్యోతి-భాగ్యలక్ష్మి సంక్రాంతి కథల పోటీలో గెలుపొందిన కథలు-రచయితలు

## మొదటి బహుమతి

"పురుషులందు" -శ్రీ తులసి బాలకృష్ణ, హైదరాబాదు

## రెండవ బహుమతి

"మానవత్వం ఓడిపోలేదు" శ్రీమతి విజయలక్ష్మి, డి. బెంగుళూరు

## మూడవ బహుమతి

"ఇదే బాట" -శ్రీ రెంటాల హనుమంత ప్రసాద్, గుంటూరు

### కన్సొలేషన్ బహుమతులు

"ఈగ-తేనెటీగ" -శ్రీ వెల్లూరి సీతారాజేశ్వరరావు, సికింద్రాబాదు

"కన్నెమనసు" -శ్రీమతి హృదిని, దాపల్లె

"రేపు" -శ్రీ సదానంద్ శారద, హైదరాబాదు

"ముల్లు తురిమిన మొగ్గ" -శ్రీ వా. సు. హైదరాబాదు

"ఓర్పు" -శ్రీమతి మాధవపెద్ది ప్రత్యూష ప్రసాద్, బరోడా

"రాజీ పడలేను" -శ్రీ 'మానస', విశాఖపట్టణం

"జీవిత పోరాటం" -శ్రీ దేవరాజు మహారాజు, భువనగిరి

"పొయ్యిలో పిల్లి" -శ్రీ తనికెళ్ళ ఫణి, సికింద్రాబాదు

"తలపండు" -శ్రీ ఉప్పల నరసింహం, హైదరాబాదు

"స్మృతిపథంలో" -శ్రీ కొమ్మనాపల్లి గణపతిరావు, హైదరాబాదు

ఈ కథల పోటీలో న్యాయనిర్ణేతలుగా బాధ్యత తీసుకున్న శ్రీ నండూరి రామమోహనరావుగారికీ, శ్రీ బాపుగారికీ, శ్రీ ముళ్ళపూడి వెంకటరమణగారికీ జ్యోతి కృతజ్ఞతలు తెలియచేస్తోంది. ఈ సాహితీ వనంలో విరిసిన పువ్వుల గురించి, తోట గురించీ వారి అభిప్రాయాన్ని ప్రకటిస్తున్నాము.





# ఒక్క మాట

"జ్యోతి" మాసపత్రిక వారు తమ కథల పోటీకి వచ్చిన వాటిని ముందుగా కొంత వడపోసి, కొన్నిటిని మా చేతికిచ్చి, బహుమతులకు అర్హమైనవాటిని సెలక్ట్ చెయ్యమని కోరారు. బహుమతి నిర్ణేతలకు కథలివ్వడంలో వారు అనుసరించిన పద్ధతి మాకు నచ్చింది. ఏ కథ ఎవరు వ్రాశారో నిర్ణేతకు తెలియకుండా రచయిత (త్రి) పేరు తీసివేశారు. దీనివల్ల కథ వ్రాసినవారు ఎవరనేదానితో నిమిత్తం లేకుండా పూర్తి కథ బాగోగులను బట్టే దాని యోగ్యతను నిర్ణయించడానికి సాధారణ పద్ధతిలో కంటె ఎక్కువ అవకాశం కలిగినట్టనిపించింది.

ఆ విధంగా మాకిచ్చిన కథలను చదివినప్పుడు మాకు సంతృప్తికరంగా తోచిన కథలు ఎక్కువ సంఖ్యలో కనబడడం మాకు చాలా సంతోషం కలిగించింది. ఒక చిక్కుకూడా ఎదురైంది. మాకు బాగా వున్నవని తోచిన కథలు దాదాపు సమస్థాయిలోనే వున్నాయి. దేనికి ప్రథమ బహుమతి ఇవ్వాలి, వేటిని మిగతా బహుమతులకు నిర్ణయించాలి అన్నది సమస్య అయింది. చివరకి చాలా జాగ్రత్తగా ఆలోచించి బహుమతులకు అర్హమైన వాటి స్థానాలను నిర్ణయించడం జరిగింది.

మా చేతికిచ్చిన కథలలో ఒకదాన్ని పోలినదొకటి లేదు. చక్కని వైవిధ్యం కనబడింది. కథల ఇతివృత్తాలు, వాటిని చెప్పినతీరు ఉత్తమంగా వున్నాయి. శైలి విషయం మేము అంతగా పట్టించుకోలేదు. కథలో కథనం, సంవిధానం ముఖ్యమని మా ఉద్దేశం. భాష నిర్దుష్టంగా, సూటిగా వుండాలి కాని, శైలిలో తళుకులు, బెళుకులు ఎక్కువైతే అవి కథను మింగేస్తాయని అనుకుంటాము.

మొత్తంపై బహుమతులు పొందిన రచయితలను, తాము నిర్వహించిన పోటీకి నిజంగా ఉత్తమ కథలను ఆకర్షించగలిగినందుకు "జ్యోతి" మాస పత్రిక వారిని అభినందిస్తున్నాము.

**నండూరి రామమోహనరావు, బాపు, ముళ్ళపూడి వెంకటరమణ**



# ప్రముఖులంము......

తులసి
బాలకృష్ణ



గ్రూప్ ఫొటోలు, దండలు, పీడ్కోళ్లు మాధవరావు మాస్టారి పాతిక సంవత్సరాల ఉపాధ్యాయ జీవితంలో-ఋతువుల్ని బట్టి మారే వాతావరణంలా, 'వాతావరణాన్ని' బట్టి మారే రాజకీయ నాయకుల్లా-సర్వ సామాన్యమయి పోయాయి. ట్రాన్స్ఫరంటే ఇల్లు మారినట్లు, కొత్త వూరుకి వాహ్యాళికి వెళ్లినట్లు వుంటుందాయనకు. 'ఏవూరైనా రెక్కాడితేనే డొక్కాడేదీ, నోరు మంచిదయితేనే ఊరు మంచిదయ్యేది' అంటారాయన. ఎన్నడూ ఏ రాజకీయ నాయకుడన్నా బెదిరిందీ లేదు-ఏ ప్రలోభాలకీ లొంగిందీ లేదు.

ఈ వూరొచ్చిన మొదటి రోజు [illegible]

"మీ గురించి నేను యిది వరకే విన్నాను మాస్టారూ. నిజమే, న్యాయాలకి యివి రోజులు కాకపోయినా, ఇంకా ఏ మూలో మీ లాంటి నీతిపరులు ఏ కొద్ది మందో మిగిలి వుండబట్టే మనదేశం, దేశంలోని విద్యావిధానం ఈ మాత్రమైనా మనగలుగుతున్నాయి. మీవంటి వారివల్లే సంవత్సరానికి స్కూలు మొత్తంమీద ఒక్క కుర్రాడయినా మంచి మార్కులు తెచ్చుకుని, స్కూలు పరువు కాపాడుతున్నాడు. మీరు మా స్కూలుకి రావడం మా అదృష్టంగానూ, వదులుకున్న స్కూలువారి దురదృష్టంగానూ భావిస్తున్నాను. బహుశః ఇంక మీరు ఈ వూరు వదిలే అవసరమేరాదని, మావూరు మీవంటి ఉపాధ్యాయుడిని వదులుకోదని గట్టిగా నమ్ముతున్నాను" అన్నారు హెడ్ మాస్టారు. మాధవరావు మాస్టార్ని ఎంతో సాదరంగా ఆహ్వానిస్తూ.



"కృతజ్ఞుడిని". అన్నారు మాష్టారు హృదయం పుష్పొంగిపోగా. ఆపైన, తనప్రక్కనే తనని అంటిపెట్టుకుని నిల్చున్న పాపని చూపిస్తూ, 'సార్-ఈ పిల్ల నాకూతురు-పేరు పద్మ. మీరు అనుమతిస్తే మన స్కూల్లోనే రెండవ తరగతిలో చేరుద్దామనుకుంటున్నాను." అన్నారు సవినయంగా.

"తప్పకుండా మాష్టారూ-మీ కంటేనా" అంటూ పిల్లవైపు నవ్వుతూ చూసారు హెడ్ మాష్టారు.

"లేక లేక కలిగిన పిల్లయిది. అభాగ్యురాలు-పుట్టుతూనే తల్లిని పోగొట్టుకుంది. దానికి తల్లి, తండ్రి నేనే. నాకు సర్వం అదే" అంటున్న మాష్టారి కళ్ళల్లో తళుక్కుమన్న వాత్సల్యాన్ని గమనించి, అన్నారు హెడ్ మాష్టారు, "తల్లి లేని పిల్ల అవడం ఆపిల్లకు దురదృష్టమయితే, మీవంటి గొప్పతండ్రికి బిడ్డ అవడం ఆపిల్ల పూర్వజన్మ సుకృతం మాష్టారూ." అంటూ పాపని దగ్గరకు తీసుకుని, తల నిమిరారు.

పిల్లని పేరూ అవీ అడిగి తెలుసుకుని, ముద్దాడి, అన్నారు హెడ్ మాష్టారు, "మీరు ఈ వూరొచ్చింది ఈరోజే కాబట్టి, ఇంటి దగ్గర విశ్రాంతి తీసుకోండి మాష్టారూ-రేపట్నుంచీ వద్దురుగాని" అని.

కాని మాష్టారందుకు అంగీకరించ లేదు, "లేదుసార్. ఇప్పుడు విశ్రాంతి అవసరం లేదు నాకు. నేను పడ్డ పెద్ద శ్రమ ఏమీలేదు. పైగా చిన్న పిల్లలతో పాఠాలు చెప్పుకుంటూ కాలక్షేపం చెయ్యడమే గొప్ప విశ్రాంతి నాకు."

—అభినందిస్తూ, మెరిసే కళ్ళతో నవ్వేరు హెడ్ మాష్టారు. ఓ నిముషం తలపంకించి, ఏదో చెప్పబోయి, తటపటాయించి, చటుక్కున, "రేపట్నుంచీ మీకు క్లాసులు అప్పజెప్తాను. ఈ రోజుకి ఓ మీకు అభ్యంతరం లేకపోతే సుమా.. ఆ మూడవ తరగతి మాష్టారు ఓ గంట ఆలస్యంగా వస్తానన్నారు ఆక్లాసు కుర్రాళ్లు స్కూలు పీకి పందిరేస్తున్నార్ట. చిన్నపిల్లల క్లాసు అప్పజెప్పనని మీరు భావించకపోతే. ఆ తరగతికి " అంటూ చప్పరించారు.

"తప్పకుండాసార్. చిన్నపిల్లల క్లాసు నేను తీసుకుని చాలా నాళ్ళయింది. ఆ పసివాళ్ళతో గడపటం చాలా ఆనందంగాపుంటుంది" అంటూ కుర్చీలోంచి లేచి, కండువా భుజాన వేసుకుని, ఆ క్లాసుకి వెళ్ళడానికి తన సంసిద్ధత వ్యక్తపరిచారు మాష్టారు.

"పాపని ఇక్కడే వుంచండి. క్లాసుకి నేను పంపిస్తాను" అంటూ, ప్యూనుని పిలిచి, మాష్టారికి మూడవ తరగతి బి సెక్షన్ చూపించమని పురమాయించారు హెడ్ మాష్టారు.

అయిదు ఎకరాల స్థలంలో విశాలమైన క్లాసు రూములున్న రాతికట్టడాలతో, వరుస క్రమంలో పెంచిన పెద్ద పెద్ద చెట్లతో ఆ స్కూలు చాలా అందంగానూ, విద్యనాశించి రాణించే బుద్ధిమంతులకి చక్కటి ఆలయంగానూ దృగ్గోచరమయ్యింది మాష్టారికి. ఫుట్‌బాల్ గ్రౌండ్‌కి అటువైపునున్నట్టుంది ఆతరగతి-గ్రౌండులోంచి తీసుకు వెళ్తున్నాడు ప్యూను.

"ఇదుగో-చూడు బాబూ! నీ పేరేమిటీ?"

---

# జ్యోతి-భాగ్యలక్ష్మి-లాటరీ కథల పోటీలో

## రచయిత పరిచయం



తూర్పు గోదావరి జిల్లా ఇంజరంలో పుట్టిన నా జీవితం ఇప్పటివరకు సగం కాకినాడలోను, సగం రాష్ట్ర రాజధానిలోను గడిచింది. గత ఏడు సంవత్సరాలుగా కథలు వ్రాస్తూన్న నాకు బహుమతు లందుకోవడం బొత్తిగా క్రొత్త కాకపోయినా, ఈ బహుమతి మిక్కిలి ఆనందాన్ని, క్రొత్త వూపిరినీ ప్రసాదించింది.

నాటకాలలో నటించడమన్నా, దర్శకత్వం వహించడమన్నా ప్రాణం.

ఉద్యోగం—ఆంధ్రా బ్యాంకులో ఆఫీసరు.

ఎప్పటికయినా ఈ దేశంలో విప్లవం తథ్యమనే గట్టి నమ్మకం, దుష్టశిక్షణ ద్వారా కంటే, దుష్ట సంస్కరణ ద్వారా వచ్చే విప్లవం మరింత వున్నతమయినదవుతుందనే అభిప్రాయం గలవాడిని.

ఈరోజుల్లోకూడా మంచి రచనలు వస్తున్నాయని నమ్మేవాళ్ళలో నేనూ ఒకణ్ణి. తోటి బహుమతి గ్రహీతలకు శుభాకాంక్షలు; జ్యోతి సంపాదకులకు, న్యాయనిర్ణేతలకు కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

మానవజన్మ ఎత్తినందుకు ఈ పుణ్యభూమి ఘనత ప్రపంచ దేశాల్లో కీర్తింపబడటానికి — ఏనాటికయినా, ఉడతాభక్తిగా నయినా నేను ఉపయోగపడి, జన్మ సార్థకం చేసుకోవాలనేది ముఖ్యమైన కోరిక.

—తులసి బాలకృష్ణ

"ఎంకన్న బాబూ"

"చూడు వెంకన్నా నువ్వు క్లాసుదాకా రానక్కర్లేదు. దూరంగా చూపించి వెళ్ళిపో"

"సిత్తం" అని మరో పాతిక గజాలు నడిచాక ఆగి, "అయ్యా - ఆ నేరేడు సెట్టుకి యిటు పక్క....పుర్ర సేతేపు వుంది సూడండి గుమ్మం-అద్దేనండి" అని చెయ్యి చాపి చూపించాడు వెంకన్న.

"సర్లె నువ్వెళ్ళిపో" అంటూ అటు నడిచారు మాష్టారు.

క్లాసుతో పాటు రణగొణధ్వని మరింత దగ్గరవుతోంది. 'ప్రక్క క్లాసుక్కి, వాళ్ళకి ప్రశాంతంగా పాఠం వినడానికి ఏకాగ్రత చూపించడానికి ఈ గొడవ ఎంత అడ్డంకంగావుందో కదా' అని చింతిస్తూ, వడి వడిగా నడిచారు మాష్టారు. గొడవ మధ్య ఓ పిల్లాడి గొంతు మరీ స్పష్టంగా వినిపిస్తోంది గట్టిగా—

"ఇప్పుడు....నేను చెప్పిన పద్యాన్ని మీరూ చెప్పాలన్న మాట. చెప్తార్రా వెధవల్లారా?"

"ఊ...."

"సరె చెప్పండి....కప్పు ఉప్పు

## ప్రథమ బహుమతి పొందిన కథ

రండు . ."

—నవ్వులు కేరింతలు—

"సాయిలెన్స్. చెప్పండ్రా వెధవల్లారా—కవ్వు ఉప్పరంబు—"

"కవ్వు ఉప్పరంబు—" అన్నాయి అన్ని గొంతులు.

"—నక్క పోలికనుండు—"

—నవ్వులు పగలబడి—

"తంతా వెధవల్లారా—ఊఁ చెప్పండి—నక్క పోలికనుండు—"

"నక్క పోలికనుండు—" అంటూ చప్పట్లు, నవ్వులు, కేరింతలు,—విచ్చలవిడితనం-అడ్డూ అదుపు లేని స్వేచ్ఛ—ఇంతలో—

"సైలెన్స్!!!"

—ఉరుము

—పిడుగు

—పైకప్పు విరిగి మీద పడ్డంత ధ్వని,

కుర్చీ మీద నిలబడి, అందరిచేత ఆకతాయి తనం పద్యం చెప్పిస్తూన్న కుర్రాడు త్రుళ్లిపడి, ముందుకు పడ్డాడు. అదిరిపడ్డ కుర్రాళ్ళందరూ అవాక్కయిపోయారు. అన్నితలలూ కీయిచ్చినట్లు గుమ్మంవైపు తిరిగాయి. గుమ్మానికి మధ్యగా నిలువెత్తు భారీ విగ్రహం-మిలట్రీ కమాండర్లా ఠీవిగా. ఆముఖంలో సముద్ర గాంభీర్యం, ఆ కళ్ళల్లో ప్రజ్వలిస్తూన్న తీక్షత,—శిలా ప్రతిమలయ్యారు పిల్లలంతా. కుర్చీమీంచి ముందుకు తూలిపడ్డ కుర్రాడు తమాయించుకుని, ఆయన వంక పొగరుగా, ఓరగాచూస్తూ, యాంత్రికంగా నడుచుకుంటూపోయి, తన సీట్లో కూర్చున్నాడు.

బలంగా అడుగులేస్తూ ముందుకొచ్చారు మాష్టారు. కండువా కుర్చీచేతిమీద వేసి, అందర్నీ పరిశీలనగా చూసారు — చిన్నచిన్న పిల్లలు—లేత ముఖాలు అప్పుడే విచ్చుకున్న కలువ పువ్వుల్లా — ఆ ముఖాల్లో అమాయకత్వం—ఆ మనసుల్లో దైవత్వం—ఆమనుషుల్లో ఏది బోధిస్తే అదే అలవరుచుకునే తత్వం—అందరి ముఖాల్లోకి గుచ్చి గుచ్చి చూస్తూవచ్చిన మాష్టారి చూపు ఆ అబ్బాయి దగ్గరకొచ్చేసరికి ఆగిపోయింది–తననే మింగేసేలా చూస్తూన్నాడు ఆ అబ్బాయి—

"స్టేండప్!" ఆదేశించారు మాష్టారు.

—లేవలేదు ఆ కుర్రాడు. అలాగే, నిర్భయంగా చూస్తూన్నాడు.

"ఊఁ. స్టేండప్—లేచి—నిలబడు—" నొక్కిపలికారు.

అయిష్టంగా, విసురుగా లేచాడు.

"ఇలారా"

కదలలేదు.

"రా"-ఉరిమారు.

రెండడుగులు ముందుకు వేసాడు కుర్రాడు.

"నీపేరేమిటి?"

"రాజా"-ఠీవిగా నిల్చున్నాడు.

"ఊఁ—ఉప్పు కప్పురంబు పద్యం చేతులు కట్టుకుని అప్పజెప్పు"

"నేన్చెప్పను"

"చెప్పాలి-చీరేస్తాను లేకపోతే"

"అయితే — నా కొచ్చినట్లు చెప్తానంతే"

"చెప్పు"

క్లాసువైపుకు తిరిగాడు కుర్రాడు

చెప్పడానికి సిద్ధపడుతూ. తను చెప్పే విధానానికి క్లాసంతా నవ్వుతారని ముందే వూహించిన విజయగర్వంతో లోనుండి తన్ను కొస్తూన్న ఆనందాన్ని పళ్ల బిగువున బిగించి, వుక్కిరిబిక్కిరి అవుతున్నాడు. పిల్లల్లో కిసకిస నవ్వులు మొదలయ్యాయి.

"సైలెన్స్" గదిమారు మాష్టారు.

బుగ్గలో నాలిక గుచ్చుకుని, వెక్కిరింపుగా ఓరచూపులుచూస్తూ, చెప్పడం ప్రారంభించాడు కుర్రాడు — "కప్పు ఉప్పురంబు నక్కపోలిక —"

"ఆగు-ఏమిటా చెప్పడం? సరిగ్గా చెప్పు—ఉప్పు కప్పురంబు—"

"నా కొచ్చినట్లు చెప్తాను—నా యిష్టం—కప్పు ఉప్పురంబు—"

అంతే!!

"అమ్మో!!!"-క్రిందపడి, లేస్తూన్న ఆ కుర్రాడి ఎడమ చెంపమీద మాష్టారి కుడి చేతి వ్రేళ్ళ ముద్రలు—గులాబీ రంగులో తట్లుతేలాయి.

"అయ్యో అయ్యో—ఆరు ఎమ్మెల్లే గారబ్బాయిగారండీ బాబూ మాట్రుగారూ-అర్ని కొట్టేత్తన్నారేటండీ బాబూ—"

—రివ్వున గుమ్మంవైపు తిరిగారు మాష్టారు. భయం భయంగా చూస్తూ, నిలబడి వున్నాడు వెంకన్న అక్కడ.

"వెంకన్నా-నువ్వెందుకొచ్చావిక్కడికి?"

"ఎప్పుడూ గోలగోలగా వుండే కళాసు సవిలెన్సుగా వుండేతలికి సరదా పడి సూద్దారనొచ్చాను మాట్రుగారూ— బాబూ—ఆరు ఎమ్మెల్లేగారి—"

"ఎవరబ్బాయి అయినా నాకనవసరం. పిల్లలంతా ఒక్కటే నాకు. తప్పుచేస్తే ఎవ్వర్నీ క్షమించను. ఒక్కడివల్ల క్లాసు, స్కూలు కూడా చెడిపోవచ్చు. నువ్వెళ్లు" అంటూ కుర్రాడి వైపుతిరిగి, "ఏం, ఈ సారన్నా సరిగ్గా చెప్తావా?" అనడిగారు వాడి కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ.

వూరిగాలొంగి పోయాడు వాడు. నీళ్లు నిండిన కళ్ళతో బెరుగ్గా చూస్తూ, 'చెప్తా' నన్నట్లుగా తలవూపాడు.

"గుడ్--అదీ బుద్ధిమంతుడి లక్షణం" అంటూ కుర్రాడిని దగ్గరకు లాక్కుని, వాడి బుగ్గమీద మాష్టారు ముద్దు పెట్టుకునే సరికి, వాడు బేలగా బావురుమన్నాడు. బుజ్జగిస్తూ నవ్వి, వాణ్ని ఎత్తుకుని ఒళ్లో కూర్చో పెట్టుకుని, "ఓరేయ్ పిల్లలూ-ఇప్పుడు మీకు వీడు ఉప్పు కప్పురంబు పద్యం చెప్తాడ్రా. మీరంతాకూడా వాడితో బాటే చెప్పాలి. సరేనా?" అన్నారు వాళ్ళల్లో భయాన్ని పోగొట్టి, ఉత్సాహాన్ని కలిగించేలా చల్లని చూపులు చూస్తూ.

"ఓ " అన్నారంతా ఉత్సాహంగా.

"అదీ... వెరీగుడ్—పాపం. వీడిందాకే చెప్పేవాడు సరిగ్గా. వాడు నేను కొత్తవాడిని కాబట్టి, ఈ స్కూలుకి పెద్ద క్లాసులకి పాఠాలు చెప్పడానికి వచ్చిన కొత్త మాష్టారిని అని తెలియక అలా దురుసుగా మాట్లాడాడంతే. వీడు చాలా బుద్ధిమంతుడసలు-నాకు తెలుసు. ఊ.. చెప్పరా నాన్నా. తప్పొస్తే నేను చెబుతాలే. చెప్పు"

చెప్పాడు కుర్రాడు తప్పులు లేకుండా.

పిల్లలంతా కూడా వాడితో బాటే చెప్పారు.

"వెరీగుడ్. మంచి పిల్లలు మీరు. అలా వుండాలి. చదువు నెప్పుడూ వెక్కిరించకూడదు. చదువంటే సరస్వతి. దేవుడిని, తల్లి దండ్రుల్ని, చదువుని, గురువుని ఎప్పుడూ హేళన చెయ్యకూడదు. అదిపాపం. అర్థమయ్యిందా?"

తల వూపారంతా అర్థమయ్యిందన్నట్టుగా.

"ఆఁ ఇప్పుడు మనం కొన్ని నీతి కథలు చెప్పుకుందాం అంటూ ఆయన చెప్పిన పంచతంత్రం కథల్ని ఎంతో ఆసక్తితో విన్నారు పిల్లలంతా.

ం ం ం

భ్రుకుటి ముడిచి, ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ అన్నారు మాష్టారు, "ఏమిటీ, రాజా ఈ రోజు కూడా రాలేదా?!!" అని.

"అవును మాష్టారూ — ఈ రోజు అప్పుడే మూడో రోజు. భయంతో వాడికి జ్వరం వచ్చింది అంటున్నారు తోటి క్లాసు పిల్లలు. 'వదో తరగతి కొత్త మాష్టారు మా క్లాసుకొచ్చి, రాజా అల్లరిచేస్తే కొట్టారు' అని పిల్లలు ఆ ఎమ్మెల్యే గారికి చెప్పనే చెప్పారట. నేనగాని, మరే మాష్టర్లుగాని, చివరకి హెడ్ మాష్టారుగాని వాడిని కొట్టడానికి కూడా జంకుతాం. మీరేమో వాడి గుంబ పగల గొట్టి వదిలారట. ఇప్పటి వరకు ఆ ఎమ్మెల్యే గారేమీ అనలేదంటే — నాకెందుకో తుఫాను ముందు ప్రశాంతతలా అనిపిస్తోంది" అంటూ భయాన్ని వ్యక్తపరిచారు రాజా క్లాసు టీచరు.

"మీరు మరేమీ భయపడకండి మాష్టారూ-ఆ అబ్బాయిని శిక్షించింది నేను. జరగబోయే నష్టాన్ని నేనొక్కణ్ణే భరిస్తాను. అయినా తప్పుగా ప్రవర్తించిన విద్యార్థిని శిక్షించడం మన విధుల్లో ఒకటి, అది మనం విస్మరిస్తే మన విధిని మనం సక్రమంగా నిర్వర్తించనట్లే. ఆ కుర్రాడికి త్వరగా స్వస్థత చేకూరాలని మాత్రం దేవుడ్ని ప్రార్థిస్తున్నాను."

ం ం ం

గుమ్మం బయట కారు హారను చప్పుడు. వెంటనే "మాష్టారుగారూ" అన్న పిలుపు విని, పాపకి స్నానం చేయిస్తూన్న వారల్లా ఉలిక్కిపడి, "ఎవరూ" అంటూ, చేతులు తుడుచుకుంటూ బయట కొచ్చాడు మాష్టారు.

"తమర్నో పాలి అయ్యగారు రమ్మంట్నా రండి"-కాకీ బట్టల డ్రయివరు మొరటు గొంతు కరుగ్గా పలికింది.

"ఏ అయ్యగారు?"

"మా అయ్యగారే నండి-ఎమ్మెల్లే దొరగారు"

ఒక్క క్షణం చలన రహితులై నిలబడి పోయారు మాష్టారు ఆపైన "నేను వస్తాలే-నువ్వెవద" అన్నారు.

"అలాక్కాదండి. ఎంట బెట్టుకు రమ్మన్నారు. కార్లో ఎల్దాం రండి."

ఒక నిముషం తల పంకించి ఆలోచించి, ఇప్పుడే వస్తా" అని లోపలకి నడిచి, పాపకి ఒళ్ళు తుడిచి, బట్టలు తొడిగి, "పద్మా-నువ్వు పక్కింట్లో ఆడుకుంటూండమ్మా-నేనొక్క అరగంటలో వస్తానే" అని చెప్పి, బట్టలు మార్చుకుని ఇంటికి తాళం వేసి, అయిష్టంగానే కారెక్కి, ఎమ్మెల్యే గారింటికి బయల్దేరారు మాష్టారు.

... ఆయన మస్తిష్కంలో అనేక

ఆలోచనలు ఎమ్మెల్యే కొడుక్కి ఎలా వుందో పాపం... ఆయన తన మీద కారాలు మిరియాలు నూరుతుండవచ్చు "బ్రతికి బట్ట కట్టాలని లేదా -బడుగు పంతులూ" అనడగవచ్చు ట్రాన్స్ఫర్ ఆర్డర్ చేతిలో పెట్టొచ్చు .."నాకొడుకుని కొట్టావుగా-ఆదెబ్బ రుచి నువ్వు చూడం" టూ తన చెంప పగల గొట్టొచ్చు ఉద్యోగం వూడ పీకించవచ్చు ఇంకా అయితే మరే నేరమయినా మోపి, కట కటాల వెనక్కి తోయించవచ్చు.

"దిగండి మాష్టర్గారూ" అన్న డ్రైవరు మాటలకి ఈ లోకంలోకి వచ్చి, కారుదిగి, అతన్తో బాటే నెమ్మదిగా మెట్లెక్కి, అరుగు మీద నిలబడ్డారు మాష్టారు. అదొక విశాల మయిన భవంతి. చుట్టూతోట. ఎత్తుగా ప్రహరీ గోడ.

"అలాకూర్చోండి మాష్టర్గారూ" అని కుర్చీవైపు చూపించి, లోపలకు వెళ్ళాడు డ్రైవరు, అలవాటు పడ్డ చొరవతో.

కూర్చోలేదు మాష్టారు. వారగా నిల బడే వున్నారు. ఆయన ఆలోచన అంతా ఇక ముందు జరగబోయే తంతు మీ దుంది.

అయిదు నిముషాలు గడిచి వుండొచ్చు.

క్షణాలు లెక్క పెట్టుకుంటున్నారు మాష్టారు.

గుండె చప్పుడు చెవుల్లో ప్రతిధ్వని స్తోంది.

ఆయన దృష్టి గుమ్మం వైపే వుంది-

-తెల్లటి ఖద్దరు బట్టల్లో నల్లటి, లావు పాటి ఎమ్మెల్యే రానేవచ్చాడు బయటకు నెమ్మదిగా, ఠీవిగా నడుచుకుంటూ.

వస్తున్న మనిషిని గమనించి, సర్దు కుని నిలుచున్నారు మాష్టారు. ఖంగారు' భయం, ఆందోళన లాంటి భావాలు తనలో ప్రవేశించకుండా జాగ్రత్త పడి, ప్రశాంత గంభీర వదనంతో నిశ్చలంగా నిలబడ్డారు.

తెల్ల బట్టల నల్ల ఎమ్మెల్యే తిన్నగా మాష్టారి దగ్గరకొచ్చాడు.

ఆయన కళ్ళల్లోకి సూటిగా చూసాడు.

చటుక్కున వంగి, ఆయన చేతులం దుకుని, కళ్ళకద్దుకున్నాడు.

విస్తుపోయారు మాష్టారు.

"మాష్టారూ-నిజంగా మేము అదృష్ట వంతులమండీ. ఇన్నాళ్ళకి మా అబ్బా యికి గురయిన మాష్టారు దొరికారు" అన్నాడు ఆనందంగా.

బొమ్మలా తెల్లబోయి చూస్తున్నారు మాష్టారు.

"ఆశ్చర్యంగా వుందా మాష్టారూ- నిజమేలెండి. అసలు మా రాజకీయ నాయకులంటేనే అందరికి ఓ విధమయిన భయమూ, ఇతర దురభిప్రాయాలూ వుం టాయి. మా పిల్లల్ని ఎవ్వరైనా ఏమ యినా అంటే కయ్యానికి కాలు దువ్వు తామేమోనని భయపడు తుంటారంతా అనవసరంగా. కాని, మేమూ మనుషుల మేగా మాష్టారు! మాకూ మా పిల్లలు బుద్ధిమంతులవ్వాలనీ వుంటుంది—కానీ దొంగలుగా, జూదగాళ్ళుగా, దేశద్రోహు లుగా తయారవ్వాలని వుండదు గా. వాళ్ళు మంచి పిల్లలుగా తయారవడానికి ఎవరు సహకరించి ప్రయత్నించినా మేము వాళ్ళకి ఆజన్మాంతం కృతజ్ఞులమయ్యే వుంటాం"

-మాష్టారి కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. గొంతు పెగల్లేదు. ఎమ్మెల్యే గారంటే మంచి గౌరవ భావం కలిగింది. అప్రయత్నంగానే చేతులెత్తి నమస్కరించారు. "నేను నమ్మలేక పోతున్నానండీ. ఇది కలా, నిజమా" అని మాత్రం అన గలిగారు.

ఎత్తుతూన్న ఆయన చేతుల్ని మధ్యలోనే అందుకుని నివారిస్తూ, అన్నారు ఎమ్మెల్యేగారు, "ఛ ఛ-మీరు నాకు నమస్కరించడమేమిటి? తప్పు తప్పు. నాకూ గురుతుల్యులే మీరు. అసలు మీ వృత్తే పవిత్రమయ్యింది, ఇక మాదో? అడక్కండి. మంచో చెడో ఏనాడో దిగాను. ఇక మునిగో తేలో ఈ ఘటం ఈ రంగంలో ఇలా వెళ్ళి పోవలసిందే. కాని నా కొడుకు మాత్రం నా రకం జీవితం గడపాలని కోరుకోడం లేదు నేను. భోగభాగ్యాలు లేకపోయినా ఫరవాలేదు. నీతిగా, న్యాయంగా, నిశ్చింతగా, నిరాడంబరమైన జీవితం గడిపితే అంతే చాలు. అన్నట్లు, మిమ్మల్ని నిలబెట్టే మాట్లాడేస్తున్నాను. రండి-కూర్చోండి"-

యాంత్రికంగా నడిచి, కుర్చీలో కూర్చుని, మంత్ర ముగ్ధులయినట్లు ఎమ్మెల్యే గారి మాటల్ని వింటూ వుండి పోయారు మాష్టారు.

మళ్ళీ చెప్పడం ప్రారంభించారు ఎమ్మెల్యేగారు.

"ఇద్దరు పిల్లలు పుట్టిపోయాక కలిగిన సంతానమండీ ఈ కుర్రాడు. వీడి తర్వాత సంతానం లేదు మాకు. పుట్టుక నుంచీ మహా అర్భకుడు. అందుకనే రెప్పెత్తి కోపంగా చూడం, పన్నెత్తి ఒక్క మాట అనం. దాంతో నిష్ప్రియోజకుడిగా, మొండి వెధవలా తయారవుతున్నాడు. వాడెంత రాక్షసుడిలా ప్రవర్తించినా, నేనేం చేస్తానో అనే భయంతో ఊళ్లో ఎవ్వరూ ఏమీ అనరు. స్కూల్లో మాష్టార్లు సరేసరి. "నేనేమీ అనుకోనునయాన్నో భయాన్నో పిడ్ని దార్లో పెట్టండి" అంటే ఆ హెడ్మాష్టరు వీడి ముందు కళ్ళెర్ర జెయ్యాలంటేనే భయపడతాడు. ఇంక మామూలు మాష్టర్లేం లొంగదీయగల్రు? ! ఏది ఏమయినా, వాడు మీ ఒక్కరికే లొంగాడు. వాడి ఏడేళ్ళ జీవితంలో వాడు తల వంచింది మీ ఒక్కరి దగ్గరే. మీ పేరు చెబేనే భయంతో గజగజ వణుకుతున్నాడు. మీ లాంటి మాష్టారు మావూరికి రావడం మా అదృష్టం. కేవలం భయపెట్టడమే కాదు. బుజ్జగించి, ఎంతటి కష్టమైన పాఠాన్నయినా అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినట్లు మీరు బోధిస్తారని విన్నాను. కాని, మీరు పెద్ద తరగతులకే తప్ప చిన్న క్లాసులకి వెళ్ళరని తెలిసింది. నాదో కోరిక మాష్టారు! కాదనకూడదు. మీరు-స్కూలు అయిపోయాక అయినా సరే, రోజుకి ఓ రెండు గంటలపాటు వాడు మీ దగ్గర గడిపేలా చూడండి. ఆ రెండు గంటల్లో మీరు వాడికి పాఠాలే చెబ్తారో, పనులే చేయించుకుంటారో మీ యిష్టం. అందరూ వాడిని ఓ రాక్షసుడిలా కాక ఓ మంచి పిల్లాడిలా చూసేలా తయారు చేయండి వాడిని. మీ చేతుల్లో పెడుతున్నాను. వాడిని ఎమ్మెల్యేగా కాకుండా బిడ్డ బాగు కోరే కన్నతండ్రిగా మిమ్మల్ని కోరుకుంటున్నాను. కాదనకండి" అం

టూండగా ఆయన కళ్ళల్లో తడి తళుక్కుమంది.

మాష్టారి హృదయం సంతోష తరంగమయ్యింది. ఎవ్వరికీ భయపడక, ఎంత మందినో శిక్షించాడాయన. దానికి ప్రతిఫలం యిప్పటి వరకు ఆయనకు చెడే జరిగింది కాని, మంచి ఏనాడూ జరగలేదు.

కాని, ఈనాడు...

"తప్పకుండా .... నాదీ బాధ్యత" అన్నారు మాష్టారు.

"చాలు....అంత మాటన్నారంతే చాలు. మీ హెడ్మాష్టారి ద్వారా మీఘనత విన్నాను. రాతి ముక్కల్ని సైతం రత్నాలు చెయ్యగల ఘటికులట మీరు. ఈ రాజకీయాల్లో సతమతమవుతూన్న నేను ఇంక పిల్లాడి గురించి బెంగపెట్టుకోనక్కర్లేదు. కృతజ్ఞుడ్ని."

"శెలవు" అంటూ, ఎమ్మెల్యేగారెంత బలవంత పెట్టినా కారులో వెళ్ళడానికి అంగీకరించక కాలినడకన ఇంటిముఖం పట్టారు మాష్టారు.

ఇరుసు పాడయ్యో, బాట బాగులేకనో ఆగి పోయేదికాదు కాలచక్రం. ప్రాణుల సుఖ దుఃఖాలతో సంబంధం లేకుండా, జనన మరణాలను పట్టించుకోకుండా తన డ్యూటీ తను నెరవేరుస్తూనే వుంటుంది. ఆ చక్ర భ్రమణంలో గంటలు, రోజులు, నెలలు, సంవత్సరాలు సునాయాసంగా జరిగిపోతూనే వుంటాయి—

గడిచిన ఎనిమిది సంవత్సరాల కాలంలో చాలానే విశేషాలు జరిగాయి—

తాము ఈ వూళ్లోనే వున్నంత కాలం మాష్టారెంత ప్రయత్నించినా తమ కుర్రాడు బాగు పడడని భావించిన ఎమ్మెల్యేగారు-కుర్రాడిని ఒక ఆదర్శ పౌరుడిగా, స్కూలు మొత్తానికే ఉత్తమ విద్యార్థిగా తయారుచేసి, తమకి అప్పజెప్ప వలసింగా ఒక పెద్ద బాధ్యతను మాష్టారి మీద మోపి, సతీ సమేతంగా

హైద్రాబాదు వెళ్లి పోయారు.

వాడికయ్యే ఖర్చు తప్పించి, ఒక్క పైసా ఎక్కువ తీసుకోనన్న షరతు మీద మాస్టారు వాడి బాధ్యతను ఎమ్మెల్యే గారి నుండి స్వీకరించారు.

అయితే—

రెండు సంవత్సరాల క్రితం—

కారు ప్రమాదంలో ఎమ్మెల్యేగారు, ఆయన భార్య మరణించారు. ఎవ్వరికీ తెలియకుండా, రాజకీయాల్లో తన స్థానం నిలుపుకోవడానికి ఆయన చేసిన అప్పులకే ఇల్లు, ఆస్థి అప్పులవాళ్ళ పరమయి పోయాయి. దాంతో రాజా బాధ్యత పూర్తిగా మాస్టారిమీదే పడింది. వెనుకంజ వెయ్యక, భగవంతుడి మీద భారం వేసి, ధైర్యంగా ఆ బాధ్యతని స్వీకరించారు మాస్టారు.

ఆయనకి తప్ప ఎవ్వరికీ వాడు ఆనాటికీ ఈనాటికీ తలవంచలేదు.

వాడు పరీక్షలు సరిగా వ్రాయని కారణంగా, వాడి పొగరు అణచడానికి నాలుగు, అయిదు తరగతుల్లో చెరొక ఏడాది అపు చేయించేసారు మాస్టారు. ఆకారణంగా ఇప్పటికి వాడు తొమ్మిదవ తరగతిలోవున్నాడు. పద్మ వాడిని మించి ఓ తరగతి ముందుంది. మాస్టారికి వీలు కానప్పుడు ఆమే వాడికి గురువు. చదువులో వాడిక్లాసులో ఫస్టు వాడే.

మాస్టారంటే ఎనిమిది సంవత్సరాల క్రితం మొట్ట మొదట సారిగా వాడికి కలిగిన భయం ఇప్పటికీ అలాగేవుంది. ఆయన కళ్లెర్రజేస్తే తల ఎత్తడు.

మాస్టారికి వూరంతా జేజేలు పలికింది. ఊరిపిల్లలకీ, పెద్దలకీ ఆయన దైవసమానడు. రాజులాంటి తుంటరిని దారిలోకి తేగలిగిన మేధావి. ఇక ఆయనకి వేరే వూరు బదిలీ అయ్యే ప్రశ్నేలేదు. అయ్యే ప్రమాదమే వస్తే వూరు ఆశేషం అడ్డు పడేటట్లున్నారు.

ం ం ం

ఈ రోజు—

స్థాణువై నిలబడ్డ మాస్టారి చేతిలో కాగితం, గాలికి అల్లల్లాడుతూన్న దీపంలా రెప రెపలాడింది. కళ్ళు పంక్తుల వెంట పరుగెత్తాయి—

"మాస్టారూ—

మీరే తెలివైన వారను కుంటున్నారు కదూ? నన్నేదో ఉద్ధరించేసే నను కుంటున్నారు కదూ? నా పొగరణిచేసే నను కుంటున్నారు కదూ? అదంతా మీ వెర్రి! నాలో ఎంత మాత్రం మార్పు రాలేదు. నాకు అవసరమయినంత మట్టుకే మీ నుంచి నీరి పాఠాలు నేర్చుకున్నాను. మీరు నేర్పిన పాఠాలలో ఓ కే బుద్ధి చెప్పేరోజు కోసమే ఇన్నాళ్ళూ ఎదురు చూసాను. మీ వ్రేలితో మీకన్ను పొడిచే అవకాశం కోసమే తహ తహ లాడాను. అది ఇన్నాళ్ళకు దొరికింది.

చిన్నప్పట్నుంచీ కూడా నా మాటకీ నాపద్ధతికి వ్యతిరేకంగా పలికే వారంటే నాకు విపరీతమయిన కోపం. నన్నుద్ధరించే నెపంతో మీరీవూళ్లో దాపురించక పూర్వం వరకూ నాదు మహారాజు భోగం సాగింది. ఊళ్ళో నా మాటకు, చేష్టకు తిరుగు లేదు. మీరే వచ్చివుండక పోతే మకుటంలేని మహారాజులా ఈ వూరుని ఏలి వుండే వాడిని. నా పాలిట శత్రువు మీరు. అందుకే నా నరనరాల్లో మీ మీద

అంతులేని ద్వేషం. అది బహిర్గతం చెయ్యాలంటే నా నోట్లోంచి మాటరాదు. మిమ్మల్ని చూస్తేనే దడ.

నన్ను రాజాలా పెంచక, బాగు పడాలంటూ మీ దగ్గర వదిలిన నా తల్లి దండ్రులంటే చెప్పలేనంత అసహ్యం నాకు. అందుకనే వాళ్లు చచ్చిపోతే కూడా నాకు కన్నీళ్లు రాలేదు.

మీ పాఠాలతో, నీతి బోధనలతో; విసిగించి, విసిగించి చంపారెన్నాళ్ళో. పూల బాటలో సాగవలసిన నా బాల్యాన్ని నిప్పుల పాలు చేసారు. మీరు నాకు గుణ పాఠం నేర్పాననుకున్నారు. మీకు వీలు కానప్పుడు మీ అమ్మాయిచేత పాఠాలు చెప్పించారు. నన్నెంతగా చిన్నబుచ్చాలో అంతగానూ చిన్నబుచ్చారు. కాని, అసలు సిసలు గుణపాఠం ఇప్పుడు నేను నేర్పు తున్నాను మీకు. నా చిన్నప్పుడు మొట్ట మొదట సారిగా మీరు నన్ను కొట్టిన దెబ్బ కంటే గట్టి దెబ్బ యిప్పుడు నేను కొడు తున్నాను మీకు. మీరు కల్లో కూడా వూహించివుండరు నా నుండి ఈ దెబ్బని. "మీ అమ్మాయిని లేపుకు పోతున్నాను" బలవంతగా మాత్రం కాదు. "నేను ఈ క్షణమే ఎవ్వరికీ కనబడకుండా పోతున్నాను. నువ్వొకర్తవే నాకు కావాలి-వస్తావా" అన్నానంతే. ఏ బలవంతం లేకుండా తనంత తానై వస్తోంది నాతో. మీరు, మీ కూతురు నాకు చెప్పిన పాఠాల కంటే-మీకు ఏ మాత్రం అనుమానం రాకుండా, నా మీద ఆమెకు విపరీత మయిన మక్కువ కలిగేలా నేను మీ అమ్మాయికి నేర్పిన పాఠాలు గొప్పవి కావంటారా? నేను ఏది ఎలా చెప్తే అదే వేద వాక్కని ఇప్పటికయినా ఒప్పు కుంటారా? నేను ఏనాడో ముక్కుపచ్చ లారని రోజుల్లోనే ఆకతాయి తనంగా చదివిన "కప్పు ఉప్పురంబు నక్క పోలిక నుండు ." పద్యాన్ని, శిరను వంచి ఆ విధానంలోనే అంగీకరిస్తారా?

మాష్టారూ-మీకు తిరుగులేని దెబ్బ లియ్యాలనుకున్నాను. తీసాను. అంతే!! మీరు చెప్పే నీతులు, సూక్తులు అన్నీ నా విజయం ముందు బలాదూర్!!

• ఇట్లు, మీ ప్రియశిష్యుడు-రాజా!"

-ఉండేలు దెబ్బతిని, చావు బ్రతుకుల మధ్య కొట్టాడుతూన్న పక్షికి సపర్యలు చేసి, గాలిలో వదిలివేస్తే, అది పోతూ కంట్లో రెట్ట వేసిపోయిన పరిస్థితి....

నెమ్మదిగా వరండాలోని పడక కుర్చీలోకి చేరి, శూన్యంలోకి చూస్తూ తనలో అనుకుంటున్నట్టు అన్నారు మాష్టారు, "లేదురాజా! అప్పటికీ, ఇప్ప టికీ, ఎప్పటికీ నేను అనేది "ఉప్పుకప్పు రంబు ... అనే" అని.

ం ం ం

అసురసంధ్య అయిపోయి కారు చీకట్లు కమ్ముతున్నాయి ఇలాతలాన్ని.

కరెంటు కూడా పోవడంతో పేటంతా కటిక చీకటి. మాష్టారు కుర్చీలోనుంచి లేవలేదు. నట్టింట దీపం వెలిగించ లేదు. అలాగే గుమ్మం వైపు చూస్తూ కూర్చుని వున్నారు.

మరో గంట గడిచింది.

ఆయనలో మార్పేమీలేదు.

అదే చూపు.

అకస్మాత్తుగా గుమ్మంవద్ద ప్రత్యక్ష మయిన రెండు ఆకారాల్ని చూసిన ఆయ

నలో ఉత్సాహం ఉబికి వచ్చింది గాని, బలవంతంగా అణచుకున్నారు. రాజా, పద్మ!!

పరుగుపరుగునవచ్చి, మాష్టారికాళ్ళని చుట్టేసి, భోరున ఏడ్చేస్తూ, "నన్ను క్షమించండి మాష్టారూ" అంటూ కన్నీళ్ళతో ఆయన పాదాలకు అభిషేకం చేసేడు రాజా.

మాష్టారు కదలలేదు. అలాగే కూర్చుని వున్నారు.

ముగ్ధలా నడుచుకు వచ్చి, మోకాళ్ళ మీద కూర్చుని, తండ్రి ముఖంలోకి దివ్యానుభూతితో చూస్తూండి పోయింది పద్మ.

"మీరే గెలిచారు మాష్టారు—మీరే గెలిచారు." వెక్కుతూ అన్నాడు రాజా. ఎంత సేపూ మిమ్మల్నెలా దెబ్బ తియ్యాలా అనే మూర్ఖంగా ఆలోచించాను గాని, మీ హృదయాన్ని నేను ఆక్రమించుకున్నంతగా ఈ ప్రపంచంలో ఎవ్వరూ, ఆఖరుకి మీ ఒఖ్ఖగానొక్క కూతురు కూడా ఆక్రమించుకోలేదని గ్రహించలేక పోయాను. పద్మని నా మాటలో, పడగొట్టి నాతో లేపుకుపోయి, మీకు పాఠం నేర్పాననే అనుకున్నాను గానీ—ఆమె నాతో అంత ధైర్యంగా స్వతంత్రించి రావడానికి మీరే కారణం అని గ్రహించలేక పోయాను. ఈ ప్రపంచంలో అన్నిటికంటే అందరికంటే చివరకి మీ కంటే కూడా నాకే ప్రాధాన్యత యిచ్చి, నన్ను కంటికి రెప్పలా చూసుకోవాల్సిన బాధ్యత మీ తర్వాత ఆమెకుందని, దేనినయినా, ఎవరినైనా, మిమ్మల్నైనాసరే వదలి పెట్టడానికి సిద్ధపడి, నేను నాశనం కాకుండా కాపాడమని తనకి మీరు ఏనాడో ఉపదేశించారని, అందుకనే మీతో ఒక్కమాటయినా చెప్పకుండానే తను నాతో రావడానికి సిద్ధ పడ్డానని పద్మ రైలులో చెప్పినప్పుడు-క్రిందకు దూకి ఆత్మహత్య చేసుకోవాలన్నంత సిగ్గేసింది మాష్టారూ, మీముందు నేనెంత?! మీరే నెగ్గారు మాష్టారూ. మీరు చెప్పిందే నాకు ఇక వేదవాక్కు.

"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ-నిజంగా

వేమనగారు చెప్పిన పుణ్య పురుషులు మీరే మాష్టారు ... మీరే ." అంటూ బావురు మంటూన్న శిష్యుడి ముఖాన్ని, అవ్యాజమైన వాత్సల్యంతో హృదయానికి హత్తుకుని, తలనిమురుతూ, నుదుట చుంబించి, కూతురికళ్ళల్లోకి అభినందిస్తూ చూసారు మాష్టారు.

అంతకంటే ఆనందమయమైన సమయం ఏముంటుందీ ఆయన జీవితంలో?!

---

**అంకితం**

పులుల్లాంటి విద్యార్థులచేతకూడా
'దాసోహం' మాష్టారూ అనిపింపజేసుకుని,
బండల్లాంటి అనేక హృదయాల్ని
చదువుల తల్లికి దండలుగా సమర్పించిన
నా తండ్రి కీ. శే. తులసి రామమూర్తి
శాస్త్రిగారికి

-తులసి బాలకృష్ణ

---

# యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు

# డబ్బు

(జరిగిన కథ)

గాంధీ హారిక దగ్గర నుంచీ పరిచయ పత్రం తీసుకుని నాగభూషణాన్ని కలుసుకున్నాడు-తన ప్లాన్ వివరించాడు-ఆస్తులు వేలం వేస్తున్నట్టు శ్రీ ముఖం వచ్చింది. వెంటనే లక్ష్మి సంపత్‌కుమార్ని వప్పించి గడువు సంపాదించింది. కథమలుపు తిరిగి గాంధీ స్టాక్ ఎక్స్చేంజిలోకి దిగిపోయాడు-EIA వేలంలో అప్పులు తీర్చగా 5 లక్షలు మిగలడం, కారు కొనడం అయింది. అప్పుడు వచ్చాడు లక్ష్మి అన్నయ్య ఫోర్స్‌డ్ గెస్ట్-కష్టాలు చెప్పుకుని సంసారంతో దిగాడు-ఆ రాత్రే ఆ చిత్రమైన వ్యక్తికి విచిత్రంగా ఓ ఫోన్ కాల్ కనెక్షన్-అటునుంచీ ఫోన్‌లో రాజారామ మోహనరావు!

—ఇక చదవండి—

# 16

గాంధీ స్టేటస్ పెరిగింది. ఆ ఇల్లు కూడా మార్చేసి, ఇంకో పెద్ద ఇల్లు తీసుకున్నాడు. ఈ ఇంటిముందు పోర్టికో, కారు పెట్టుకోవటానికి గారేజీ కూడా వున్నాయి. ముందు గదిని ఆఫీస్ చేసేడు. పుస్తకాలు పెట్టుకొనే రాక్‌లో స్టాక్ బ్రోకర్ల గురించి తను కొన్న పుస్తకాలూ, తను సేకరించిన పుస్తకాలూ పెట్టాడు. ఒక టైప్ మిషన్ కూడా కొన్నాడు. లక్ష్మికి టైప్ వచ్చు. మంచి బట్టలు ఒకటి రెండు సూట్లు కూడా తీసుకొన్నాడు.

ఇక్కడో విషయం గమనించాలి. అతడికి ఈ డబ్బు రాకముందు కూడా, తను కావాలనుకొంటే ఈ పన్లన్నీ చెయ్యొచ్చు. కానీ వీటి అవసరం అప్పుడు లేదు. కారూ, సూట్లూ ఇవన్నీ మనిషిని నిచ్చెన మెట్లమీద పైకి తోసే ఆయుధాలే.

స్థలం అమ్మగా వచ్చిన లాభంలో ఒకలక్ష బాంక్‌లో డిపాజిట్ చేసాడు. మిగతా నాలుగు లక్షలు పెట్టి స్టాక్ ఎక్స్చేంజిలో వ్యాపారం మొదలు పెట్టాడు. కొన్ని సార్లు నష్టం వచ్చేది....కానీ చాలా కొద్దిసార్లే ! స్వతహాగా తెలివి తేటలున్న వాడవటం చేత ఎక్కువసార్లు లాభమే వచ్చేది.

స్టాక్ ఎక్స్చేంజి బ్రోకరు పేరు లాలా!

అతడు వయోవృద్ధుడు. చాలా అనుభవం, నిజాయితీ వున్నవాడు. సాధారణంగా బ్రోకర్లలో మంచివాళ్ళు వుండరు. వీళ్ళని అందుకే "షార్క్స్" అంటారు. లాలా అటువంటి వాడుకాదు. ఇద్దరూ కలిసి ప్లాన్ చేసేవారు. దేని ధరలు పడిపోరాయో, దేని ధరలు పెరుగుతాయో ఎప్పటికప్పుడు చర్చించుకొనే వాళ్ళు.

కాలం నెమ్మదిగా గడుస్తూంది. నాలుగు లక్షలు అయిదు లక్షలయ్యాయి.... అప్పటికి ఆర్నెల్లు గడిచాయి. అంటే గాంధీ పందెం కాసి మూడు సంవత్సరాలు పూర్తయ్యాయి అన్నమాట. ఆర్నెల్లల్లో రెండు లక్షలు లాభం బైట వాళ్ళకి చాలా ఎక్కువగానే కనబడ్తుంది. కానీ స్పెక్యులేటివ్ బిజినెస్‌లో,నాలుగు లక్షల పెట్టుబడి

మీద, అది చాలా తక్కువ లాభం.

లక్ష్మికి కూడా పనెక్కువగానే వుండేది. ప్రతిరోజూ బిజినెస్‌కి సంబంధించిన వార్తా పత్రికలు చూడటం, ముఖ్యమైన విషయాలు నోట్ చెయ్యటం-టైప్ చేసి, కాగితాలు పంపించటం, లాభాల వారెంట్లు, అకౌంటు పుస్తకాలు వ్రాయటం లాటి అన్నీ పన్లూ ఆమే చేసేది. ఇదంతా ఊపిరిసలపనంత పని. దానికి తోడు గాంధీ తన ప్లాన్లని అనుక్షణమూ మార్చేసేవాడు. ఏ షేర్లమీదా ఎక్కువకాలం పెట్టుబడి పెట్టే వాడుకాదు. కొద్దిగా ధర పెరగ్గానే అమ్మేసేవాడు.

ఆ ఇంట్లో వున్న ఇంకో వ్యక్తి హనుమంతరావు. అతనెప్పుడూ ఇంట్లో వుండేవాడుకాడు. అలా అని బైట పనులు కూడా ఏమీలేవు. కిళ్ళీ కొట్లో కారమ్స్ ఆడటం-, సాయంత్రమైతే బ్రాకెట్టు ఇవీ అతడి పనులు. రాత్రితోనే [illegible]గేవాడు.

ఏ పనీ లేనిది ప్రియంవదకే!

ఇంట్లో ఏమీ తోచేదికాదు ఆమెకి. లక్ష్మి కూడా మనసుతో అసలు మాట్లాడేది కాదు. అయినా ప్రియంవద దాన్ని అంతగా పట్టించుకోలేదు. ఆమెకు గాంధీ ఒక అద్భుతమైన వ్యక్తిగా కనిపించ సాగాడు. అప్పటి వరకూ ఆమె వున్న ప్రపంచం వేరు. అక్కడి మనుష్యులు జీవితాన్ని చాలా తేలిగ్గా తీసుకొనేవాళ్ళు. భర్త స్నేహితులు వచ్చేవారు. సినిమాలకీ షికార్లకీ వెళ్ళేవాళ్ళు. పాశ్చాత్యసం తాలూకు మెరుపు శరీరంలోపుంచి కాబట్టి ఆ చిన్న గుంపులో-ఆ ప్రపంచంలో కాలం వెలిగిపోతూ-అదే ప్రపంచం అనుకొనేది. అక్కడి మనుష్యులకి డబ్బు ఎప్పుడూ సమస్యే. తమ జీవితం బాగుపడదు అని కొందరనేవారు. కొంచం చదువుకున్న వాళ్ళు ఆ కంపెనీలో వుంటే, విప్లవం వస్తేగానీ లాభం లేదు అని నిట్టూర్చేవాళ్ళు. నిరాశాభరితమైన తమ జీవితాలకి చిరునవ్వు ముసుగువేసుకొని రోజుల్ని హాయిగా (గడుపుతున్నామను కుంటూ) గడిపెయ్యటమే ఆమెకి తెలిసిన ప్రపంచం.

కానీ ఇది?

ఇక్కడ మనుష్యులు పోరాడుతారు. అనుక్షణం మెదడుకి పదును పెడ్తారు. ఆ ఘర్షణంలోంచి ఉత్పన్నం అయ్యే వేడిలో జ్వలించిపోతూ వన్నె తెచ్చుకుంటారు.

ముందు తన మరదలూ, గాంధీ కలిసి వుంటున్నారంటే, ఆమె కూడా అందర్లాగే "మామూలుగానే" ఆలోచించింది. కానీ వాళ్ళతో కలిసివున్న మొదటి నాల్గు రోజుల్లోనే తన అభిప్రాయం తప్పని గ్రహించింది. తన మరదలిలో అంతర్లీనంగా అన్ని తెలివి తేటలు వున్నవని గ్రహించి రవ్వంత ఈర్ష్య పడింది కూడా. కాని అంత కన్నా ఎక్కువగా ఆమె కదిలి పోయింది గాంధీని చూసి!

మనుష్యుల్లో, ముఖ్యంగా మగ వాళ్ళలో అలాంటి వాళ్ళుంటారని ఆమెకి తెలీదు. అతడికెప్పుడూ ఒకటే ధ్యాస-చదువు, పని-పని-చదువు, అంతే.

ప్రియంవద పెళ్ళి కాక ముందు చాలా మంచి అమ్మాయి. భర్తలు భార్యల అదృష్టాన్ని రాస్తూ వుంటారు అన్న సామెత ఆమెపట్ల నిజమైంది. హనుమంత రావు

చేతిలో ఆమె జీవితం మారింది.

ఒక్కొక్కరికి ఒక్కొక్కచోట అందం వుంటుంది. కొందరికి కళ్ళల్లో, కొందరికి కనుబొమ్మల్లో ఇలా .

ప్రియంవద అందం ఆమె నడుము మెలికలో వుంది. పెల్విక్ గెర్డల్ నుంచి జాకెట్టు వరకూ నది కోసిన ఇసుక తిన్నెలా వుంటుంది ఆ వంపు-దానికి తగ్గట్టుగానే చీరె కొంచెం క్రిందికి కడ్తుంది. ఇంకో విషయం ఏమిటంటే తన అందం ఎక్కడుందో ఆమెకి తెలుసు.

ఆ అందానికి పడని వాడు గాంధీ ఒక్కడే.

ఆమెకి మాటలు ఎక్కువగారావు. ద్వంద్వార్థం వచ్చేటట్టూ మాటలాడటం-మనసులో భావాల్ని నర్మగర్భంగా వెల్లడించటం వగైరా విషయాలు ఆమెకి తెలియవు. అంతా డైరెక్టే. అందుకే ఒక రోజు గాంధీతో ఏదో మాట్లాడుతూ వున్నప్పుడు, టేబిల్ క్రింద నుంచి కాలునొక్కింది.

గాంధీ కంగారు పడలేదు. చిన్నపిల్లాడిలా బిత్తర పోలేదు. రసికుడిలా నవ్వ లేదు. చాలా తాపీగా, కానీ సూటిగా, తపోభంగమైన ఋషిలా తీక్షణంగా చూసేడు. ప్రియంవద జీవితంలో మొదటిసారి భయపడింది.

ఆ తరువాత అతడితో డైరెక్టుగా మాట్లాడే సాహసం చెయ్యలేక పోయింది. కానీ ఆమె మనసులో కోర్కె మాత్రం హిమాలయం మీద మంచులా పెరుగుతూనే వుంది. అందని దెప్పుడూ తీపే కదా!

ం ం ం ం ం

చిన్న చిన్న సంఘటనలు జీవితాన్ని గమ్మత్తుగా మారుస్తాయి అని ముందొక చోట చెప్పబడింది. అలాటి సంఘటనే గాంధీ జీవితంలో ఒకటి జరిగింది. పాత పుస్తకాలు ఏవో సర్దుతూవుండగా ఒక వ్యాసం, ఎర్రపెన్నుతో ఎవరో అండర్‌లైన్ చేసింది కనబడింది. ఎవరో మార్క్‌చేసి వదేసినది అది, హెడ్డింగ్ చదివి, ఇంటరెస్టు కలిగి, పూర్తిగా పఠించాడు.

వరంగల్‌కి ఇరవై అయిదు కిలోమీటర్ల దూరంలో "అల్లారం బీడుగా" పిలవబడే పోరంబోకు స్థలాల్లో-అట్టడుగున మైకా నిక్షేపాలున్నట్టు వార్త అది. చాలా చిన్న వార్త. ఎవరూ పట్టించుకోనిది.

అతడి కెందుకో దానిమీద ఉత్సాహం కలిగింది.

గవర్నమెంటు ఆఫీసుకివెళ్ళి, ఆస్థలం తాలుకు వివరాలు కనుక్కున్నాడు. దాదాపు రెండు వందల ఎకరాలు అది. రాళ్లుతప్ప ఇంకేమిలేవు. ప్రాజెక్టు వచ్చిన తరువాత కూడా అక్కడ సస్యశ్యామల మవదు, అంత వట్ర.

ఆభూమి గురించి తెలుసుకున్న తరువాత అతడు మైకాగనుల ఎక్స్‌పర్ట్‌నీ, ఖనిజ శాస్త్రజ్ఞుల్నీ కలుసు కొన్నాడు. గూడూరుకీ వరంగల్‌కీ ఖగోళ పరంగానై తేనేం, నైసర్గికంగానై తేనేం దగ్గిర సంబంధాలున్నవి కాబట్టి అక్కడ మైకా దొరికే

అవకాశం వుందని వాళ్లు సలహా ఇచ్చారు. కానీ మట్టిని పరీక్షచెయ్యాలి. కొంతలోతు తవ్వాలి తర్వాత అన్నిటికీ దాదాపు నాల్గయిదు లక్షలదాకా అవుతుంది. తన దగ్గిరున్న దంతా దానిమేదే పెట్టుబడి పెడ్తే-రేపు అక్కడేమీ లేదని తెలుస్తే అంతా సర్వనాశన మవుతుంది. అందుకే అతడు తట పటాయించ సాగేడు.

బిజినెస్‌లో నిర్ణయాలు ఎంత మంచివి తీసుకున్నాం అన్నది కాదు ప్రశ్న, ఏ టైమ్‌లో తీసుకున్నాం అన్నది ముఖ్యం. నిర్ణయం తీసుకోవడం కొద్ది గంటల ఆలస్యం అవుతే దానివల్ల వచ్చేనష్టం లక్షల్లో కూడా వుండొచ్చు.

ఆ స్థలం కొందామని మళ్ళీ ఇంకోసారి అతడు ప్రభుత్వాన్ని సంప్రదించేసరికే ఇంకెవరో దాన్ని కొనేసారని తెలిసింది. ఆ కొన్నది "టి. ఎఫ్.టీ." అన్న కంపెనీ. పోరంబోకు స్థలం కాబట్టి గవర్నమెంటు చాలా చౌకగా, మొత్తం స్థలాన్నంతా రెండు లక్షలకి ఇచ్చింది. దాంట్లో గనులు తవ్వటానికి, మిగతా పరిశోధనలు చెయ్యటానికి ఇంకో ఎనిమిది లక్షలదాకా అవుతుందని అంచనా.

మొత్తం పదిలక్షల పెట్టుబడితో "టి. ఎఫ్.టి." కంపెనీ స్థాపించబడింది. ఇద్దరు మార్వాడీలూ, ఒక గుజరాతీ, అందులో డైరెక్టర్లు. త్రివేది, ఫెర్నాండెజ్, టాటావాలా అన్న ముగ్గురి పేరుమీద ఆ కంపెనీ (టి.ఎఫ్.టి) పెట్టారు. అప్పటికే తవ్వకం కార్యక్రమాలు ప్రారంభం అయ్యాయి.

గాంధీ హతాశుడయ్యాడు. నిర్ణయం తీసుకోవటం కొద్దిగా ఆలస్యం అవ్వతే ఇంత తొందరగా మిగతావాళ్ళు ఆ ఛాన్సు కొట్టేస్తారని అతడు వూహించలేదు. ప్రపంచంలో "కాంపిటీషన్" ఇంతగా వుందనుకోలేదు అతడు. ఆ కంపెనీ ఏదో తనే పెట్టేసి, రెండు లక్షల్తో ముందు స్థలం కొనేసివుంటే, తర్వాత షేర్లు మార్కెట్లో రిలీజ్ చేసివుంటే, జనమే వాటిని కొనుక్కుని వుండేవాళ్ళు. తాను మానేజింగ్ డైరెక్టర్ అయి వుండేవాడు. అయినా ఇప్పుడు కూడా పెద్దగా సమయం మించిపోయింది లేదు.

ఆల్లారం బీడులో మైకా గనుల గురించి వార్తాపత్రికల్లో వార్తలు రాసాగేయి. ప్రభుత్వం కూడా దీనిమీద ఒక స్టేట్‌మెంట్ ఇచ్చింది. ఇంజనీర్లు పని ప్రారంభించారు. ఆ సమయానికి టి ఎఫ్ టీ కంపెనీ తన షేర్లని మార్కెట్‌లో రిలీజ్ చేసింది. దాన్ని గురించి ఎవరూ అంతగా పట్టించుకోలేదు గానీ అందుకోసమే వేచివున్న గాంధీ వెంటనే పదివేలషేర్లు **AT PAR** కొనేసాడు.

ఇది జరిగిన రెండు నెలలకి గనుల్లో మైకా పడవచ్చుననే ఆశ కనిపించింది. పరీక్షకి పంపిన మట్టిలో ఆ ఛాయలు కనిపిస్తున్నట్టు బొంబాయినుంచి రిపోర్టు వచ్చింది.

ఆ రిపోర్టు రాగానే మార్కెట్‌లో పది రూపాయల షేరు పన్నెండు రూపాయలయింది. బొంబాయినుంచి ఆ రిపోర్టుతో పాటే వచ్చి ఒక మార్వాడీ మొత్తం మార్కెట్‌లో వున్న షేర్లు అన్నీ కొనెయ్యబోవటంతో షేరుధర పదిహేనుకి పెరిగింది.

గాంధీ అంతా గమనిస్తున్నాడు. అతడికి ఈపాటికే, పెట్టుబడి పెట్టిన లక్ష

మీదా యాభై వేల దాకా లాభం వచ్చింది.

The CENTURY Manufacturing

Telegram CENTURY

Phone 430351

**Century Spinning & Mfg. Co. Ltd.**

REGISTERED OFFICE

CENTURY BHAWAN, DR. ANI. BASANT ROAD, BOMBAY-400025

పై బొమ్మలో రెండు లెటర్ హెడ్లున్నాయి. సెంచరి స్పిన్నింగ్ మిల్స్ వారివి. అందులో ఒకటి మాత్రమే ఒరిజినల్. రెండోది డూప్లికేటు.

"డబ్బు" నవలలో క్రితం సంచికలో స్టాక్ ఎక్స్చేంజి గురించి వ్రాసినప్పుడు, చాలా మంది స్టాక్ ఎక్స్చేంజిలో అంతలా మోసాలు జరుగుతాయా అని ప్రశ్నించటం జరిగింది.

మొన్న మొన్న, అంటే జనవరి 22న ఎకనమిక్ టైమ్స్‌లో పడిన వార్త ఇది.

# Sharks out to rig Century share prices

**BY OUR SPECIAL CORRESPONDENT**

BOMBAY, January 22. Unscrupulous elements in share market ... to ... of Century Spg. and Mfg. Co. — a market leader — in order to make ... done a clever job capable of misleading gullible investors.

The faked press note gives in detail the turnover of the company for the nine months, the profits and the reasons for this performance. Further, been addressed to the various stock exchanges. This was perhaps intended to misguide the newspaper offices. However, on enquiries, it was found that no such notice has been put on the notice board of the Bombay

సెంచరీ మిల్స్ సరిగ్గా లాభాలు ఇవ్వని కారణంగా షేరు ధర పడిపోవటం మొదలు పెట్టింది. కొంతమంది "షార్క్స్" డూప్లికేటు లెటర్ హెడ్‌లు ప్రింట్ చేసి, ఆ మిల్ మానేజింగ్ డైరెక్టర్ వ్రాస్తున్నట్లుగా న్యూస్‌పేపరు వాళ్ళకి వార్తలు పంపించారు. ఆ వార్త ప్రకారం సెంచరీమిల్లు మంచి లాభాలు పొందింది.

ఈ వార్త వినగానే షేరు ధర వెంటనే పెరగాల్సింది. కానీ ఈ మోసగాళ్ళు కొన్ని తప్పులు చేసేరు. బసంత్ రోడ్‌లో ఫోన్ నెంబర్లు ఆరు సంఖ్యలు కావు.. ఏడు! ఇక్కడ గమనించే విషయం డబ్బుకోసం స్టాక్ ఎక్స్చేంజి బ్రోకర్లు ఎంతకైనా తెగిస్తారని! వ్యాపార సాగరంలో ఇలాటి వాళ్ళని "షార్క్స్" అంటారు. ఇలాటి

చిన్న చిన్న ట్రిక్స్‌తో షేరుధర ఇటూ అటూ మారేటట్టు చేసి లాభాలు గడిస్తారు. తెలియనివాడు ఏమాత్రం ఇందులో ప్రవేశించినా ఈ "షార్క్స్" కోరలకు బలి కావల్సిందే.)

ఈ లోపులో కంపెనీ డిబెంచెర్లు ఇష్యూచేసింది. పదిరూపాయలది మార్కెట్‌లో పదిహేను దాకా వెళ్ళింది. కానీ షేరు హోల్డర్లుగావున్న వాళ్ళకి వాటిని పదికే అమ్మటంతో గాంధీ రెండు లక్షలు పెట్టి డిబెంచెర్లు కొన్నాడు. అవి కన్వర్టబుల్ డిబెంచర్లు, అంటే మొత్తం లక్షా యాభై వేలు లాభం అన్నమాట. చాలా తక్కువ టైమ్‌లో....

ఆ రాత్రి గాంధీకీ, లాలాకీ మధ్య సంభాషణ జరిగింది. అప్పటికే చాలా మంది కళ్ళు టి.ఎఫ్.టీ. మీద పడ్డాయి. కానీ లాభంలేదు. షేర్లు ఎవరూ అమ్మటం లేదు. మార్కెట్ టైట్ అయిపోయింది. బొంబాయి నుంచి వచ్చిన మార్వాడీ ఎంత డబ్బైనా వెదజల్లి షేర్లు కొంటానికి ప్రయత్నంచేస్తున్నాడు. అదే సమయానికి ఒక బ్రిటిష్ కంపెనీ తన సహాయాన్ని వెల్లడించింది. ఈ సహాయం ద్వారా, తవ్వకం అధునాతనమైన పరికరాల్తో, తక్కువ ఖర్చులో జరుగుతుంది. బ్రిటిష్ కంపెనీతో ఈ అగ్రిమెంటు జరుగుతున్న రోజే, .. అల్లారంనుంచి వరంగల్‌కి రైలు మార్గం నిర్మించటానికి ప్రభుత్వం యోచిస్తున్నట్టు వార్త వచ్చింది. అదే రోజు పేపర్లో పెద్ద అక్షరాల్తో మైకా కనుగొనబడ్డట్టు కూడా వార్త వచ్చేసింది.

ఆ వార్త వచ్చిన రోజు షేరుధర ఎన్నడూ లేనంత-అంటే ముప్పైరూపాయలైంది. అయితే, షేరు హోల్డర్లకి అంతకన్నా ఉత్సాహ కరమైన వార్త ఇంకొకటి తెలిసింది. త్రివేది, ఫెర్నాండజ్‌ల మధ్య విభేదాల కారణంగా త్రివేది డైరెక్టర్‌షిప్‌కి రాజీనామా చేసేడు అన్నది. దాంతో, కొద్దిగా ఎక్కువ షేర్లున్న వాళ్ళంతా డైరెక్టర్ పదవి కోసం ప్రయత్నం చేయసాగేరు. కానీ అందర్లోకీ ఎక్కువగా షేర్లున్నది గాంధీకీ, బొంబాయి నుంచి వచ్చిన మార్వాడీకీ! అందుకే అంత అర్జెంటుగా గాంధీ, లాలాతో సంభాషణ జరుపవలసి వచ్చింది.

"ఇంకొక పదివేలదాకా షేర్లున్న పక్షంలో మనకి డైరెక్టర్ పదవి ఖాయం లాలా" అన్నాడు గాంధీ.

"పది రూపాయల షేరు ముప్పై ఇస్తామన్నా ఎవరూ అమ్మటంలేదు సాబ్" అన్నాడు లాలా.

"మిగతా వాళ్ళకి అంత లాభం కలక్కపోవచ్చు కానీ ఆ పదివేల షేర్లూ మనకెంతో లాభాన్ని చేకూరుస్తాయి. టి.ఎఫ్.టీ. డైరెక్టర్ పదవి అంటే అంత సామాన్య మైనదికాదు"

వప్పు కుంటున్నట్టు లాలా మౌనంగా వుండిపోయాడు. కానీ ఎలా మరో పదివేల షేర్లు సంపాదించటం .. వీళ్ళు ఈ ఆలోచనల్లో వుండగానే, బొంబాయి నుంచి వచ్చిన మార్వాడీ దగ్గర్నుంచి రహస్యంగా ఒక వర్తమానం వచ్చింది. గాంధీ




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:


మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులతో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.


కోల్గేట్ యొక్క సాటిలేని తర్వాగం నురుగు బాగా చొచ్చుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.


ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుంచి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా మింట్ రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.

నోటి దుర్వాసనను ఆపండి...
కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
దంతక్షయాన్ని
ఎదుర్కోండి!




DC.G.74 TL

గానీ తన దగ్గరున్న షేర్లు అమ్మదల్చుకున్నట్టయితే—నాలుగు లక్షలదాకా ధర ఇచ్చి కొంటానని!

చాలా మంచి అవకాశం!

కానీ గాంధీ అంత తేలిగ్గా బుట్టలో పడదల్చు కోలేదు. ఆ మార్వాడే అదేధరకి అమ్మితే తనే ఆ ధరకి కొంటానని తిరిగి కబురు చేసాడు. పోటీ అంటూ పడితే డైరెక్టరవటానికి గాంధీకే ఎక్కువ అవకాశం వుంది. అందుకని ఆ మార్వాడీ ఆ ధరకి వప్పుకొన్నాడు.

గాంధీ వెంటనే తన డిపాజిట్లు, మిగతా కంపెనీల షేర్లు, డిబెంచర్లు అన్నీ డబ్బుగా మార్చి మార్వాడీ దగ్గర్నుంచి కొనేసాడు, దాంతో ఇక డైరెక్టర్ అవటానికి ఉన్న ఆటంకాలన్నీ తొలిగి పోయాయి-కేవలం ఎన్నికలవటమే మిగిలింది.

గాంధీ ఉప్పొంగి పోయాడు. దాదాపు విజయం సాధించేసినట్టే ఒక్కసారి ఆ కంపెనీ డైరెక్టరై, కళ్లెం చేతిలోకి తీసుకుంటే ఇక చాలా సులభంగా ముందుకు సాగిపోవచ్చు. చాలా దగ్గర్లోనే వుంది ఆరోజు. అతడు చాలా ఆతృతగా ఎన్నికల కోసం చూడసాగాడు.

అంతలోనే ఇంకో వార్త వినిపించింది. టాటావాలా కూడా తన పదవికి రాజీనామా చేసేడు అన్నది, గనుల్లో నీరుపడి, ఇరలోతుకి వెళ్ళటం అసాధ్యం, అనవసరం అని అతడు వాదించాడు. అతడి మాట ఎవరూ వినలేదు, అందువల్ల అతడు రాజీనామా చేసాడు, అదీ కారణం.

టాటావాలా ఎందుకు రాజీనామా చేసాడు అన్నది చాలా మందికి అర్థం కాలేదు. గనులన్నాక నీరు పడటం సర్వసామాన్యమైన విషయమే కదా! అయినా కొద్దిమంది నిరాశా వాదులైన షేరుహోల్డర్లు తమ షేర్లని మార్కెట్టులో అమ్మకానికి పెట్టారు, దాంతో షేరు ధర ముప్పై రూపాయల్నుంచి ఇరవైతొమ్మిదికి దిగింది.

ఇదే సమయానికి బ్రిటిష్ కంపెనీ తనసహాయాన్ని అందించే ముందు, తన నిపుణుల బృందాన్ని పంపి పరీక్షలు చేయిస్తుంది అన్న విషయం బయట పడింది. అసలా క్లాజు ముందటి అగ్రిమెంటులోనే వుంది. ఆ రోజుల్లో దాన్నెవరూ అంతగా పట్టించుకోలేదు. అనుకున్నట్టే నిపుణుల బృందం వచ్చి పరీక్షలు చేయటం మొదలు పెట్టటంతో షేరు ధర ఇరవై ఆరుకి దిగింది.

ఈ పరీక్షలు మొదలైన పదిహేసు రోజులకి, పార్లమెంటు ప్రశ్నోత్తరాల సమయంలో అల్లారం రైలుమార్గం ప్రసక్తి వచ్చింది. ఒక ప్రైవేటు కంపెనీ కోసం ఈ లైను వెయ్యొచ్చా అన్న ప్రశ్న ప్రతిపక్షం సభ్యులొకరు వేసాడు. దానికి సమాధానమిస్తూ అలాటి యోచనే లేదనీ, ప్రభుత్వం ఆ రైలుమార్గం వేస్తున్నట్టు ఎక్కడా ప్రకటించలేదనీ మంత్రి అన్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటల వేళ ఈ వార్త బైటకు పొక్కగానే హైదరాబాద్ స్టాక్ ఎక్స్చేంజిలో టి ఎఫ్ టీ షేర్లధర ఇరవైనాలుగుకు పడిపోయింది.

ఒక్కసారిగా ఇంత ధర పడిపోవటంతో షేరు మార్కెట్లో అమ్మేవారి తాకిడి ఎక్కువైంది. "బీర్స్" విజృంభించారు. ఎవరికివాళ్ళు తమకున్న దాంట్లో కొద్దిగా అమ్మెయ్యటానికి ప్రయత్నించ సాగేరు.

గాంధీ ఏంచెయ్యటానికి తోచక తటపటాయించ సాగేడు. గంట గంటకీ ధర తగ్గిపోసాగింది.

ఇరవై రెండు.

ఇరవై..

పద్దెనిమిది.

సాయంత్రం నాలుగయ్యేసరికి ధర పద్దెనిమిది దగ్గిర ఆగింది. సరిగ్గా అదే సమయానికి బ్రిటిష్ కంపెనీ నిపుణుల బృందం, తమ పరిశోధన ఫలితాలు తెలిపింది. అక్కడ మైకా కాదుకదా-మట్టి కూడా దేనికీ పనికి రాదు అని దాని సారాంశం.

ఈ వార్త వచ్చిన పది నిమిషాల్లో నాలుగు పెద్ద సంస్థలు తామిచ్చిన అప్పు తిరిగి/చెల్లించమంటూ కంపెనీకి నోటీసులు పంపినయ్ అన్న రూమరు వ్యాపించింది.

అంతే!

పొద్దున్న ఇరవై ఆరు రూపాయలున్న షేరు ధర-సాయంత్రం స్టాక్ ఎక్స్ఛేంజి మూసే సమయానికి మూడు రూపాయలకి దిగింది.

ఆ మరుసటి రోజు కంపెనీ లిక్విడేట్ అవుతున్నట్టు వార్త వ్యాపించింది. పదిపైసలకిఇస్తానన్నా కొనేవాడు లేక పోయాడు.

గాంధీ సంపాదించిన అయిదు లక్షలూ పూర్తిగా మట్టిలో కలిసిపోవటమే గాక-ఇంకో రెండు లక్షలు అప్పులో పడ్డాడు. ఇల్లూ, కారు అమ్మేసి, మళ్ళీ పూరి పాకలోకి వెళ్ళిపోవల్సిన స్థితి తిరిగి వచ్చేసింది.

కట్టు బట్టల్తో మిగిలేడు. పెట్టుబడి పెట్టినప్పుడు పదిపైసలన్నా వుండేవి. ఇప్పుడవి కూడా లేదు.

o o o o

తెల్లగా పాలి పోయిన మొహంతో టేబిల్ మీద మోచేతులాన్చి నేలవంక చూస్తూ కూర్చొన్నాడు గాంధీ. అతడి మొహం భావన రహితంగా వుంది, మనసులో మాత్రం రకరకాల భావాలు ఉవ్వెత్తుగా లేచిపడ్తున్నాయి.

తను ఓడిపోయాడన్నది నిర్వివాదాంశం.

ఇప్పుడు ఈ రెండు లక్షల అప్పు తీర్చాలంటే - ఐ. పి. పెట్టాలి. కోర్టులో అది పూర్తయ్యే వరకూ ఏ సంపాదనా వుండదు. కోర్టు ఈ అప్పుల్నుంచి తనని విముక్తిచేసి బికారిగా (ఐ. పి) ప్రకటించటానికి ఎంత లేదన్నా ఆరేడు నెలలు పడ్తుంది. ఇంకెప్పుడు సంపాదిస్తాడు తను యాభై లక్షలు ?

అతడా ఆలోచనల్లో వుండగానే ఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తుకొని 'హలో' అన్నాడు.

"కండొలెన్సెస్" అవతల్నుంచి ఒక కంఠం వినిపించింది.

"ఎవరు మీరు."

ఆ ప్రశ్నకి అవతలి కంఠం జవాబు చెప్పలేదు. "టి. ఎఫ్. టి. అంటే ఏమిటో తెలుసా?" అంది. చిన్న నవ్వు, "టి. ఎఫ్. టి. అంటే టిట్ ఫర్ టాట్" అని ఫోన్ పెట్టేసింది. గాంధీ అలాగే రిసీవర్ పట్టుకొని వుండిపోయాడు. ఆ కంఠం ఎవరిదో అతడికి అర్థమయింది.

అది రాజారామ్మోహనరావ్‌ది!!!

ఆ షాక్ నుంచి తేరుకోవటానికి అతడికి అరగంట పట్టింది. వరుసగా ఫోన్లు చెయ్యటం మొదలు పెట్టాడు. పాత వార్తా పత్రికలు తెప్పించాడు కంపెనీ ప్రోస్పెక్టస్ తీసి మళ్ళీ చదివాడు. ఎంతో బాగా వ్రాయబడిన ప్రకటన అది. అల్లారం ఓడులో మైకా దొరికే అవకాశాల గురించిన టెక్నికల్ రిపోర్ట్ కూడా అలాగే వుంది. అయితే, ఎక్కడా వాటి మీద కోర్టుకివెళ్ళే అవకాశం లేదు. ఇలా "అయితే" అలా అవుతుంది. "కానీ" అలా "అయితే" ఇలా వుంటుంది.

ఇలా సాగింది ఆ రిపోర్టు. దాన్నిండా "అయితే" అలా, "కానీ" ఇలా చాలా వున్నాయి. ఎక్కడా మోసం ప్రసక్తే లేదు. గాంధీకి జరిగినదంతా అర్థం అయింది.

రాజా రామ్మోహనరావు లాంటి పలుకుబడి వున్న వ్యక్తికి బ్రిటీష్ కంపెనీ

నుంచి అగ్రిమెంటు సంపాదించటం కష్టంకాదు. ఆ తరువాత ఎవరో ఒక పత్రికా విలేఖరి ద్వారా ఆ రైలు మార్గం రూమరు లీక్ చేయించి వుంటాడు. ప్రజలే పిచ్చి వాళ్ళలా ఎగబడి షేర్లు కొంటే అది అతడి తప్పుకాదు.

రాజా రామ్మోహనరావ్ తన ప్రతీ కదలికనీ గమనిస్తూ వచ్చాడన్న మాట. అందుకే తను ఓ లక్షరూపాయల షేర్లు కొనగానే త్రివేదిచేత ఏదో ఒక కారణం మీద రాజీనామా చేయించాడు. గనుల్లో నీరు పడటం అన్నది కేవలం ఒక సాకుమాత్రమే!

నిజానికి రాజారామ్మోహనరావు పెట్టదల్చుకుంటే చాలా పెద్ద కంపెనీయే స్థాపించవచ్చు. కానీ కేవలం పది లక్షల్లోనే ఎందుకు పెట్టాడు? ఒక్కటే కారణం!

తనని ఆకర్షించటం.

అంటే తన దగ్గిర ఎంత డబ్బుందో అతడికి తెలిసింది అన్నమాట ఎర్ర పెన్సిల్‌తో మైకా గురించి అండర్‌లైన్ చేసి ఆ పుస్తకం తనింటికి చేరుకొనేట్టు చేసేడు. తనేదో పెద్ద రహస్యం శోధించిన వాడిలా దాన్ని ఎక్స్‌ప్లాయిట్ చేయటం మొదలు పెట్టాడు. సరిగ్గా తన దగ్గిర వున్న డబ్బుకి సరిపడా ఎత్తులో డైరెక్టర్ పదవిని పెట్టాడు. తను ఆశతో ఎగరగానే, క్రింద ఆధారం తీసేసేడు.

నిజంగా హేట్సాఫ్ టు హిమ్! శత్రువు అవుతే అవ్వొచ్చు గాక!

గాంధీ ఆలోచనల్ని భంగపరుస్తూ లక్ష్మి వచ్చింది.

"ఏమైంది" అని అడిగాడు.

"బొంబాయి నుంచి ఏ మార్వాడీ రాలేదు. నీ దగ్గిరకి వచ్చింది రామ్మోహన రావు పెర్సనల్ సెక్రటరీ. అతడే పది రూపాయలు కూడా విలువచెయ్యని షేరు సర్టిఫికెట్లు ఇచ్చి నీ దగ్గిర్నుంచి నాలుగు లక్షలు పట్టుకెళ్ళాడు." అంది.

గాంధీ మాట్లాడలేదు. మాట్లాడటానికి కూడా ఏమీలేదు. ఇంతవరకూ చట్టబద్ధంగా డబ్బు సంపాదించటం గురించి ఆలోచించాడు. ఇప్పుడు చట్టబద్ధంగా మోసం చెయ్యబడ్డాడు. అంతే! కానీ ఎంత తెలివి తేటలుతో.. ఎంత టైమ్ తీసుకొని ...ఎంత పకడ్బందీగా తనని బుటలో పడేసేడు!!

ఇందులో రాజారామ్మోహన రావుకి డబ్బు సంపాదించాలన్న ఆశ కూడా పెద్దగా లేదు. కేవలం తనని దెబ్బ కొట్టటమే. అందుకే షేరుధర కొద్దికొద్దిగా పడిపోకుండా, ఒకేరోజు పూర్తిగా జారిపోయేలా చేసేడు. పార్లమెంటులో మంత్రి ప్రకటన వచ్చిన రోజే, బ్రిటిష్ నిపుణుల అభిప్రాయం-అదే రోజు కంపెనీ మూసేసే రూమర్ కూడా వ్యాపింప జేసేడు.ఇంత జేసినవాడు-త్రివేది, టాటావాలా, ఫెర్నాండజ్‌లు కూడా తనొక్కడే అయినా ఆశ్చర్యపోనక్కర్లేదు. మంచి టి. ఎఫ్. టి.

గాంధీ లేచి "పదలక్ష్మి" అన్నాడు.

"ఎక్కడికి" అడిగింది

"మన పాకకి, అదింకా ఖాళీగా వుందో లేదో చూడటానికి" అన్నాడు.

(ఇంకా వుంది)

# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."



నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే,
చెమటకాయల పౌడర్.






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'



నైసిల్
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.

ఔషధ యుక్త—నైసిల్

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLN-4-182 TEL



# అరుదైన ఆధునిక కవిత

## ఆలూరి బైరాగి "ఆగమ గీతి"

బైరాగి మహాభినిష్క్రమణం చేసి రెండేళ్లు దాటింది. ఈలోగా తెలుగుదేశం ఋణం తీర్చుకోవలసిన పనులు కొన్ని జరిగాయి. ఒకటి—'చీకటి నీడలు', 'నూతిలో గొంతుకలు' బైరాగి మొదటి కవిత్వాల పుస్తకాలు తిరిగి అచ్చుల బయటికొచ్చాయి. ఇప్పుడు బైరాగి రాసిన అనేక కవితలు, కొన్ని ముద్రితాలు, చాలా అముద్రితాలు, అనేక అనువాదాలు కలిపి 'ఆగమ గీతి' పేర పెద్ద పుస్తకంగా వెలువడింది.

తెలుగు నేలకీ, తెలుగు ఆకాశానికీ, తెలుగు జీవితానికీ, తెలుగు సాహిత్యానికీ అరుదైనకవి బైరాగి. చమత్కారాలకీ, ప్రబోధాలకీ, సిద్ధాంతాల అంధ అనుకరణలకీ, జీవితంలోనూ సాహిత్యంలోనూ ఎక్కువగా కనబడే కపటత్వానికీ, ద్వంద్వ నీతికీ అతీతుడు బైరాగి. నిప్పులా నిజాయితీగా బతికినవాడు. నమ్మినదాన్ని నిక్కచ్చిగా రాసిన కవి బైరాగి. ఏ ఎండకా జెండా ఎత్తని మనిషి, కవి బైరాగి. రాసేది, కూసేదీ ఒకటి కాని చాలా మంది కవులకీ, నూనె మిఠాయి సాహిత్యమే జీవితాంతం తింటున్న పాఠకులకీ బైరాగి కవిత్వాలు చదవంగానే అర్థంకావడం కష్టం.

బైరాగిని నిరాశా కవిగా, సంశయ కవిగా, లోక మార్గానికి దూరంగా బతికిన కవిగా కొంత మంది విమర్శకులు అంచనా వేశారు. బైరాగి విషయంలో పొరపాటు పడడానికి ఎక్కువ అవకాశముంది. ఆధునిక తాత్విక భావన అంటూ ఏమీలేని భారత దేశ జీవితంలో పాలకుల గూండాయిజం, ప్రజల అజ్ఞానం కలిసి ప్రజాస్వామ్యంగా, ...



# టాప్ స్టార్ ఉన్న కప్పు ఏది?



చూడండి, ఇక్కడ
చిక్కని, కమ్మని టీ ఉన్నది

500 గ్రా.,
250 గ్రా.,
100 గ్రా.లలో
దొరుకుతుంది.

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం**
**రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్షలో లిప్టన్ టాప్‌స్టార్‌దే గెలుపు చూడగానే తెలుస్తుంది దానిలోని ప్రత్యేకత తాగగానే తెలుస్తుంది దానిలోని ఘాటైన రుచి.




## లిప్టన్ టాప్‌స్టార్ టీ

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**




LINTAS LTS 8-1811 TL

మినీ కథ

# మాయాలోకం

ఎం. డి. సౌజన్య

సినిమా సెట్లో, ఒక రోజు సినీతార మాలిని తన ముప్ఫయి రెండవ పుట్టిన రోజు పండుగను, యిరవై మూడో పుట్టిన రోజు పండుగగా ఘనంగా జరుపు కుంటోంది ఒక సినిమా షూటింగ్-విరామ సమయంలో!

బిజీతార మాలిని ఆప్త మిత్రులు కొందరు సరాసరి ఆసినిమా సెట్లోకే వచ్చి పార్టీలో పాల్గొంటున్నారు. మాలిని ఉభయాహారి కావటంతో "వెజ్"-"నాన్ వెజ్" వంటకాలు ఘుమ ఘుమ లాడి పోతున్నాయి.

మాలిని తన ప్రక్కనే కూర్చున్న బ్యూటీ పార్లర్ నడుపుతున్న డాక్టర్‌తో "డాక్టర్! నన్ను పెద్ద నిర్మాతలంతా పారిస్ బ్యూటీ కంటెస్ట్‌కు వెళ్ళ మంటు న్నారు! నాకేమో డైటింగ్ చేసి యింకా స్లిమ్‌గా తయారై వెళ్ళాలని వుంది. వెజిటేరియన్ డైట్ ఏం తీసుకుంటే మంచి దంటారు?" అంది

"ఆకు కూరలు, పళ్ళు—ముఖ్యంగా లెమన్, ఆరంజి మంచివి! దుంప కూరలు-అరటి పళ్ళొద్దు!" అన్నాడు సలహాయిస్తూ.

"థ్యాంక్యూ! థ్యాంక్యూ!...ఆ... ...బై దిబై ......నాన్ వెజిటేరియన్ సంగతి చెప్పండి....అది తినకుండా ఉండలేను!" అంది, మాలిని నవ్వుతూ.

"చికెన్ మంచిది... మటన్‌సూప్ ఓకప్పు, రెండు స్లయిస్డ్ రొట్టెల్తో మంచిది!.... లిక్విడ్ డయిట్ మంచిది! బట్టర్ వాడ కండి....కర్డ్ వద్దు... బటర్ మిల్క్ తీసు కోండి!; మార్నింగ్ లైట్ ఎక్సర్ సైజ్!" అంటూ చెబుతున్నాడు.

ఇంతలో నిర్మాత మురుగన్ వచ్చి "మాలినిగారూ! మీకభ్యంతరం లేక పోతే ఈ సెట్లో జరుగుతున్న మీ బర్త్ డే విందు పార్టీని కలర్‌లో రెండు రీళ్ళుగా షూట్ చేయమంటాను!" అన్నాడు.

"షూర్...షూర్... యు కెన్ ప్రొసీడ్ యు కెన్ ప్రొసీడ్!" అంది, అక్కడి నుంచి లేచి వెళ్ళి మళ్ళీ కాస్త ట్రిమ్‌గా మేకప్ కావటానికి.

ఇంతలో బ్యూటీ పార్లర్ డాక్టరు తన ప్రక్కనే ఉన్న వ్యక్తితో "ఏమో అను కున్నాను! మాలిని గొప్ప నటే కాదు.... చాలా తెలివి కలది కూడాను! చూశారా నా బ్యూటీ పార్లర్‌కొచ్చి అడిగే సలహా లన్నీ నయాపైసా ఖర్చు లేకుండా తెలివిగా అడిగి తెలుసుకుంది!" అన్నాడు.

ఆ నల్లకోటు వ్యక్తి చిరునవ్వుతో సమాధానం చెప్పకుండా దాటేశాడు.

అయినా డాక్టర్ ఆ నల్లకోటు వ్యక్తిని వదలకుండా "ఇదే సలహా




డైటింగ్‌కు సంబంధించి ఎవరికి చెప్పినా.. నేను రెండొందలు చార్జి చేస్తాను! రేపు రెండొందలకు బిల్లు పంపుతాను!.. పంపటం కాపుంటుందంటారా? మీరు సలహా చెప్పండి!" అన్నాడు.

"తప్పకుండా పంపండి! సినిమా సెట్‌తో బర్త్‌డే పార్టీ అని-ప్రొడ్యూసర్ అరేంజ్ చేసినట్టే చేసి, యీ బర్త్‌డే పార్టీ షూట్ చేసి, దాన్ని ఏకత్ర సినిమాతో కలిపి చూపించి, డబ్బు చేసుకుంటాడు ప్రొడ్యూసర్!! అలాంటప్పుడు బ్యూటీ పార్లర్ డాక్టర్‌గా మీరిచ్చిన సలహాకు తప్పక ఫీజు వసూలు చేయవచ్చు!" అన్నాడు తన సలహానిస్తూ.

డాక్టర్ ముఖం ఆనందంతో విప్పారింది ఇంతలో మాలిని సెక్రటరీ వచ్చి "సార్! మా మిస్ మాలిని గారి ప్రక్కన ఎవరుంటే వాళ్లు అయిదు వేల విలువచేసే వజ్రాల ఉంగరం ప్రెజెంట్ చేయాలట! మా మాలుగా అయితే ఆమె సినిమా షూటింగ్‌కు గంటకు యాభై వేలు చార్జి చేస్తారు! ఇది మాలిని గారి బర్త్‌డే పార్టీ షూటింగ్ కాబట్టి ఇదో ఛాన్స్.... ఏక్ అదృష్ట వంతులెవరో ముందుకు రావాలి! అన్నాడు.

పార్టీకొచ్చిన వారంతా ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెడుతుండగా

"ఆ అయిదువేలు నేనే యిచ్చుకుంటాను ఇదిగో చెక్!" అంటూ మురుగన్ అయిదు వేలకు చెక్! అందించి, మాలిని ప్రక్కనే సీటు ఆక్రమించాడు.

రెండవ రోజు బ్యూటీపార్లర్ డాక్టర్ మాలినికి రెండు వందలకు బిల్లు పంపి సంతోషిస్తుండగా పులిమీద పుట్రలా లాయర్ నోటీసొచ్చింది "డియర్ డాక్టర్! మీరు నిన్న మాలిని పార్టీలో నన్ను ఒక సలహా అడిగారు' దానికి లాయర్‌గా నా ఫీజు మూడు వందలు పంపండి!" అని వుంది.

మి నీ క థ

# అపురూప

## వీరపల్లె వీణావాణి

అపురూప మాకు సీనియర్.

పైగా ఆ అమ్మాయి న్యూ హాస్టల్లో ఉంటోంది. నేనుండేది ఓల్డ్ హాస్టల్లో. అందుచేత ఆ అమ్మాయితో నాకు పరిచయం తక్కువ. అంతేగాక నా మనస్తత్వం చాలా విచిత్రమైంది. నాకు కలుపుగోలుతనం తక్కువ ఎప్పుడూ ముభావంగా ఉంటాను. అపురూపతో నాకు పెద్దగా పరిచయం లేక పోడానికి యిదీ ఓ కారణమే.

నేను ఎం. ఏలో చేరి రెండు నెలలు కావస్తోంది.

ఎం.ఏలో చేరకముందు .. యూనివర్సిటీ జీవితాన్ని గురించి నేను ఎన్నో రంగుల కలలు కన్నాను. తీరా ఎం. ఏలో చేరి హాస్టల్లో రెండు నెలలు గడిచేసరికి... ఈ హాస్టల్ జీవితంమీద అసహ్యం పుడుతోంది. హాస్టల్లో అందమైన అమ్మాయి అందంగా లేని అమ్మాయిలతో స్నేహం చెయ్యదు. వాళ్ళతో షాపింగ్‌కు వెళ్ళదు. ఒకే కులానికి చెందిన అమ్మాయిలందరూ ఒకే జట్టుగా ఉంటారు. తక్కువ కులం అమ్మాయిలను అసహ్యించుకొనేవాళ్ళు కొంత మంది. మంచి మంచి ఖరీదైన బట్టలు.... టేప్ రికార్డర్స్, ఫాన్ కెమెరాలు మొదలైన విలువైన వస్తువులు గల అమ్మాయిలతో స్నేహం చేసి అస్తమానమూ వాళ్ళని ఛత్రాజుల్లా పొగిడేవాళ్ళు కొంత మంది. ఏ అమ్మాయో వాళ్ళ క్లాసు అబ్బాయితో మాట్లాడుతుంటే....చూసి వాళ్ళిద్దరి మధ్య లేనిపోని సంబంధాన్ని వాళ్ళకు అంటగట్టి ఒక హిట్ పిక్చర్‌కి సరిపోయే కథను తయారు చేసే వాళ్లు కొంతమంది. నిజానికి హాస్టల్ ఒక ఊబిలాగా అన్పించింది నాకు.

అందంగా ఉండే అమ్మాయిలు.... తమ ప్రిస్టేజి ఎక్కడ దెబ్బ తింటుందోనని అందంగా లేని అమ్మాయిలతో స్నేహం చెయ్యరు, వాళ్ళతో షాపింగ్‌లకు సినిమాలకు షికార్లకు తిరగరని ఎవరో చెబితే నేను నిజం అనుకొన్నాను. కానీ....అపురూప అందుకు విరుద్ధం. ఆ అమ్మాయి.... అందంగా లేని వాళ్ళతోనే స్నేహం చేస్తుంది. వాళ్ళతోనే సినిమాలూ షికార్లూ పిక్‌నిక్‌లూ వెళుతుంది. తాను అందమైన దాన్నని డబ్బున్న అమ్మాయినని ఎప్పుడూ గర్వపడదు. ఇలా చాలా మంది అపురూపను గురించి హాస్టల్లో చెప్పుకొంటుంటే....నేనూ నమ్మక తప్పలేదు

ఆ రోజు... ఆదివారం మధ్యాహ్నం.... భోజనం చేశాక నా ఫారిన్ నైలక్స్ చీరని ఉతికి రూం ముందు వైర్ మీద ఆరబెడుతుంటే...."హల్లో శోభా!" అంటూ మా రూంకొచ్చింది అపురూప.

"రండక్కయ్యా కూర్చుందురు" అంటూ ఓ చిరునవ్వు నవ్వి రూంలోకి తీసుకెళ్ళి... ఓ కుర్చీలో కూచోబెట్టాను అపురూపను.

"శోభా! నాకో సందేహం. ప్రీవియస్ వాళ్ళందరూ ఎందుకు ఫైనల్ వాళ్ళను అక్కయ్యా అని పిలుస్తారు? పేరు పెట్టి పిలిస్తే చాలు అన్నట్టు మనం యివాళ మ్యాట్నీకి వెళ్ళాలి"

"లేదక్కా మీరు వెళ్ళిరండి" అన్నాను.

"ఇదేం కుదరదు. నువ్వూ రావాల్సిందే అయినా... నలుగురితో కలవకుండా ఒంటరిగా ఉండిపోతే ఎలా శోభా?" అంటూ మ్యాట్నీకి బలవంతం చేసింది.

అపురూప బలవంతం చెయ్యడంతో యిక బయల్దేరక తప్పింది గాదు. "సీతా! నేను పిక్చర్ కెళ్ళుతున్నా చీర ఆరిపోగానే తీసి రూంలో పడెయ్యి" అంటూ మా రూం మేట్ కు చెప్పి అపురూపతో బయలుదేరాను.

రెండు గంటలకు డి. ఆర్. మహల్ రిక్షా దిగాం

మేము మొత్తం ఆరుమంది అమ్మాయిలం రిక్షాలతో వచ్చాం. వ్యానిటీ బాగ్ లోంచి టికెట్స్ తీసుకోటానికి నేను డబ్బు తీసుకొంటూ ఉండగానే అపురూప తనే ఆ టికెట్స్ పట్టుకొచ్చింది సినిమా అయిపోయాక అయిదున్నరకు ఖీమా హోటల్లో ఎ. సి. రూంలోకెళ్ళి కూర్చున్నాం. టిఫిన్ పూర్తి అయ్యాక డబ్బు నేను యిస్తుంటే నాతో పోట్లాడి అపురూప తనే బిల్లు చెల్లించింది చివరకు హాస్టల్ ముందు రిక్షా దిగాక ఛార్జి కూడా .. ... నేనిస్తుంటే ఒప్పుకోకుండా... తనే మూడు రిక్షాలకు ఛార్జి యిచ్చేసింది.

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు

నా బుర్ర నిండా అపురూపను గురించిన ఆలోచనలే. నాకో బలహీనత ఉంది. అదేమిటంటే... ఒకరితో కాస్త పరిచయం కాగా ఏర్పడ్డాక ఆవ్యక్తిని గురించి ఆలోచించి. ఆ వ్యక్తి ప్రవర్తనను మాటలను పరిశీలించి వారిమీదొక అభిప్రాయాన్ని ఏర్పాటుచుకోవడం అపురూపను గురించి చెడుగా చెప్పారు నాకు. కానీ... యివాళ అపురూప ప్రవర్తనను బట్టి... ఆమె పట్ల గౌరవం సదభిప్రాయం ఏర్పడింది నాకు. అంతే గాదు అందమైన వాళ్ళకు గర్వం ఉంటుందని .. ...వాళ్లు అందంగా లేని అమ్మాయిలతో స్నేహం చెయ్యరనే అభిప్రాయం నాలో కొంత వరకు ఉన్నప్పటికీ అపురూప పరిచయం వల్ల నా అభిప్రాయం తుడుచుకు పోయింది.

ఆ మరుసటి రోజు... ఉదయం...

"హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్" చదవాలన్పించి పింగళి లక్ష్మీకాంతం గారు రాసిన పుస్తకం కోసం అపురూప వాళ్ళ రూంకెళ్ళి ఆ అమ్మాయిని అడిగి తెచ్చుకొన్నాను. మా రూంలో బెడ్ మీద పడుకొని ఆ పుస్తకం తెరవగానే... అందులోంచి మడతలు పెట్టబడిన ఓ కాగితం జారి పడింది. మెల్లగా అందుకొని మడతలు విప్పాను. అది...అపురూప జానకి అనే తన ఫ్రెండ్ కి రాసిన ఉత్తరం. పరాయి వాళ్లు రాసిన ఉత్తరాల్ని చదవ కూడదని అనుకొంటూనే... చదవ సాగాను.

అంతే .. ... నా బుర్రలో డైనమేట్ పేలింది

నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. అపురూప అంత ... ఇంత కలుషితమైందా? ఇలాంటి మనస్తత్వం గల అమ్మాయిలు కూడా ఈ సమాజంలో ఉన్నారా? అపురూప విషయంలో నేనెంత మోసపోయాను! మళ్ళీ ... .. నాకళ్ళు ఆ లెటర్ని చదవడం మొదలెట్టాయి.

"డియర్ జానకీ! నీ ఉత్తరం అందింది అందంగా లేని వాళ్ళతో, పేద వాళ్ళతో, తక్కువ కులం వాళ్ళతో స్నేహం చెయ్యడంలో అర్థం ఏమిటి అని అడిగావు కదూ. చెబుతాను విను నాలుగు కాకులతో కలిసి హంస కలిసి ఉంటే అందరి చూపులూ ఆ హంస మీద పడి తీరుతుంది. అవునా? అందంగా లేని వాళ్ళతో కలిసి బజార్లో నడుస్తుంటే ....అందరి కళ్ళు నా మీదే పడతాయి నన్నే కామెంట్ చేస్తారు. నాకెంతో గర్వంగానూ ఉంటుంది. ఒకరికి మనం విచ్చలవిడిగా డబ్బు ఖర్చు పెడుతున్నామంటే... వాళ్ళు మనకు లోబడుతున్నారన్న మాట-డబ్బు ఖర్చు పెడుతుంటే ...అక్రెడిట్ మనకు మిగులుతుంది వాళ్ళు మనకెంతో అణిగి మణిగి ఉంటూ మనల్ని గౌరవిస్తారు"... ఇక ఆ ఉత్తరాన్ని చదవడం యిష్టంలేక మడతలు పెట్టి ఆ పుస్తకంలో పెట్టేశాను—

✱

# మృత్యుగానం

## — వుప్పల నరసింహం

తెలంగాణాలో అదొక ఊరు.

ఆ ఊరి పేరు గుమ్మడిదాల.

తెలంగాణా ప్రాంతంలో బాగా వెనక బడిన ప్రాంతంలో అదొక గ్రామం. అన్ని గ్రామాంలో మాదిరిగానే ఆ గ్రామంలో ఆచారాలు, వ్యవహారాలు, సాంప్రదాయాలు, పండుగలూ పబ్బాలూ ఎక్కువ భక్తిశ్రద్ధలతో పాటిస్తారు.

గుమ్మడిదాల గ్రామంలో పలుకుబడి గల ధనిక రైతు రామిరెడ్డి ఇంటి ముందు

అలల మాదిరి గొంతులు పొంగి పొర్లు తున్నాయి. కెరటాల్లా అందెలు ఘోషి స్తున్నాయి. నాగు పాము బుసలా తాం బూరతీగెల చప్పుడు వినిపిస్తున్నది. కత్తి పోటులను ఎదుర్కొంటున్న డాలులా "డిమ్కి" మ్రోగుతున్నది. వాయిద్యాల ధ్వని గంభీరమైన గాత్రంతో మిళితమై ప్రేక్షకుల నరాల మీద దాడి చేస్తుంటే ఈ ప్రపంచంలో ఎక్కడాలేని ఉద్వే గం, తన్మయత్వం మనసులో చోటు చేసుకుంటున్నాయి,

మనసు కరగించి పిడికిళ్ళతో మెత్తగా పిండుతున్న అరుదైన అను భూతికి "శారదకాళ్ళు" దుర్గయ్య దంప తుల జానపద కళా నైపుణ్యతకు కారణం.

కథలో పూర్తిగా లీనమైన వాళ్ళ ముఖాలలో తన్మయత్వంతో బాటు బాధ, ఆవేదన స్పష్టంగా కనిపిస్తున్నాయి. తక్కువ స్థాయిలో పాటను అందుకొని రాగాన్ని తారాస్థాయికి తీసుకెళ్ళి ప్రేక్ష కుల హృదయాలలో చెరగిపోని ముద్ర వేస్తున్నారు. ముఖ్యంగా సూర్యారెడ్డి ఆ జానపద కళాకారుల కళా నైపుణ్యాన్ని చూసి ముగ్ధుడైపోయాడు.

రామిరెడ్డి మేనల్లుడు సూర్యారెడ్డి. పన్నెండు రోజుల క్రితం సూర్యారెడ్డి తాత ముత్తిరెడ్డి మరణించాడు. పదకొండు రోజులకు కావలసిన ఖర్మకాండను రామి రెడ్డి ఘనంగా జరిపించాడు.

సూర్యారెడ్డి హైదరాబాద్ విశ్వవిద్యా లయంలో ఎం. ఎ. లిట్ చదువుకు న్నాడు. సాహిత్యం అంటే మక్కువ. శ్రీ శ్రీ, కొడవటిగంటి కుటుంబరావు, కాళీపట్నం రామారావు, చలం, బుచ్చి

బాబు మొదలైన వారి రచనలను బాగా అధ్యయనం చేశాడు. ఎం. ఏ. తరువాత కొడవటిగంటి కుటుంబరావు సాహిత్యంపై పరిశోధనా గ్రంథం వ్రాయాలని ఉబలాట పడుతున్నాడు.

విశ్వ విద్యాలయంలో ఎక్కువ పలుకుబడిగల తీవ్రవాద విద్యార్థి సంస్థలతో సంబంధాలు వున్నాయి. సమాజాన్ని శాస్త్రీయ దృష్టితో పరిశీలించడం సూర్యారెడ్డికి చాలా యిష్టం. సన్నగా ఎత్తుగా నాజూకుగా కనిపించే సూర్యారెడ్డి సుతిమెత్తని మనస్కుడు.

తాత ముత్తిరెడ్డి మరణించాడనే వార్త తెలియగానే తల్లి సరోజనమ్మతో పాటు హైదరాబాదు నుంచి గుమ్మడిదాలకు ప్రయాణమై వచ్చాడు పన్నెండు రోజుల క్రితం.

పదకొండవ రోజు కర్మకాండ ముగిసిన వెంటనే చాలామంది చుట్టాలు వెళ్ళిపోయారు. దగ్గరి చుట్టాలు మాత్రమే ఉండిపోయారు. సూర్యారెడ్డి అమ్మమ్మకు ఊరట కలిగించేందుకుగాను ఆ రోజు సూర్యారెడ్డి తల్లి సరోజనమ్మ ఉండిపోయింది. సరోజనమ్మతో పాటు సూర్యారెడ్డి కూడా వుండి పోయాడు. హాస్టల్లో జరిగిన గందరగోళం వల్ల విశ్వవిద్యాలయ కళాశాలలను పదిహేను రోజులు మూసివేశారు. దాంతో సూర్యారెడ్డి గ్రామీణ పరిస్థితులను, వైరుధ్యాలను పరిశీలిస్తూ వున్నాడు గుమ్మడిదాలలో. ముత్తిరెడ్డి మరణించిన పన్నెండో రోజు మధ్యాహ్నం భోజనాలు ముగిసిన తరువాత రామిరెడ్డి ఆ వూరి చివర అర్ధచంద్రాకారపు గుడిశెలు వేసుకొని, కడు పేదరికంలో నలిగి పోతున్న యాచక వృత్తి "శారదకాళ్ళ" లో ఒకడైన దుర్గయ్యను, ఆయన భార్య పోశమ్మను పిలిపించి తన తండ్రికి ఇష్టమైన "బల్గూరి కొండయ్య కథ" చెప్పమన్నాడు.

దుర్గను, పోశమ్మను చూడగానే పన్నెండు రోజుల క్రితంనాటి సంఘటన గుర్తుకు వచ్చింది. ముత్తిరెడ్డి శవాన్ని ఇంటినుంచి ఊరేగింపుగా తీసుకెళ్తు గామం ప్రధాన మార్గాలన్నీ దాటి ఊరి చివర, చెరువు ప్రక్కన ఎవరి సంరక్షణ లేని మామిడితోట మధ్యనుంచి వున్న బాటనుండి వెలుతుండగా తోటలో ఒక వైపు అర్ధచంద్రాకారపు ఈత చాపల గుడిశెలు చెల్లాచెదురుగా వేసివున్నాయి. అక్కడి పిల్లలు నగ్నంగా వున్నారు. మరికొంత మంది అర్ధ నగ్నంగా వున్నారు. స్త్రీలు వక్షస్థలాలపై పైట కొంగు లేకుండా అటు, ఇటు తిరుగుతున్నారు. బలిష్టమైన ఆకారాలు వారివి. పురుషులు కేవలం గోచీ పెట్టుకుని వున్నారు. కండలుదేరిన దేహాలు వారివి. మగవారు స్త్రీలలా శిరోజాలు పెంచుకున్నారు. వెదురు తీసుకెళ్ళేందుకు చవులు కోసిన కుక్కలు గుడిశెల ముందు వున్నాయి. వాళ్ళ మాటతీరు వేరుగా వుంది. ప్రత్యేకమైన "యాస" ఆ మాటల్లో వుంది. పూర్తిగా సంచార జీవితానికి అలవాటు పడ్డవారిలా వున్నాడు వాళ్లు.

శవం ఊరేగింపు వాళ్ళని చేరేసరికి పోటీపడి పరుగెత్తుకొని వచ్చి శవంపై నుంచి ఎగజల్లే చిల్లరడబ్బులను ఏరుకోవడానికి తీవ్రమైన పోటీ పడుతున్నారు



అయితే దూరంగా ఓ స్త్రీ ఐదు సంవత్సరాల పాప తల పట్టుకుని కూర్చుంది. ఆ పాప వాంతి చేసుకుంటూవుంది. కొది దూరంలో 40 సంవత్సరాలతను తలకు చేతులు పెట్టుకుని విచారంగా కూర్చున్నాడు. అతని ప్రక్కన చెవులు కోసిన

వేటకుక్క పడుకున్నవి. గుడిసె ముందు కుండలు, వివిధ పాత్రలు, ఈతకమ్మలు, బొంత పేగులు, కర్రలు రోకలి పడి వున్నాయి. ఎప్పుడో వొండిన మూడు రాళ్ళ పొయ్యి ప్రక్కకు వుంది వాళ్లు శవం వైపు రాలేదు. ఆ పాపకు ఓ ముంతతో నీళ్లు తాగించి మొఖంకడిగి బాధగా గుండెలకు అద్దుకుని గుడిసె లోపలికి తీసుకపోయింది ఆ స్త్రీ

ఆ దంపతులే దుర్గయ్య, పోశమ్మ. వాళ్ళే ఇప్పుడు కథ చెపుతున్నారు. పోశమ్మ ఎడమ తొడపై ఆనాడు వాంతి చేసుకున్న ఐదేండ్లపాప అనసూయ నిస్సత్తువగా పడుకుంది. ఆనాటినుంచి ఆ పాప కోలుకున్నట్టు లేదు. నీరసంగా వుంది. దుర్గయ్య కూడ తప్పనిసరిగా కథ చెపుతున్నట్టుగా వుంది. కళ్ళల్లో బాధ స్పష్టంగా కనిపిస్తున్నది. కథ చెప్పే విధానంలో ఆ లోటు రాకుండా జాగ్రత్త పడుతున్నాడు.

బల్గూరి దమ్మవ్వ కన్న కొడుకు బల్గూరి కొండయ్య. ఒకప్పటి పెంపుడు కొడుకు షాకమల్లు. కొండయ్య పుట్టిన వారం రోజులలోనే మొగలాయిలు, వాళ్ళ సామంతులు, పగవాళ్ళు, కొండయ్య తండ్రి రఘుపతిరావు పూజలో వున్నప్పుడు నిరాయుధుణ్ణి చేసి చంపేయడంతో కొండయ్యలో ప్రతీకారవాంఛ చిన్నప్పటి నుంచి చోటు చేసుకుంది.

ఉన్న ఆస్తి పాస్తులతో దమ్మవ్వ కొండయ్యను పెంచి పెద్ద చేస్తుంది. ఏడు సంవత్సరాల వయసు రాగానే కొండయ్య పరాక్రమ వంతుడవుతాడు. అన్ని విద్యలలో ఆరితేరిన వాడవుతాడు. అన్ని సాములు నేరుస్తాడు. తన తండ్రిని చంపిన శత్రువులను సంహరించేందుకు సహాయపడటానికి గాను సోదరుడు శాకమల్లును అతని సైన్యాన్ని తన ఊరికి ఆహ్వానిస్తాడు.

బల్గూరి కొండయ్య ఆహ్వానంపై వచ్చిన శాకమల్లు, అతని సైన్యం ఆకలి, దప్పికలతో ఎలా తల్లడిల్లిందో అన్న సంఘటనను దుర్గయ్య అంత బలంగా ఎలా చెప్పగలిగాడోనని సూర్యారెడ్డి, అక్కడ కూర్చున్నవారందరూ ఆశ్చర్యచకితులయ్యారు. దుర్గయ్య ఆ ఘట్టం చెపుతున్నప్పుడు ఆకలి దప్పికలు అంత క్రూరంగా వుంటాయా? అన్న ఆలోచన సూర్యారెడ్డిలో కలిగింది. ఆకలి గురించి అనేక కథలు కవితలు, వ్యాసాలు చదివిన సూర్యారెడ్డి ముందెన్నడూ స్పందించని రీతిగా దుర్గయ్య 'ఆశు కవిత్వానికి' స్పందించాడు. దుర్గయ్య కళ్ళవెంట నీళ్లు కారుతూ వుంటే సూర్యారెడ్డి కళ్లు చెమ్మగిల్లాయి. హృదయం కరిగిపోయింది. జానపద కళాకారులంటే తన మనసులో చెరగిపోని ముద్ర పడింది. వారికి మనసులోనే జోహార్లు అర్పించాడు.

రామిరెడ్డి ఇంటి ముందువున్న విశాలమైన వసారాలో ఒక మూల దుర్గయ్య, పోశమ్మ కూర్చుని కథ చెబుతున్నారు, పోశమ్మ తొడపై అనసూయ పడుకుని సన్నగా మూల్గుతూ వున్నది.

వాళ్ళకు అభిముఖంగా కొంచెం దూరంలో రామిరెడ్డి, సూర్యారెడ్డి, రామిరెడ్డి తమ్ముళ్లు, ఆ వాడలోని కాపులు, సావుకార్లు, పెద్దలు కూర్చున్నారు. గడప వద్ద సరోజనమ్మ, సరోజనమ్మ తల్లి,




రామిరెడ్డి భార్య కమలమ్మ తదితరులు కూర్చున్నారు.

వసారా క్రింద వాకిట్లో ఆవూరి సామాన్య ప్రజలు కూర్చున్నారు. అందులో ఎక్కువగా నలభై సంవత్సరాలు దాటిన ఆడవాళ్ళు, ముసలివాళ్ళు వున్నారు. పిల్లలు "నేనే ముంగట కూసుంట" అని తోసుకుంటూ కూర్చుంటున్నారు. ముసలి వాళ్ళు చుట్టలు, బీడీలు కాలుస్తూ పిల్లలను అల్లరి చేయకుండా బెదిరిస్తూ వున్నారు.

దుర్గయ్య పోశమ్మ చేతుల కదలికలను గమనిస్తూ సూర్యారెడ్డి తదేక దృష్టితో కథ వింటున్నాడు.

దుర్గయ్య, చేతిలో వంద సంవత్సరాల క్రితం నాటి "శారద" నగిషీలతో వున్నది. ఆ శారద (వీణలాంటి వాయిద్యం)కు ఒకవైపు హంసముక్కు చెక్కబడింది. మరో వైపు గుమ్మడి కాయలా వుంది. శారదను ఎడమ భుజానికి మోపుకుని కుడిచేతి చూపుడు వేలితో తీగెలను మీటుతూ, ఎడమ చేతి బొటన వ్రేలుకు కంచు అందెలు మ్రోగుతుండగా కథ చెబుతున్నాడు.

తానే బల్గూరి కొండయ్య అన్నంత ఆవేశంగా తనకు తానే సాటిగా అతి సమర్థవంతంగా, పెంచ్చు గొంతుతో ఉద్వేగంతో, పౌరుషంగా కథలో లీనమై మాటల "బాకులను," "ఈటెలను" ప్రేక్షకుల గుండెల్లో గుచ్చుతున్నాడు దుర్గయ్య.

బుర్రకథకు ఉపయోగించే మట్టికుండ

'డిప్పి' పోశమ్మ కుడి చేత్తో వాయిస్తూ ఎడమ చేతితో డిప్పి మూతని మూస్తూ తెరుస్తూ వుంది శబ్ద మాధుర్యం కోసం.

పోశమ్మ చిరిగిన సీర కట్టుకుంది. అతుకుల రవికె తొడుక్కున్నది - మెడలో నల్ల పూసలు వున్నాయి చేతులకు పాత బడిన గాజులు వున్నాయి. కథ చెప్పేటప్పుడు అటూ, ఇటూ తలను ఆడిస్తూ వుండగా ముక్కున వున్న పుడక తళుక్కున మెరుస్తున్నది. విశాలమైన నుదురుపై కొట్టొచ్చినట్టుగా వున్న కుంకుమ బొట్టు - ఆమె అడవిలోని మోదుగ పువ్వులావుంది.

దుర్గయ్య తలకు రుమాలు. అక్కడక్కడ చిరిగిన ధోవతి. పాత కమీజు వెసుకున్నాడు- పెరిగిన గడ్డంతో పిడి రెడు మీసాలతో గంభీరంగా వున్నాడు. చెవి పై భాగంలో రాగిపోగు వుంది, అతను కొలిమిలో కాలిన ఇనుపచువ్వలా వున్నాడు.

ముందు కథ ఎలా జరుగనున్నదో అన్న కుతూహలంతో అక్కడ కూర్చున్న వారందరూ నిశ్శబ్దంగా వింటున్నారు. సూర్యారెడ్డి గెడ్డంక్రింద ఎడమ చేతిని పెట్టుకుని దుర్గయ్య కళ్ళ లోతుల్లోని బాధని, రెప్పలేయకుండా చూస్తూ కథ వింటున్నాడు.

దుర్గయ్యగొంతు కథ మధ్యలో సందర్భోచితంగా చటుక్కున ఘర్జిస్తున్నది. అంత ఆకస్మికంగా సందర్భోచితంగా అలా వీరోచితంగా చెప్పడం వల్లనే అక్కడి ప్రేక్షకులలో జానపద బల్లారి కొండయ్య కథ నాటుకపోతున్నది.

ఏక బిగిగా గంటసేపు కథ చెప్పిన తరువాత దుర్గయ్య శారదను క్రింద పెట్టి, అందెలు క్రిందవేసి, ధోవతి కొనతో కళ్ళు తుడుచుకుని ఆకలి కడుపుకు ధోవతి మరింత గట్టిగా బిగకట్టి

"దూపయితుంది, జెరన్ని నీళ్ళు ఇయ్యండ్రి దొరా." రామిరెడ్డిని చూస్తూ హృదయ విదారకంగా అడిగాడు.

రామిరెడ్డి వెనక్కి చూశాడు-గడపలో వున్న రామిరెడ్డి భార్య కమలమ్మ లేచి ఇంట్లోకి వెళ్ళింది.

పోశమ్మ తన డిప్పిని క్రిందపెట్టి అనసూయను తన తొడపైనుంచి క్రింద పడుకోబెట్టి కడుపుపై చెయివేసి చూసింది. "శరీరం వెడిగా వుంది" అన్నట్టు దుర్గయ్యవైపు చూసింది. దుర్గయ్య ముందుకువంగి అనసూయను రెండు చేతులతో అందుకుని ఒడిలో కుర్చోబెట్టుకుని తానూ కడుపుపై చెయివేసి చూసాడు. "నిజంగానే జ్వరం చాలా వుందే" పోశమ్మవైపు చూసాడు. తిరిగి అనసూయ కళ్ళు తెరవకుండానే సన్నగా మూల్గుతూ తండ్రి వొడిలో కరచుకొని పడుకున్నది . దుర్గయ్య అనసూయ నుదురురాస్తూ తన నికృష్టమైన బతుకు గురించి ఆలోచించాడు.

"ఎప్పటికి ఇదేనాయే 'అది' బాగుంటే నేను బాగుండక పోతి, నేను బాగుంటె అది బాగుండకపాయె-ఇద్దరం మంచిగుంటె పోరి బాగుండకపాయే ఉన్నదో, లేనిదో ఇంత తిని గుడిశెల ముందురుకొని పండుకుందా మంటె ఎప్పటికి ఎదో ఒక రోగం, నొప్పి ఉండనే బట్టే చేసిన కష్టం మందు




మాకుకే కావట్టే అయినా పెయ్యిలు (ఆరోగ్యాలు) సరిగ్గా లేక పోయే. పోల్ల పది రోజులల్ల ఎంత గుంజుగపోయింది సూడు .ప్పే ఎట్లుండే ఎట్లయింది . శిలొక్కయ్య లెక్క. భగవంతు గుక్కె పున్నవోయ్య ఎప్పటికి ఇదే వనవాస మాయె .. ఒక్కనాడన్న నిమ్మళంగ ఉన్నట్టు లేక పోయే .... బతికెకన్న చచ్చింది నయమున్నది ఈనాడల తోటి"

అని స్వగతంలో తన బ్రతుకును బాధలను తిట్టుకున్నాడు. అంతకుమించి ఏమి చేయలేని నిస్సహాయుడు దుర్గయ్య.

పోశమ్మ కడుపులో ఆకలి దహించక పోతుంటే నాలిక పిడుచ కట్టుక పోతుంటే "ఉమ్మిని" కడుపులోకి మింగుతూ అనసూయ వైపు చూచి కళ్ళ నీళ్లు పెట్టుకుంది. మనసును రంపంతో కోస్తున్నట్టుగా వుంది అనసూయను చూస్తుంటే అంత మందిలో ఏడ్వడం పద్ధతి కాదనుకొని కొంగుతో కళ్ళు తుడుచుకుంటుండగా గడప వద్ద "ఇగో" అన్న మాట వినిపించి అటువైపు తిరిగింది.

రామిరెడ్డి భార్య కమలమ్మ చెంబుతో నీళ్ళు తెచ్చింది.

సూర్యారెడ్డి కూర్చున్న వద్ద నుంచి లేచి గడప లోపల నిలుచున్న అత్తె వద్ద నుంచి నీళ్ళచెంబు తీసుకుని దుర్గయ్య పోశమ్మ కూర్చున్న దగ్గరికి వచ్చాడు. దుర్గయ్య. పోశమ్మను అంత దగ్గరగా చూడటం సూర్యారెడ్డికి ఎంతో ఆనంద మనిపించింది. ఆలాగే వారి పేదరికం చూడగానే గుండె తరుక్క పోయింది.

ఈ అజ్ఞాత జానపద కళాకారుల

గుండెల్లో ఎంతటి విలువైన కళా గనులు దాగున్నాయో? వాటిని ఈ ప్రపంచం ఎప్పుడు తెలుసుకుంటుంది? అన్న ఆలోచనలో పడ్డాడు సూర్యారెడ్డి.

పోశమ్మ తన ప్రక్కనున్న "జోలె" లోంచి ఓ బగోన్ని, ఓ అల్యూమినియం గ్లాసు తీసింది. సూర్యారెడ్డి చెంబులోని నీళ్ళు ఆ రెండిట్లో పోసి అనసూయ వైపు ఓ సారి చూసి వెనక్కు తిరిగాడు.

పోశమ్మ దుర్గయ్య ఒడిలోని అనసూయను తీసుకుని బగోని గిన్నె దుర్గయ్యకిచ్చింది. బగోని గిన్నెతో దుర్గయ్య నీళ్ళు తాగుతుండగా స్వరం పడింది. వెంటనే పోశమ్మ దుర్గయ్య ఛాతీలో అరచేతితో రాసింది. కొద్దిసేపు దగ్గి తమాయించుకున్నాడు దుర్గయ్య. పోశమ్మ అనసూయను లేపి అల్యూమినియం గ్లాసులో వున్న నీళ్ళను తాగించింది. బగోని గిన్నెలో మిగిలిన నీళ్ళు తాను త్రాగి కొంగుతో బిడ్డ మొఖం తుడిచి తన మూతి తుడుచుకుంది.

వాకిట్లో కూర్చున్న ముసలివాళ్ళు బీడీలు, చుట్టలు ముట్టిచ్చుకున్నారు. స్త్రీలు ఆకువక్కలు వేసుకున్నారు.

వసారాలో కూర్చున్న కాపు, సావుకార్లు జరిగిన కథపై చర్చిస్తున్నారు.

తాను ఆలస్యం చేస్తున్నానన్న స్పృహ కలిగి దుర్గయ్య సంజాయిషీగా "రెండు బుక్కలు బీడి తాగి కథ మొదలు పెడుత పటేలా మీ కాల్మొక్త రుతకెల పమ్ము లేకుంట అయింది"

"తాగు నిమ్మలంగ తాగురా" అన్నాడు రామిరెడ్డి.

వాకిట్లో కూర్చున్న ఒకతని వద్ద ఒడి అడుక్కుని రెండే దమ్ములు తాగాక బీడిని మల్లిపి చెవి ప్రక్కకు పెట్టుకుని, శారదను చేతిలోకి తీసుకుంటూ

"ఇందుకోవే డిమ్కిని పొద్దు పోతుంది" అని పోశమ్మతో అన్నాడు.

పోశమ్మ అనసూయను తన తొడపై పడుకో బెట్టుకుని డిమ్కి తాళ్లు బిగించింది.

కథ తిరిగి ప్రారంభ మయింది. వచనంతో ప్రారంభంచేసి, కథ కొంత జరిగిన తరువాత పాట అందుకున్నాడు దుర్గయ్య.

షోకమల్లు సైన్యానికి తిండి, సుట్ట, పొగాకు ఖర్చులకుగాను దమ్మవ్వ దాచిన ధనం కొల్లగొట్టి పెడతాడు కొండయ్య. పల్లూరి కొండయ్య శత్రువుల పై యుద్ధానికి పోయే ముందు తల్లి తన కొడుకు పరాక్రమం చూస్తానంటుంది. అప్పుడు తల్లి, కొడుకుల మధ్య వాగ్వివాదం ఎంత బలంగా, గొప్పగా మానవ జీవితాలను కదిలించే ప్రేమ, అనురాగాలను, ఒక వైపు యుద్ధ చాతుర్యాన్ని పరాక్రమాన్ని, కత్తిసామును మరో వైపు జోడించి అద్భుతంగా పాట పాడాడు దుర్గయ్య.

కొండయ్య పరాక్రమాన్ని పరీక్షించి తల్లి దమ్మవ్వ కొడుకును యుద్ధానికి పంపే ఘట్టాలను చెపుతున్నప్పుడు దుర్గయ్య మామూలు మనిషిగా చెప్పడం లేదు. అతడు ఆ సమయంలో ఓ శక్తి-ఓ బలమైన భావం-ఎవ్వరూ ఆర్పలేని జ్వాల-ఎవ్వరూ ఎదురొడ్డలేని సముద్రం ఉప్పెనలా విజృంభించి తనలో వున్న కళా చాతుర్యంతో అద్భుతంగా చెప్పుకు



పోతున్నాడు.

జానపద కళా రూపాలను ఇంత ప్రత్యక్షంగా ఇంతకు ముందు చూడనందుకు సూర్యారెడ్డి తనను తానే నిందించు కున్నాడు. ఆయనలోని కళాహృదయం వెంటనే దుర్గయ్యను కౌగలించుకుని ఆనంద బాష్పాలతో ముంచెత్తెయ్యాలనిపించింది. సూర్యారెడ్డి గర్వంగా చిరునవ్వు నవ్వుతూ కథ వింటున్నాడు.

దుర్గయ్యకు దగ్గవచ్చింది. కొంతసేపు కథను ఆపి దగ్గి నోట్లోని ఉమ్మిని వాకిట్లో దూరంగా ఊసి కథ ప్రారంభించాడు.

"పెయ్యి బాగలేదారా దుర్గయ్యా?" అని వాకిట్లో కూర్చున్న ఓ ముసలాయన అడిగాడు.

దుర్గయ్య ఓ చిరునవ్వు నవ్వి కథలో లీనమైపోయాడు.

కొండయ్య శత్రువులతో యుద్ధం చేస్తున్నప్పుడు చెప్పే సన్నివేశాలప్పుడు దుర్గయ్య భృకుటి ముడి పడటం, ముక్కుపుటాలు అదరడం - కను బొమ్మలు ఎగరేయడం, కనుగుడ్లు ఉప్పడం, మీసాలను ఎడమ చేతితో బారెడు పొడుగు దూయడం - కథలో పూర్తిగా లీనమైనప్పుడు ఛాతి గుద్దుకోవడం, సందర్భోచితంగా తొడ చరవడం, భూమిమీద గుద్దడం, గాత్రం పెంచి అవలీలగా యుద్ధ వాతావరణాన్ని కళ్ళ ముందు సృష్టించడం కేవలం దుర్గయ్యకే చాతనవుతుంది అని అనుకున్నాడు సూర్యా

రెడ్డి. దుర్గయ్యలోని కళాకారుడు సూర్యారెడ్డి మనసు దోచుకున్నాడు.

అమాంతంగా వెళ్ళి ఆయన (దుర్గయ్య) కాళ్లుపట్టుకొని శరీరాన్నంతా నిమిరి గట్టిగా నుదుటి మీద ముద్దు పెట్టుకోవాలన్నంతగా స్పందింప జేశాడు దుర్గయ్య సూర్యారెడ్డిని.

దుర్గయ్య కథ ఎంత బలంగా చెప్పగలడో, పోశమ్మ అంత బలంగా కథను నడిపిస్తూవున్నది. సందర్భోచితంగాహాస్యం చేస్తూ వుంది. పోశమ్మ దుర్గయ్య పక్కన లేకపోతే దుర్గయ్య అంత గొప్పగా చెప్పలేడనే విషయం ప్రేక్షకులకు సులభంగా తెలిసిపోతుంది. అంతటి గొప్ప కళాకారిణి ఆమె. వారి కలయిక అపురూపం.

దుర్గయ్య తన సహజ ధోరణిలో కథ చెప్పుకుంటూ పోతున్నాడు.

పోశమ్మ కడుపులో ఆకలి అధికమవుతున్నది. దుర్గయ్య కడుపుకు కట్టుకున్న బట్ట బిగువుకు చర్మం మండుతూ వుంది. అనసూయ తల్లి తొడపై పడుకుని మూల్గుతూ వుంది. క్రమంగా ఆ మూల్గు అధికమవుతున్నది.

దుర్గయ్య పట్టుదలగా శరీరంలోని సత్తువను కూడదీసుకుని కథను ముందుకు తీసుకపోతున్నాడు.

బల్గూరి కొండయ్య పన్నెండో ఏట వరకు తన తండ్రిని చంపిన మొగలాయిలను; శత్రువులను; పగవారిని అందరిని జయించి; చంపి పన్నెండో ఏట ఆయుష్షు క్షీణించి శత్రుల చేతిలో చావకుండా తన బాకుతోనే పొడుచుకుని కొండయ్య మరణించడంతో కథ ముగిసింది.

పౌరుషాన్ని; పరాక్రమాన్ని; సాహసాన్ని; ధైర్యాన్ని; యదార్థాన్ని; ఆకలిని; ప్రేమానురాగాల్ని దుర్గయ్య ఆకలితో పోటీపడి మూడు గంటలపాటు చెప్పి మెప్పించాడు.

సూర్యారెడ్డి కళ్ళల్లో గొప్ప వెలుగు వెలిగింది. అది దుర్గయ్య పట్ల కృతజ్ఞతా భావం.

కథ ముగిసిన వెంటనే సూర్యారెడ్డి తాత ముత్తరెడ్డి గుణగణాలను; దానధర్మాలను పొగడుతూ ఆశువుగా పాట పాడాడు.

ఆ పాట పూర్తికాగానే మంగళహారతి పాట నాలుగు నుడుగులు మాత్రమే పాడాడు. పోశమ్మ అనసూయను క్రింద పడుకోబెట్టి ప్రేక్షకుల వద్దకెళ్ళి వొడిలో డబ్బులు అడుక్కున్నది. ఎవరికి తోచినట్టు వాళ్ళు చిల్లర డబ్బులు వేశారు.

దుర్గయ్య శారదను క్రింద పెట్టి అందెలు జేబులో వేసుకుని రుమాలుతో చెమటను తుడుచుకుని గాలి వచ్చేట్టుగా రుమాలుతో ఊపుకున్నాడు.

పోశమ్మ తన యధా స్థానానికి వచ్చి చిల్లర డబ్బులు దుర్గయ్యకు ఇచ్చింది. అనసూయను ఒడిలో పడుకోబెట్టుకుని కడుపుపై చెయి వేసి చూసింది. ఒళ్ళు కాలిపోతున్నది. గుండెలకు అద్దుకున్నది. దుర్గయ్య పాప! మెడమీద చెయివేసి చూసిగ అచేతితో నుదురు కొట్టుకున్నాడు.

కథ వినడానికి వచ్చిన వారందరూ ఎవరి దారినవారు వెళ్ళిపోయారు.

రామిరెడ్డి, రామిరెడ్డి తమ్ముడు. అక్కడినుండి లేచి ఇంట్లోకి వెళ్ళారు




గవపవడ్డ ఆడవాళ్ళు కూడా ఇంట్లోకి వెళ్ళిపోయారు. వసారాలో సూర్యారెడ్డి, దుర్గయ్య, పోశమ్మ, పోశమ్మ ఒడిలో అనసూయ మాత్రమే మిగిలారు.

పోశమ్మ దుర్గయ్యను చూస్తూ ఆదుర్దాగా

"ఎట్లనయ్య పోరి పెయ్యి ఇంగలం కాలినట్టు కాలుతుంది ఎట్ల చేద్దాం" అంది.

"పార పైసలు ఇస్తే రామారావు డాక్టరు దగ్గరికి తీసుకపోదాం, సూది మందు యిప్పిద్దాం ... అంతకు మించి మన చేతుల ఏమున్నదే మన నసీబు; ఖర్మ గింత మట్టుకున్నది ఏంజేద్దాం?" అన్నాడు దుర్గయ్య విచారంగా.

"ఎన్నిరోజులైంది ఈ పాపకు జ్వరం వొచ్చి?" సూర్యారెడ్డి చొరవతీసుకుని అడిగాడు.

ఒకేసారి దుర్గయ్య, పోశమ్మ సూర్యారెడ్డి వైపు చూశారు. తమ చెవులను తామే నమ్మలేనట్టుగా అనిపించింది వాళ్ళకు.

"పది, పన్నెండు రోజులైంది నాయనా" అంది పోశమ్మ తేరుకుని.

"ఆ రోజునుంచి డాక్టరుకు చూపించనే లేదా?"

"ఏదో తక్కువైతదిలే అనుకోని అట్లనే వూకున్నం. నాకు తెలిసిన వైద్యం అదీ, ఇదీ జేసినా. అయినాగాని తక్కువగాలేదు. నిన్నటి సుంచి ఇంకా ఎక్కువైంది జరం...." దుర్గయ్య సూర్యారెడ్డి కళ్ళ

లోకి చూస్తూ బొంగురు గొంతుతో అన్నాడు.

"నాకు ఎడమ కాలు నవ పెడుతుంది. కుడి కన్ను అదురుతుంది. నాకెందుకో భయమైతున్నది." అని పోశమ్మ ఏడుస్తూ దుర్గయ్యతో అన్నది.

దుర్గయ్య ముందు తాను ధైర్యం తెచ్చుకుని

"ఏంగాదు నువ్ బయపడకు. బయపడితే పనులయితాయి? రామారావ్ డాక్టరు మంచిగ సూస్తడు. మందు లిస్తడు తక్కువైతది.."

"ఏమో నాకు బుగులైతుంది" అంటూ గట్టిగా ఏడ్చింది పోశమ్మ.

సూర్యారెడ్డి మనసు విలవిలలాడింది. ఇంతటి క్లిష్ట సమయంలో తాను ఆ దంపతులకు ఏ విధంగా సహాయపడటం లేదని అతని మనసు మూల్గింది. హైదరాబాద్‌లో ఐతే తనకు తెలిసున్న డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళి చికిత్స చేయించేవాడు పాపకు. మరి ఇక్కడ తనకు ఏ డాక్టరు తెలుసు? అసలు డాక్టరే లేరని గ్రామస్థుల ఫిర్యాదు. ఇంత గొప్పకళాకారులకుఇంత నికృష్టమైన దారిద్ర్యమా? అని ఆలోచిస్తుండగానే గడపవద్ద అడుగుల చప్పుడు వినిపించింది.

రామిరెడ్డి ఇంట్లోనుంచి వసారాలోకి వచ్చాడు. రామిరెడ్డి పటేలును చూసి దుర్గయ్య లేచి నిల్చుని "శారద" ను భుజంపై పెట్టుకున్నాడు. పోశమ్మ జోలె బుజానికి వేసుకుని; డిమ్మి కూడా అదే బుజానికి వేసుకుని; అనసూయను చంకలో ఎత్తుకుని నిల్చున్నది. సూర్యారెడ్డి కూడా నిలుచున్నాడు.

దుర్గయ్య నాలుగడుగులు ముందుకేసి రామిరెడ్డి వద్దకొచ్చాడు. రామిరెడ్డి పటేలు జేబులోంచి ఐదురూపాయల నోటుతీసి దుర్గయ్య చేతిలో పెట్టాడు.

దుర్గయ్య ఆశ్చర్యంగా తన చేతిలో వున్న నోటు వైపు చూసాడు. రామిరెడ్డి కళ్ళలోకి దీనంగా చూస్తూ; అభ్యర్థిస్తున్నట్టుగా

"సరిపోవు పటేలా నీకాల్మొక్త.. ఇంకో పది రూపాయలు ఇయ్యుండ్రి. ముత్తిరెడ్డి పటేలు చచ్చి స్వర్గాన పోయిండు. ఆ దొర పేరు మీద కథ చెప్పిన. పుణ్యాత్ముడు, ధర్మ ప్రభువు పేరుమీద ఇంకో పది రూపాయలు ఈ బిక్షగానికి ఇయ్యుండ్రి పటేలా నీ కాల్మొక్త" అడిగాడు.

"యిప్పుడైతే లేవు మల్లొకసారి చూద్దాంపో....యిప్పుడు ఈ ఐదు రూపాయలు తీసుకపో" అన్నాడు తేలిగ్గా రామిరెడ్డి.

"పటేలా నీ కాల్మొక్త.. " అంటూ దుర్గయ్య రామిరెడ్డి కాళ్ళమీద పడ్డాడు. పోశమ్మ మనసు తూట్లు పడింది. దీనంగా తదేకంగా నేలను చూస్తూవుంది. సూర్యారెడ్డి చేతులు కట్టుకుని పండ్లు ఓగపట్టి రామిరెడ్డి మామవంక చూస్తున్నాడు.

"లేవని చెబుతున్న కదరా కాళ్ళు పట్టుకుంటే యేదికేలొస్తయ్. ముందు కాళ్ళు యిడువ్." అని కఠినంగానే అన్నాడు రామిరెడ్డి.

దుర్గయ్య మనసులో తుఫానులు చెలరేగాయి; పెనుగాలులు వీచాయి. గుండె వేగంగా కొట్టుకోవడం ప్రారంభమయింది. శరీరం ఊగుతుంది. కళ్ళు తిరుగుతున్న

మీ
గుడ్డలకు
సాటిలేని
తెలుపు తెచ్చే
మేటియైన
నిరాలా.




ARMS-TIL-X-4-78 TL

ఈ రోజే **నిరాలా** కొనండి. సరసమైన ధర—సరియైన సబ్బు.

తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్ వారి ఉత్పాదన కర్నూల్ (ఆంధ్రప్రదేశ్)

ట్టనిపిస్తూ వుంది. చెవుల్లో హోరుగాలి వీస్తుంది. భూమిలో తాను కూరుకు పోతు న్నట్టనిపించింది. దిక్కులన్నీ వణుకుతున్న ట్టనిపించింది. ఈ ప్రపంచమంతా అయో మయంగా కనిపించింది. అంతా నీకటిగా గోచరించింది. . రెండు క్షణాలు కళ్ళు మూసుకుని తెరుకున్న తరువాత సూటిగా రామిరెడ్డి కళ్ళలోకి చూస్తూ

"పటేలా మీ కాళ్మొక్త పోరీ పది పన్నెండు రోజులనంది బాగలేదు. కడుపు లకు తిండిలేక మలమల మాడి సస్తున్నం. పోరికి మందు లేదు. మాకు తిండి లేదు. ఇంట్ల ఇత్తులేదు. ఉపాసంతోటి పొద్దు గడుపుతున్నం. కడుపుకు బట్ట కట్టుకొని బల్లూరి కొండయ్య కథ చెప్పిన కండ్లకు నెత్తురొస్తుంది...కథ చెప్పినందుకు ఇంకో పది రూపాయలు ఇయ్యండ్రి దొరా.. " అని అడిగాడు

"ఇట్ల షరతుజేస్తె ఎట్లరా?. నాయన సచ్చి ఖర్సుర పడ్డనేను-నువ్వు యిప్పుడే పంగిల బాగోత మాడిచ్చినట్టు చేస్తె ఎట్లయితది.. ఆఁ.. ఇగో ఈ రెండు రూపాయలు తీసుకొని పో .. యింక నన్ను సతాయించకు..." అని రామి రెడ్డి జేబులోంచి రెండు రూపాయల కాగితాన్ని తీసి దుర్గయ్య చేతిలో పెట్టాడు.

పోశమ్మ కళ్ళలోకి నీళ్లు తీసుకుని పెదవులను బిగపట్టి హృదయ భారాన్ని ఆపుకుంది - దుర్గయ్య దగ్గరకు వచ్చి చెయ్యి పట్టుకుని

"పోదాం....పా" అంది మెల్లిగా.

దుర్గయ్య మనసులో ఉప్పెన ఉధృతి ఎక్కువైంది. మనసు సుడిగాలిలో చిక్కుక పోయింది. అనసూయ ఆకారం, ఇంట్లో గింజలులేని కుండలు... రామిరెడ్డి పటేలు గొంతు తనను వెక్కిరిస్తున్నట్టనిపించింది. దుర్గయ్య చుట్టూ సమస్యలు - సమస్యల వొత్తిడి.

సూర్యారెడ్డి కుడికాలి బొటన వేలుతో భూమిమీద గీతలు గీస్తున్నాడు-అప్ర యత్నంగానే పిడికిలి బిగుసుకుంది. మనసులోని కోపం కళ్ళలోకి ఎర్రగా పాకింది.

దుర్గయ్య పోశమ్మ చేయి పట్టుకుని రెండు అడుగులు ముందుకు వేశాడు. సూర్యారెడ్డి వాళ్ళను ఆపుదామని కట్టు కున్న చేతులను వదిలేసాడు.

"సూర్యం మీ అత్త పిలుస్తుంది పో"

అన్న రామిరెడ్డి గొంతు సూర్యారెడ్డిని ఆపేసింది.

అప్పటికే దుర్గయ్య, పోశమ్మ వాకిలి దాటి, గేటు దాటారు.

పట్టరాని కోపం' తిరుగుబాటుతత్వం, ఆరాటం నిలువెల్ల దహించి వేస్తుంటే సూర్యారెడ్డి గడపలో కాలుపెట్టాడు. అంతే..

గేటుముందు మనిషి పడిపోయిన చప్పుడు-'శారద' తీగెలు తెగిన శబ్దం గాలిలో సుడులు తిరుగుతోంది. అందెలు దొర్లుకుంటూ పోయి దూరంగా పడ్డాయి.

తలరుమాలు ఊడిపోయింది.పోశమ్మ దుర్గయ్యమీద పడి కట్టలు తెగిన ప్రవా హంలా ఏడుస్తున్నది. అనసూయ కళ్లు తెరచి నిర్జీవంగా తండ్రివంక చూసింది.



# బాకీ తీరింది

మూడు రోజులనుంచి ఎడతెరిపి లేకుండా ఆకాశం చిల్లులు పడినట్లు వర్షం పడుతోంది. సముద్రంలో వాయుగుండం పడి పేదవాళ్ళ కడుపుల్లో చిచ్చు రగిల్చింది.

ఎండ నిప్పుల్లా చెలరేగే రోజులొచ్చినా రంగడికి ఇబ్బంది లేదు గాని వర్షం వస్తే మాత్రం గుండెల్లో రాయి పడుతుంది. రెక్కాడందే డొక్కాడని బ్రతుకు.

వర్షం ఆగిపోయింది.

రంగడు గుడిసె బైటికొచ్చాడు. తలెత్తి ఆకాశం వైపు చూశాడు.

సూర్యుడి జాడ లేదు. తుఫానుకి భయపడి నల్లమబ్బుల్లా దుప్పటి కప్పుకుని ఎక్కడ పడుకున్నాడో!

రంగడు వూళ్ళోకి బయల్దేరాడు.

అతనికి పాత రోజులు గుర్తుకొచ్చాయి. అతను సంతోషించినా, దుఃఖపడినా పాత రోజులు జ్ఞాపకం వస్తేనే!

గత స్మృతుల దుమారంలో కొట్టుకుపోతున్న రంగడికి నారాయణ కనిపించలేదు. మలబార్ హోటల్లో కూర్చున్న నారాయణే రంగడిని కేకేసి పిలిచాడు.

రంగడు ఆగిపోయాడు. పిచ్చెక్కిన వాడిలా తీవ్రంగా చూశాడు.

"ఏందిరా అట్టా చూస్తా వుండావు?" తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అన్నాడు నారాయణ.

ఆకలితో వున్న పెద్దపులిలా భయంకరంగా కన్పించాడు రంగడు.

అయినా భయం లేనివాడిలా చిరునవ్వు నవ్వాడు నారాయణ.

"రా....రా.... లోపలికి!"

మతిలేని మనిషిలా యాంత్రికంగా వచ్చి బల్లమీద చతికిల బడ్డాడు.

నారాయణ తెప్పించిన చపాతీలు తిన్నాడు. వేడి వేడి టీ గొంతులోకి పోయాక మనసు శాంతించింది.

"వాటం చూస్తావుంటే వాన పోయి నట్టే. అడివికి పోదామా?" అన్నాడు నారాయణ.

ఒక్కక్షణం అతని ముఖంలోకి చూశాడు రంగడు.

తర్వాత "పద" అన్నాడు.

ఇద్దరూ కలిసి రిజర్వాయరు ఒడ్డుకి వెళ్ళారు. ఇసుకలో బోర్లా పడేసిన బుట్టని నీళ్ళలోకి వదిలి ఎక్కి కూర్చున్నారు.

నారాయణ తెడ్డు వేస్తున్నాడు.

మూడు వైపులా పచ్చటి కొండలు వర్షంలో స్నానం చేసి వంటిని ఎండకి ఆరబెట్టుకుంటున్నాయి.

నాలుగో వైపున సిమెంట్ కొండలా నిల్చున్న డామ్ నదిలో తన రూపం చూసుకుంటున్నది.

రిజర్వాయర్లో గాలికి ఎగసి పడుతున్న కెరటాలు ఎండకి వెండి పువ్వులా మెరుస్తున్నాయి.

నారాయణ రంగడి వంక చూశాడు.

రంగడి ముఖం నిర్లిప్తంగా వుంది. ఎటో చూస్తున్నాడు.

"కోరట్లో జడ్జి తీరుపు చెప్పేసినాక జైలుకు తీసుకు పోయారు. నరకం యాడవో లేదురా జైల్లోనే వుంది."

తన జైలు జీవితం గురించి చెప్తున్నాడు నారాయణ.

వాకిశ్రీ

రంగడికి అతని మాటలు వినాలనిపించడం లేదు. అప్పుడప్పుడూ నారాయణ ముఖంలోకి చూసి తల త్రిప్పుకుంటున్నాడు.

రంగడు తన మాటలు విన్పించుకోకపోయినా తెడ్డు వేస్తూ మాట్లాడుతూనే వున్నాడు నారాయణ.

రంగడికి విసుగ్గా వుంది.

"ఈ నారాయణగాడు ఆర్నెల్ల కిందే తన సేతిలో సావాల్సినోడు. కాని పోలీసులు పట్టుకెళ్ళి జైల్లో ఏసినారు. ఏసి ఆర్నెల్లు ఆడు సావకుండా కాపాడినారు. ఇంగ ఈడిని ఎవురూ కాపాడలేరు మేకపిల్ల పులి కాడికి వొచ్చినట్లు తనకు చిక్కినాడు ఇయ్యాళ ఈడి పీనుగు కళ్ళజూడాల గొడ్డలితో ఒక్క పెట్టు."

రంగడిలో అవధులు లేని ఆవేశం కదలి కెరటంలా ఎగసి పడుతోంది.

కాలం ఎంత విచిత్రమైంది?

ఒక రోజున తను చచ్చిపోవాలని అనుకుని రిజర్వాయర్ లోకి దూకాలనుకుంటూ వుండగా ఈ నారాయణే తనను చావు నుంచి రక్షించాడు.

వాడినే తను చంపాలని పగబట్టాడు.

"రోజులెలా మారి పోతాయో గదా!" అనుకున్నాడు రంగడు.

అతనికి గతమంతా తెరపై బొమ్మల్లా కన్పించింది.

రంగడు స్వగ్రామంలో రోజు కూలిమీద పొలాల్లో పనిచేస్తూ వుండేవాడు. కండలు కరిగించినా కడుపు నిండేది కాదు. కూలి కోసం మైళ్ళ తరబడి నడిచి పోవాల్సి వచ్చేది

రోజూ కడుపు నిండేటట్లు దయ చూడమని దేవుడిని మొక్కుకునేవాడు.

దేవుడిలా వచ్చాడు వీరేసు. రంగడి భార్య సీతమ్మ మేనత్త కొడుకు వీరేసు. వూరికి రెండొందలు మైళ్ళ దూరాన కృష్ణ మీద డామ్ కట్టేచోట మేస్త్రీ వుద్యోగం చేస్తున్నాడు. ఊళ్ళో అంతా అతగాడి అదృష్టాన్ని పొగుడుతూ వుండే వాళ్ళు

డామ్‌లో తమకి ఏదైనా పని చూపించమని బావని ప్రాధేయ పడింది సీతమ్మ.

అలాగే చూస్తానని వెళ్ళి పోయాడు వీరేశం.

వీరేశు పుణ్యమా అని రంగడికి వాచ్‌మన్ వుద్యోగం దొరికింది పుట్టిన వూరు వదిలి ఇంత దూరం రావలసి వచ్చినందుకు విచారం వేసేది రంగడికి.

కొడుకు రాముడిని చూడగానే విచారమంతా మాయమై పోయేది. తనకి ఇల్లూ వాకిలీ లేదు. ఆస్తిపాస్తులు లేవు. ఎంత కష్టపడయినా సరే రాముడిని బాగా చదివించి పెద్దవాడిని చెయ్యాలని పట్టుదలతో కొడుకుని బడికి పంపించాడు. రాముడు ముద్దు ముద్దుగా పాఠాలు చదువుతూ వుంటే మురిసి పోయేవాడు.

కొన్నేళ్ళకి డామ్‌లో పని తగ్గు ముఖం పట్టింది. పనిచేసే వాళ్ళని తగ్గిస్తున్నారు. మేస్త్రీ వుద్యోగం చేస్తున్న వీరేశు వుద్యోగం వూడింది కాంపెన్‌సేషన్ క్రింద కొంత డబ్బు ఇచ్చారు. హైదరాబాద్ వెళ్ళి ఏదైనా వ్యాపారం చేస్తానని అన్నాడు. రెండు, మూడు నెల్లు పట్నం వెళ్ళి వచ్చాడు గూడా. వీరేశు ఒంటరిగాడు. భార్య ఎప్పుడో చనిపోయింది. ఎందుకో మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు.

"ఒంటరి వాడివే గదా! ఇక్కడే వుండి ఏదైనా చిన్న వ్యాపారం చెయ్యరాదా!" అన్నాడు రంగడు.

కాని వీరేశు వినలేదు. "జనమంతా వెళ్ళి పోతూ వూరు ఖాళీ అయిపోతుంటే ఇక్కడేం వ్యాపారం చేస్తాం? ఏం చేసినా హైదరాబాద్‌లోనే చెయ్యాలి. రాకెట్‌లా పెరిగి పోతోంది వూరు." అన్నాడు.

ఒక రోజు రంగడు డ్యూటీ నుంచి ఇంటికి వచ్చేటప్పటికి ఇల్లు తాళం వేసి వుంది. ఎక్కడికైనా వెళ్ళారేమోనని చాలా సేపు ఇంటిముందు కూర్చున్నాడు. కాని సీతమ్మ గాని రాముడు గాని ఎంత సేపటికీ ఇంటికి రాలేదు వీరేసుతోపాటు



హైదరాబాద్ వెళ్ళే బస్సులో ఎక్కి వెళ్ళిపోయారని ఎవరో చెప్పారు.

సీతమ్మ తనకి చెప్పకుండా ఎందుకు వెళ్ళినట్లు?

సమాధానం స్ఫురించింది.

నెత్తిన పిడుగు పడిన వాడిలా కుప్పలా కూలిపోయాడు రంగడు.

వీరేసు తనని చేరదీసి నౌకరి యిప్పించిన దాంట్లో అంతరార్థం ఇప్పుడు అర్థమైంది.

ఇన్నేళ్ళ పాటు తనని పిచ్చివాడిని చేసి ఆడించారు.

కళ్ళల్లో గుండు సూదులు గ్రుచ్చినట్లు విల విల లాడిపోయాడు.

రంగడి గుండెలో గాలి వాన మొదలైంది.

అతని మనసు పగిలిన పాలరాతి బొమ్మలా ముక్కలైంది.

పదేళ్ళ పాటు తనతో కాపురం చేసిన భార్య తనను వదలి పోయినందుకంటే తను కన్న కొడుకుని తీసుకెళ్ళినందుకు దుఃఖం వచ్చింది.

కొడుకుని చదివించి గొప్పవాడిని చేసి సంఘంలో ఒక మెట్టు పైకి ఎక్కాలని కలలు గన్నాడు. కాని కలలు కరిగి కల్లలయ్యాయి.

ఆ రాత్రి అతని శరీరాన్ని ఎవరో రంపంతో కోస్తున్నట్లు బాధ పడుతూ నిద్రకు దూరమయ్యాడు. తను బ్రతికి వున్నాననే సంగతి మర్చిపోయిన వాడిలా అచేతన స్థితిలో పడివున్నాడు.

భార్య, బిడ్డా లేని ఇల్లు ఉసూరోమంటూ బోసిగా కనిపిస్తూ వుంటే అతని గుండెని ఎవరో కెలుకుతున్నట్లుండేది.

భారంగా యాంత్రికంగా రోజులు నెట్టు

కొస్తున్నాడు.

మూలిగే నక్క మీద తాటికాయ పడ్డట్టుగా అతను వాచ్ మాన్‌గా పనిచేస్తున్న చోట దొంగతనం జరిగింది. అది ఎవరో చేసిన దొంగతనం కాదు. ఆఫీసర్లు చేసిందే, ఏమీ ఎరగనట్లు పోలీస్ రిపోర్టు యిచ్చారు.

పోలీసులు రంగడిని స్టేషన్‌కి పట్టుకెళ్ళి చిత్రహింసలు పెట్టారు. ఎంత కొట్టినా చెయ్యని దొంగతనానికి ఏం చెప్పగలడు?

భార్య చేసిన నీచపు పనికే సిగ్గుతో తలెత్తుకోలేక క్రుంగి పోతున్న రంగడిని చావు దెబ్బ కొట్టారు ఆఫీసర్లు. ఫలితంగా నౌకరీ వూడి రోడ్డున పడ్డాడు.

ఆ రోజు రంగడికి జీవితం మీద విరక్తి కలిగింది. తను బ్రతుకుతున్నందుకు ప్రయోజనం ఏమిటో అర్థం కాలేదు. ఒంటరిగా జీవించే కంటే చావడమే మేలు అనుకున్నాడు.

మతి పోయిన వాడిలా రిజర్వాయరు ఒడ్డున కూర్చున్నాడు.

ఒక దాని కౌగిట్లో ఒకటి ఒదిగి పోయిన కొండలు రిజర్వాయరు మూడు వైపులా అల్లుకు పోయివున్నాయి.

మనుష్యుల్లోని మంచితనం లాగే పగలు మెల్లి మెల్లగా అంతరిస్తోంది.

మనుష్యుల్లో నీతి చచ్చి పోతున్నట్లే పశ్చిమ దిక్కున ఆకాశంలో కెంపు రంగు జీవం కోల్పోయిన దానిలా నల్లబడి పోతోంది.

కాసేపటికి చీకటి అలుముకుంది.

రంగడు ఒడ్డుదిగి ఒక్కొక్క అడుగే వేస్తూ మృత్యు ముఖంలోకి వెళ్తున్నాడు.

నారాయణ అప్పుడే కట్టెలు వేసుకుని బుట్టలోనుంచి దిగాడు.

"అరేయ్! రంగడూ!" అని కేకలు పెట్టాడు.

రంగడికి ఆ పిలుపు వినిపించ లేదు. కాదు-వినిపించుకోలేదు.

నారాయణకి అనుమానం వేసి పరిగెత్తు కెళ్ళి రంగడిని ఒడ్డుకి లాక్కొచ్చాడు.

"చచ్చేటోడిని ఎవుడూ ఆపలేడు." అన్నాడు రంగడు.

నారాయణ నవ్వి "ఏందిరా ఈ ఇడ్డూరం నీకిప్పుడు ఏం రోగం వొచ్చిందేం?" అన్నాడు.

"నే నెందుకురా బతికేది?"

"అందరూ ఎందుకు బతుకుతా వుండారు? మనం అందుకే దేవుడు మనల్ని పుట్టించినాడు. దేవుడు సంపే వరకూ బతి కుండాల." అన్నాడు నారాయణ.

రంగడు మౌనంగా వుండి పోయాడు.

"ఎవుడంతట అడు సస్తే పాతకం. తెలుసా?" అన్నాడు నారాయణ.

"పాతకమో, పున్నెమో సావటం మంచిదనుకున్నా. ఎందుకు బతికుండాల సెప్పు? ఎవరుండారురా నాకు." అంటూ వుంటే రంగడి కళ్ళలోనుంచి జలజల కన్నీళ్ళు రాలాయి. తన మనసులోని ఆవేదనంతా నారాయణకి చెప్పుకున్నాడు రంగడు. ఆ సమయంలో నారాయణ ఎంతో ఆప్తుడిలా కనిపించాడు.

"పోనీలేరా! యెట్టాగో ఎదవ నౌకరి పోతే పోయింది. దేవుడు సల్లంగా సూడాలే గాని ఎట్టాగో అట్టాగ బతక్క పోతామా? ఏం బయ పడకు. నాతో నేవుండు. నాతో నే అడివికి వచ్చి కట్టెలు కొట్టుకుని, బొగ్గులు కాల్చి బతుకు." అని వూరడించాడు నారాయణ.

అలా అప్పట్నుంచి నారాయణ వృత్తి లోకి ప్రవేశించాడు రంగడు.

ఒక రోజున రంగడి చెల్లెలు నీలమ్మ అన్నని వెతుక్కుంటూ వచ్చింది. ఆమె భర్త వేరే అమ్మాయితో సంబంధం పెట్టు కుని తనని కొట్టి వెళ్ళగొట్టాడని ఏడ్చింది.

'తన జీవితంలాగే అయ్యిందన్నమాట' అని నిట్టూర్చాడు రంగడు.

'ఎందుకూ మనసులేని కాపురం? ఇష్టం లేని వాడి కాళ్ళు పట్టుకుని ఏం లాభం అంతకంటే విడిగా వుంటేనే నయం? తనతోపాటే బతుకుతుంది' అనుకున్నాడు.

"చలికాలం స్నానం చెయ్యలేకపోతున్నారా అందుకు వాడండి మా కంపెనీ సెంటు"



అప్పట్నుంచి నీలమ్మ అన్నతోపాటే వుంటున్నది.

భార్య చేసిన ద్రోహం, నౌకరీ పోయిన వైనం రంగడిని క్రుంగదీశాయి. అతని వయస్సుని రెట్టింపు చేశాయి. లౌకిక ప్రపంచంలో అన్నీ త్యజించిన మునిలా మౌనంగా వుండేవాడు. యాంత్రికమైన బ్రతుకులో గిరగిరా తిరుగుతూ గడిపేవాడు. మరో ఆడదాని పొందుకోసం అతని మనసు పోలేదు.

కాని నీలమ్మ పరిస్థితి అందుకు విరుద్ధంగా వుంది. ఆమె కింకా పాతికేళ్ళు నిండలేదు. భర్త ఆమెను నిరాదరించడంవల్ల ఆమె ఆదరణకు ముఖం వాచి పోయింది. ఒక తియ్యటి పిలుపు కోసం, ఆదరించే అనురాగ హృదయం కోసం ఆమె తహ తహ లాడి పోతోంది.

మల్లెతీగ లాంటి ఆమె మనసు అందుబాటులో వున్న చెట్టుకు అల్లుకు పోసాగింది. ఆ చెట్టు నారాయణ.

ఆమె గుండెలో సరికొత్త కాంతి కిరణంలో తళుక్కుమన్నాడు.

నారాయణని చూసినప్పుడు ఆమె హృదయంలో ఎప్పుడో ఎండి పోయిన సెలయేరు జీవం పోసుకుని గల గల పరుగులు తీసేది.

నీలమ్మ నారాయణ చనువుగా మసలుతున్నా రంగడు పట్టించుకునేవాడు కాదు. వరద నీటిని ఎవరు ఆపగలరు? జరగనీ ఏం జరుగుతుందో అనుకునేవాడు.

అతని నిర్లిప్త వైఖరే కొంపముంచింది.

గెస్టుహౌస్‌లో ఒక రోజు రాత్రి నీలమ్మను ఎప్పి పోయేవరకూ రాక్షసంగా అనుభవించారు త్రాగుబోతులు.

నారాయణే తార్పుడు దారు.

నీలమ్మని ఇంటికి తీసుకెళ్ళడానికి గదిలోకి వచ్చిన నారాయణ ఆమె శవాన్ని చూసి భయంతో కేకలు పెట్టాడు.

చీకట్లో నిద్రపోతున్న లోకం మేల్కొంది.

పోలీసులు వచ్చారు.

రంగడు వచ్చాడు.

నీలమ్మ శవాన్ని చూడగానే ఆకాశం నుంచి జారిపడిన కొండలా కుప్ప కూలి పోయాడు. ఆమె శవం మీద పడి

కోదించాడు.

తర్వాత అరివీర భయంకరుడిలా లేచాడు. తన చెల్లెలి మరణానికి కారణమైన నారాయణని ఒక్క క్షణం బ్రతక నివ్వగూడదని నిర్ణయించుకున్నాడు. పిడికిలి బిగించాడు. పళ్ళు పట పట కొరికాడు. కళ్ళెర్ర జేశాడు. ఎన్నడూ కోపం రాని మనిషికి కోపం వస్తే ఎలా వుంటాడో అలా వున్నాడు. నిప్పుల్లో నిల్చున్న మనిషిలా ఎర్రగా కంది పోయాడు.

నీలమ్మ చావుతో రంగడికి నారాయణ బ్రతుకు పూర్తిగా అర్థమైంది.

డబ్బు కోసం నీలమ్మని తార్చుతూ వున్నాడన్న మాట: అనుకున్నాడు.

"అరేయ్ నారాయణా!" అని భయంకరంగా అరిచేడు రంగడు.

ఆకాశం బ్రద్దలై పోయి పిడుగులు పడినట్లు అతని అరుపుకి అందరూ అదిరి పోయారు.

ఆ అరుపుకి గెస్ట్‌హౌస్ దద్దరిల్లి పోయింది.

అందరి గుండెలూ భయంతో వణికి పోయేయి.

మేకపిల్లనిపట్టుకున్న పెద్దపులిలా నారాయణ గొంతు పట్టుకున్నాడు రంగడు.

పోలీసులు ఆలస్యం చేసివుంటే నీలమ్మ శవం సరసన నారాయణ శవాన్ని పడుకో బెట్టాల్సి వచ్చేది.

తర్వాత ముద్దాయిలతో పాటు జైలు కెళ్ళి పోయాడు నారాయణ

మళ్ళీ తిరిగి రావడం ఇప్పుడే.

"దిగరా రంగడూ!" అన్న నారాయణ పిలుపు వులిక్కిపడి లేచాడు రంగడు.

బుట్ట ఒడ్డుకి చేరింది.

నారాయణ ఒకమూల ఎండిన చెట్టుని ముక్కలు చేస్తున్నాడు

రంగడు మరొక చెట్టుని నరుకుతూ ఆలోచిస్తున్నాడు. సమయం చూసి నారాయణని అంత మొందించాలని నిర్ణయించుకున్న అతని మనసు మాత్రం అల్లాల్లో లంగా వుంది.

"చేసే వాడిని నేనే, చేయించే వాడిని నేనే, అన్నీ నేనే, నువ్వు నిమిత్తమాత్రుడివి మాత్రమే" అని దేవుడు చెప్పాడని గుళ్ళో స్వాములు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

అదంతా నిజమేనా?

అదే నిజమైతే నీలమ్మ చావుకి నారాయణ తప్పేవుంది? అదంతా దేవుడే చేయించాడా? ఇప్పుడు తను చెయ్యబోయే హత్య గూడా దేవుడే చేయిస్తున్నాడా ?

ఎందుకు ?

రంగడు చాలాసేపు ఆలోచించాడు ఆలోచించగా అతనికి సమాధానం దొరికింది. నారాయణపై తను పగ పూనాడు. ఆ పగ చల్లారాలంటే వాడిని చంపాలి, తన మనసు శాంతిస్తుంది. తన మనశ్శాంతి తనకు ముఖ్యం. తన కళ్ళెదుట శత్రువుని చూస్తూ బ్రతకలేడు.

రంగడికి పిచ్చెక్కినట్లయింది.

పిచ్చెక్కినట్లే గొడ్డలి ఎత్తి పెట్టాడు.

ఒక్కటే దెబ్బకి నారాయణ తల ఎగిరి పోతుంది.

కాని గుండెల మీద ఎవరో రోకలితో దంచుతున్నట్లు బాధ కలిగింది.

అతను ఎత్తి పెట్టిన గొడ్డలి అలాగే వుండిపోయింది. అతని చేతులు గడ గడ లాడి పోయేయి.

మనసులో తీవ్రమైన సంచలనం కలిగింది.

చేతులే కాదు వొళ్ళంతా వణికిపోతోంది. తనేం చేస్తున్నాడు? హత్య. ఒక మనిషిని చంపుతున్నాడు. తనేనా మనిషిని చంపుతున్నది. నిజమేనా? తను మనిషిని చంపగలడా?

"చంపాలి. తప్పదు. నీలమ్మ చావుకి వాడే కారణం. పగ .. పగ చల్లారాలి. మనసు శాంతించాలి.

అతని మనసులో హోరు.

ఒక్కటే దెబ్బ మరుక్షణంలో నారా

# 28 మిలియన్లకు పైగా

# దంపతులు

ఈనాడు భారతదేశంలో

కుటుంబ నియంత్రణ పాటిస్తున్నారు.

వారు

ఆనందంగా ఉన్నారు.

వారిలో మీరు ఒకరయితే దీనిని గురించి ఇతరులకు తెలియచెప్పండి.

లేకపోతే కుటుంబ నియంత్రణ ఇప్పుడే మీరు ప్రారంభించండి.

## చిన్న కుటుంబం చింతలేని కుటుంబం



యణ నెత్తురు మడుగులో కొట్టుకుని చస్తాడు.

నారాయణ మెరుపులా వెనక్కి తిరిగి చేతితో గొడ్డలి పడగొట్టాడు. తర్వాత గట్టిగా నవ్వాడు.

"నాకు తెలుసు నువ్వు సంపుతావని. సంపు. కాదనను. కాని సంపేముందు నా తప్పేమిటో సెప్పు?' అన్నాడు నారాయణ.

"యెదవా! నేనేం సెప్పాలిరా. అన్నెం పున్నెం ఎరగని సీలమ్మని తాగుబోతు నాయాళ్ళకి తార్చినావు గదరా! సంపి నావు గదరా!" అన్నాడు రంగడు కోపంతో వణికిపోతూ.

"నీ సెల్లెలు అన్నెం పున్నెం ఎరగదని నువ్వనుకుంటా వుండావు. నువ్వు పిచ్చోడి విరా రంగడూ. దాని కత నీకు తెలవదు' దాన్ని మొగుడెందుకు తన్ని వెళ్ళగొ ట్టాడో తెలుసా? తప్పుడు పనులు చేస్తున్నం దుకు. సూసి సహించలేక ఎళ్ళగొట్టాడు. ఇక్కడ జేరి నన్ను పట్టుకుంది. ఈ తార్చుడు యవ్వారం నాకు నేర్పింది అదే."

నారాయణ చెప్తుంటే నివ్వెరపోయి విన్నాడు రంగడు.

"అయితే ఇందులో నారాయణ తప్పు లేదన్నమాట. తప్పంతా దాందే అందుకే అనుభవించింది" అనుకున్నాడు రంగడు.

ఉన్నట్లుండి వాతావరణంలో తీవ్రమైన మార్పు కలిగింది.

నాలుగు వేపులా కారు మబ్బులు దట్టంగా పట్టడంచేత పగలే చీకటై పోయింది.

"సంపరా రంగడూ సంపూ. ఎట్టాగూ నా పెళ్ళాం పిల్లలు అడుక్కు తింటు న్నారు. అట్టాగే బతకనీ" అన్నాడు నారాయణ ఏడుస్తూ.

"అరేయ్ నారాయణా! అప్పుడెప్పుడో నేను సావబోతుంటే అడ్డం పడినావు. నన్ను బతికించినావు. సీలమ్మని నువ్వే సంపినావని కసితో నిన్ను సంపాలను కున్నానురా. నేను దురమార్గపు ఎదవని" అంటూ ఏడ్చాడు రంగడు.

ఇద్దరూ ఒకళ్ళు నొకరు కౌగలించుకుని దుఃఖించారు.

ఆకాశంలో కారు మేఘాల గర్జనలు, మెరుపులు, గాలి విలయ తాండవం చూసి పక్షులు గూళ్ళు వెతుక్కుంటూ పారి పోతున్నాయి.

అప్పటి వరకూ గర్భిణి స్త్రీలా నిండుగా నవ్వుతున్నా రిజర్వాయరు పురిటినొప్పులు పడుతున్నట్లు అల్లకల్లోలమై పోయింది.

"పదరా వాన ముంచకొస్తున్నది" అని రంగడిని బుట్టలోకి లాక్కెళ్ళాడు నారాయణ.

ఎదురు గాలికి ముందుకు సాగటం లేదు బుట్ట బరువుగా తెడ్డు వేస్తున్నాడు నారాయణ.

కాస్త దూరం వెళ్ళగానే వర్షం మొద లైంది. పెద్ద పెద్ద వాన చినుకులు కొరడాల్లా వంటి మీద పడుతున్నాయి.

వర్షానికి తోడు విపరీతమైన గాలికి నది భయంకరంగా పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తూ వుంది.

సుళ్లు తిరుగుతున్న నీటిలో వాళ్ళు కూర్చున్న బుట్ట గిర గిరా తిరగ సాగింది. తిరిగి తిరిగి ఒక ప్రక్కకి ఒరిగి పోయింది.

నారాయణ నీళ్ళలోకి జారి పోయాడు.

బుట్టలో గాలి నింపిన ట్యూబ్ ఒక్కటే వుంది.

దాన్ని నారాయణకి అందించాడు రంగడు.

"నువ్వెళ్ళిపో రా నారాయణా!" అన్నాడు రంగడు.

"మరి నువ్వో?" అన్నాడు నారాయణ.

"నాకేం భయంలా సముద్రం ఈదుతాను, మొండి వాడిని. నువ్వెళ్ళిపో." అన్నాడు రంగడు.

నారాయణ ఏదో అంటున్నాడు.

ఆగాలి హోరులో, ఆ వర్షపు తీవ్రతలో ఆ మేఘ గర్జనల మధ్య ఏదీ వినపడ్డం లేదు.

నారాయణని వెళ్ళిపో వెళ్ళిపో అని చేతులు వూపుతున్నాడు రంగడు.

"తను చచ్చినా బతికినా ఒకటే. ఎనకా ముందూ ఎవడూ లేడు. కాని నారాయణ బతకాలి. ఆడి పెళ్ళాం పిల్లల కోసం బతకాలి. ఆడి అయ్యకి అమ్మకి కూడెట్టటానికి బతకాలి." అనుకున్నాడు రంగడు.

'ఆడు తను చావకుండా అడ్డు పడినాడు. ఆడు చావకుండా తను అడ్డుపడినాడు. బాకీ చెల్లిపోయింది.'

రంగడు తృప్తిగా వూపిరి పీల్చాడు.

గాలి విసురుకి బుట్ట తల్లకిందులై పోయింది. రంగడు నీళ్ళలో పడ్డాడు.

కారు మేఘాల గర్జనల మధ్య వణికి పోతున్న ఆకాశం, ప్రళయ తాండవం చేస్తున్నది, మూడు వైపులా అల్లుకు పోయిన కొండల సమూహం, మానవుడి ప్రతిభకి తార్కాణంగా మహోన్నతంగా నిలిచిన డామ్, తను పదేళ్ళు జీవించిన వూరు, అన్నీ ఒక్కసారి చూసి తలెత్తి నమస్కారం చేసి ఈ లోకం నుంచి సెలవు తీసుకున్నాడు రంగడు. ✻




మేము కొత్తగా విజయవాడ వచ్చిన రోజులవి.

మావారు ఆఫీసరుగా ప్రమోషను మీద వచ్చారు.

ఇల్లు—అదీ కంపెనీ వాళ్ళే ఇచ్చారు, చాలా పెద్ద ఇల్లు!

నేను ఇంట్లో అన్నీ సర్దుకుంటుంటే—మావారు హెల్ప్ చేస్తున్నారు—మధ్య

మధ్యలో వాళ్ళ ఆఫీసు కబుర్లు చెప్తూ.

మావారికి తనదగ్గిర ఎవరు పనిచేస్తున్నా వాళ్ళని గురించి డిటెయిల్డ్ స్టడీ చేయడం బాగా అలవాటు. స్టడీ చేసినంత వివరంగానూ నాకు వర్ణించి చెప్తూ వుంటారు.

ముందు ఇంట్రడక్టరీగా ఒక్కొక్కరి గురించి చెప్పుకొస్తున్నారు

ఆయన చెప్పిన వాళ్ళల్లో నాకు కుతూహలం కలిగించింది-ఆయన క్లర్కుల్లో ఒకడైన కొండయ్య గురించి.

"పాపం కొండయ్య చాలా మంచివాడు. ఆయనకి ముగ్గురుపిల్లలు. ఇద్దరు ఆడపిల్లలు, ఒక మగ పిల్లవాడు, భార్య పోయిందిట-మూడేళ్ళకిందట కాన్సర్‌తో-పిల్లలు తాత నాయనమ్మల దగ్గిర వుంటారు. ఈయనొక్కడ ఒక్కడే వుంటాడు. చాలా డెడికేటెడ్ వర్కర్," అని మావారు చెప్తుంటే నా మనసులో కొండయ్యంటే సానుభూతి ఏర్పడిపోయింది. పాపం పిల్లల్ని ఒక్కడూ ఎట్లా నిభాయించుకుంటాడో — అందులో ఆడపిల్లలకి తల్లి అవసరం ఎంతైనా వుంటుంది కొంతలో కొంత నయం-ఇతడికి తల్లీ తండ్రీ అన్నా వున్నారు" అనుకున్నాను.

మా అమ్మ పోయినప్పటి మా ఇంటి పరిస్థితి గుర్తుకు వచ్చి నాకు మనసు కలత బారింది. కళ్ళు చెమర్చాయి.

"మరీ అంత సెన్సిటివ్ అయితే ఎట్లా వీణా...నువ్వు అన్నిటికి బాధపడతావు" నా కన్నీరు తుడిచారు మా వారు

"నేను ఎందుకు చెప్పానంటే అతడికి ఇల్లు కావాలిట, మంచి ఇల్లు దొరికేదాకా మన అవుట్ హౌస్‌లో వుంటా నంటున్నాడు. నిన్నడిగి చెప్తామని-నువ్వు సరే నంటే అతడికి చెప్తాను...."

"పోనీ ఇవ్వండి ...పాపం ఒకడేగా.... మనకేం కష్టం....వుంటాడు మనతో బాటే" అనేశాను చప్పున

ఆ తరువాత ఒక వారం లోపలే కొండయ్య వచ్చి చేరాడు—మా అవుట్ హౌస్‌లో.

చేరడానికి ముందు మా ఇంటికి వచ్చాడు.

నేను నిర్ఘాంత పోయాను ఇతడేనా కొండయ్యంటే అని!

లేటెస్ట్ స్టైయిల్ పాంట్, బొమ్మలూ చారలూ వున్న బుష్ కోటూ...నోట్లో కిళ్ళీ. .అప్పుడే సిగరెట్ పారేసినట్లున్నాడు వాసనింకా వస్తూనే వుంది!

చూస్తుంటే నా మనసులో వున్న కొండయ్య బొమ్మకీ కొండయ్యకీ పోలికే లేదు.

కొండయ్యంటే వున్న సానుభూతి చోటులో ఎందుకో గాని-జుగుప్స చోటు చేసుకుంది.!

నా మనసులో రకరకాల ఆలోచనలు-

ఉద్యోగం చెయ్యడానికి కాబోతే - పిల్లల్నెందుకు దగ్గిరుంచుకోడు? ఒక్కడే వుండడం ఎందుకు? అసలా మాటకొస్తే తల్లీ-తండ్రీ - పిల్లలందరితో కలిసే వుండొచ్చు. ఇతడు చేసే ఉద్యోగానికి వేరే ఇల్లు-దానికి అద్దె-ఇవన్నీ ఎందుకు? తల్లిలేని పిల్లలకి తండ్రిప్రేమ కూడా లేకుండా చేస్తున్నాడు. పైగా హోటల్లో భోజనంట!

మా వారితో ఇదే అంటే-"అవి అవన్నీ మనకెందుకు? మనతో మంచిగా మర్యాదగా వుంటాడు. అది చాలదూ," అన్నారు.

ఏమాట కామాటే చెప్పుకోవాలి మాతో మంచిగానే వున్నాడు.

మాతో ఎప్పుడు మాట్లాడినా తన మీద మాకు సానుభూతి కలగాలన్నట్లు మాట్లాడే వాడు.

"ఇంక నాకేముందండీ జీవితంలో. ఈ

---

మాధవపెద్ది పుణ్యశీలా ప్రసాద్

---



ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధి



ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య

# స్వాతంత్ర్య సమరయోధులకు మన నివాళులు

విదేశీ పాలనకు వ్యతిరేకంగా అహింస, సహాయ నిరాకరణ అనే ఆయుధాలతో మనం జరిపిన స్వాతంత్ర్య సమరం ప్రపంచ చరిత్రలోనే ప్రసిద్ధమైనది. చరిత్రాత్మకమైనది. విదేశీ దాస్యశృంఖలాలనుంచి మాత్ర

దేశాన్ని విముక్తి కలిగించే మహత్తర కార్యానికి అనేక మంది స్వాతంత్ర్య సమర యోధులు ఆత్మ బలిదానం చేశారు. గాంధీజీ, జవహర్లాల్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్, సుభాష్ చంద్రబోస్, ప్రకాశం పంతులు, డాక్టర్ పట్టాభి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కాశీనాధుని నాగేశ్వరరావు, బులుసు సాంబ మూర్తి, మాడపాటి హనుమంతరావు, స్వామి రామానందతీర్థ, జమలాపురం కేశవరావు, బూర్గుల రామకృష్ణారావు, కల్లూరి సుబ్బారావు, కొండా వెంకట రంగారెడ్డి లాంటివారు మరి అనేకానేకమంది స్వాతంత్ర్య సమర యోధులు చేసిన త్యాగాన్ని తర తరాలుగా భారతీయులు భక్తి పూర్వకంగా స్మరించుకుంటారు.

ఈ స్వాతంత్ర్య సమర యోధులు దేశానికి చేసిన సేవలు, త్యాగాలు ఈరోజు స్ఫురణకు తెచ్చుకుంటూ, వారు చూపిన బాటలో ముందుకు సాగి పోతూ, వారికి సరియైన వారసులమని రుజువు చేస్తామని శపథం తీసు కుందాం.

---

సమాచార, పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు

నెం. 68. డి. ఐ. పి. ఆర్.

పిల్లల బాధ్యత అయ్యాక-నాకున్న వన్నీ అమ్మేసి నేనే ఆశ్రమానికో వెళ్ళిపోతాను" అనేవాడు. అట్లా అంటుంటే నిజంగా నే జాలేసేది.

దాదాపు మావారి వయసే వుంటుంది అతడికి పాపం-సంసార సుఖం లేదుకదా అనిపించేది.

"నేను ఎక్కువగా ఇంటికెళ్ళనండీ-వెళ్ళా నంటే మా అమ్మకీ నాకూ పోట్లాటే ..." అన్నాడొకరోజు.

"ఏదేం?" అన్నాన-నేను కాఫీ ఇస్తూ.

"ఏముంది? మళ్ళీ పెళ్ళి చేసుకోమంటుంది. మళ్ళీ నన్నొక పంజరంలో పెట్టి నాకు బంధాలు తగిలించాలని చూస్తోంది. ఆవిడ."

"పోనీ - చేసుకోండి పెళ్ళి" అనలేక పోయాను-నేను. అసలే తల్లిలేని పిల్లలు-ఆ బాధ ఒక్కటే వుంటే ఇంకా దానికి సవతి తల్లి బాధ కూడా తోడయితే...? అని పించింది.

ఒకరోజు రాత్రిపూట భోజనాల టైములో వున్నాడు మా ఇంట్లో.

నేను భోజనానికి లేవమన్నాను.

"వద్దండీ" అన్నాడు.

నేను మొహమాటమేమో అనుకున్నాను. కాదుట. అతడు ఒక్కపూటే భోంచేస్తాడుట!

"ఎందుకండీ ఈ శరీరాన్ని ఎట్లాగో బతికించుకోడానికేగా? ఒక్కపూట భోజనం చాలు. అందులో కూడా ఉప్పు, కారం బహు తక్కువ తింటాను నేను. అసలు పూర్తిగా పుండవనే చెప్పాలి."

అంటే? ఒక విధంగా బ్రహ్మచర్యం అవలంబిస్తున్నాడా?

అని నేమనకోవాలా?

ఏదీ నిర్ణయించుకోలేక పోయాను నేను!

కొండయ్య మా అవుట్ హవుస్‌లో చేరి రెండు నెలలు గడిచాయి

సిగరెట్ వాసనలూ రేడియో కేసెట్ల పాటలూ వచ్చేవి-వినవచ్చేవి.

ఆ పాటల్లో ఎక్కువగా విరహ గీతాలే వుండేవి. నేను-మావారూ "పాపం" అనుకునేవాళ్ళం.

పెద్దగా డిస్టర్బెన్సేమీ లేదనే చెప్పాలి.

ఆ రోజు కొండయ్య ఇంట్లోంచి ఏవో ఆడ గొంతులు వినిపించాయి.

ఎవరా అని మేమాశ్చర్య పోయాము. ఎవరైనా బంధువులేమో అనుకున్నాము.

అది మొదలు ప్రతిరోజూ పన్నెండు గంటల దాకా ఆడగొంతులు-గాజులచప్పుళ్ళు వినబడుతూనే వుండేవి.

కొండయ్యని పిల్చి నేనేదన్నా అంటానని ముందరే ఊహించారేమో మావారు. నన్ను హెచ్చరించారు అట్లాంటి పనేమీ చెయ్యొద్దని.

నేను అతి కష్టం మీద వూరుకున్నాను.

మా ఇంట్లో పని చేసే అమ్మాయి "కొండయ్య అడిగాడు వాళ్ళింట్లో కూడా చెయ్యమని, చెయ్యనా?" అని నన్నడిగింది

పోనీ చేస్తే ఏం? దానికీ కొంచెం డబ్బులు వస్తాయికదా అని నేను సరే నన్నాను.

అదీ చిన్నది-పెళ్ళయింది. కానీ పిల్లల్లేరు.

అది వాళ్ళింట్లో పనిచెయ్యడం ప్రారంభించింది.

రోజులు గడుస్తున్నాయి.

ఒకసారి తన పిల్లలు ముగ్గుర్ని తీసుకువచ్చి నాలుగు రోజులుంచుకుని పంపించాడు కొండయ్య.

కూతుళ్ళిద్దరూ ముచ్చటగా విరిసిన పువ్వుల్లాగా వున్నారు.

పెద్దపిల్ల పదహారేళ్ళది-

చిన్న పిల్ల పన్నెండేళ్ళది-

పిల్లవాడు ఎనిమిదేళ్ళవాడు-

వాళ్ళనాన్న పరిచయం చెయ్యగానే వంగి కాళ్ళని నమస్కారం చేశారు ఆడ పిల్లలు.

వాళ్ళని చూస్తే నా మనసు కరిగి

పోయింది. ఆ నాలుగు రోజులూ ఎక్కడికో అక్కడికి తీసికెళ్ళాడు వాళ్ళనాన్న. ఏవేవో కొనిపెట్టాడు.

ఒకరోజల్లా మాతో గడిపారా పిల్లలు. ఎంతో చక్కగా పనీ అదీ చేస్తూ నవ్వుతూ కలుపు గోలుగా వుండే ఆ పిల్లలంటే నాకు ప్రత్యేకమైన అభిమానం ఏర్పడింది.

మళ్ళీ కొండయ్య భార్య గురించి చెప్తూ "నాభార్య నేనంటే ఎంతో ప్రేమగా వుండేదండీ. చివ్వరి క్షణం వరకూ నన్ను తన పక్కనించీ కదలనివ్వలేదు. వాళ్ళమ్మ గానీ-మా అమ్మగానీ-ఎవ్వరూ అక్కర్లేదంది. నేనుంటే చాలంది-" అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

ఆ పిల్లల్నీ—అతడ్నీ ఆ విధంగా చూస్తుంటే నాకు కడుపు తరుక్కు పోయింది.

ఓదార్పు వచనాలని పలికాను.

నన్ను చూసి మావారు పక పకా నవ్వారు!

"ఏమిటీ-నీకు నిమిషానికో అభిప్రాయం" అని! ఒక రోజు సెందుకో అవుట్ హౌసు వైపు యథాలాపంగా చూసిన నేను ఆశ్చర్యపోయాను. తలుపు తెరిచి వుంది.

లోపలగదీ- అంతా స్పష్టంగా కనబడు తుంది.

ఆ గదిలో సోఫా కం బెడ్ మీద మా పని మనిషి కూచుని వుంది!

పని మనుషుల్ని కుర్చీల్లో పక్కలమీదా కూచోబెట్టుకునే అలవాటు నా కెప్పుడూ లేదు. అది మా ఇంట్లో ఇన్ని రోజులుగా చేస్తున్నా ఎప్పుడూ చెయ్యనూ లేదు-!

అయినా కొండయ్యింట్లో ఎవరూ ఆడ వాళ్ళూ లేరు. పిల్లలూ వెళ్ళి పోయారు. దీనికింత చనువేమిటంట?

ఆ తరువాత అడుగుదామని నా నాలిక చివరి వరకూ వచ్చినా-నా కెందుకులే-నా ఇంట్లో చెయ్యలేదు కదా....అని వూరుకున్నాను.

తరువాత్తరువాత అది కొండయ్య లేక పోయినా ఆయనింట్లో పని చేసుకోవడం—స్నానం అదీ కూడా అక్కడే చెయ్యడం గమనించాను నేను. అది దానిల్లులాగే వాడు కుంటోందా?

ఏమిటో నా కిట్లాంటివి అసహ్యాన్ని కలిగిస్తాయి.

రోజులు జరిగి పోతూనే వున్నాయి.

రాత్రుళ్ళు అవుట్ హౌస్‌లో ఆడ గొంతులు వినబడతూనే వున్నాయి.

పని మనిషి దానిపని అది చేసుకు పోతూనే వుంది. కానీ పనిలో కాస్త అశ్రద్ధ కనబడింది నాకు ఎందుకో మరి!

ఎందుకా అని ఆలోచిస్తున్న నాకు ఒక రోజు పొద్దున్నే ఏలకాయ నములుతూ పనిలోకి వచ్చిన పని మనిషి కనబడింది.

"ఏమిటి సంగతి" అనడుగుతే చెప్పింది.

"అన్నం సహించటం లేదు రెండు నెలల నుంచీ అనుమానం" అని!

"చాలాసంతోషమే అమ్మా" అన్నాను.

ఏమి అపురూపమో గాని తరువాత నెలకే నేను చెయ్యలేనంటూ పని మానే సింది.

మా ఇంట్లో మానేసిన వారానికి గూడా అవుట్ హౌస్‌లో పని చేస్తూ కన బడింది.

నాకు ఒళ్ళు మండింది.

నాకింకా పని మనిషి కుదర్లేదు.

"మా ఇంట్లో పని చెయ్యలేని దానివి-అక్కడ ఎట్లా చేస్తున్నావని" అడిగాను ఉండబట్టలేక.

అంటే-అక్కడా మానేసింది.

ఆ తరువాత అదే ఆలోచిస్తున్న నాతో మావారు "ఏమిటి-ఆలోచన? ఔవుట్ హౌస్‌కీ-పని మనిషికీ వున్న సంబంధాన్ని గురించా?" అన్నారు, హాస్యంగా.

నేను ప్రశ్నార్థకంగా చూశాను.

ఆయన నవ్వారు.

మరో ఆరు నెలలు గడిచాయి.

మా వారు ఆఫీసు విషయాల్లో అవినీతిని గురించి చెప్తూ-ఈ మధ్యన ప్రవర్తన-నడత

సరిగ్గా లేనివాళ్ళని ఇద్దర్ని సస్పెండు చేశా మనీ-మరో ఇద్దరికి గట్టి వార్నింగులు ఇచ్చామనీ చెప్పారు వాళ్ళెవరెవరో పేర్లు మాత్రం నాకు చెప్పలేదు.

కానీ

మా అవుట్ హౌవుస్‌లో ఆడ గొంతులు వినిపించడం మానేశాయి.

నేను హాయిగా నిట్టూర్పు విడిచాను.

ఒక రోజు కొండయ వచ్చాడు మా ఇంటికి.

ఈ మధ్య అతడు వచ్చి చాలా రోజులే అయింది. నేను కుశల ప్రశ్నలు వేస్తుండగా చెప్పాడు.

"తన పిల్లలకి పెళ్ళి" అని!

"చాలా సంతోషం. అయినా రెండో పిల్ల మరీ చిన్న పిల్ల కదా. పన్నెండేళ్ళ కేనా?" అన్నాను

"మంచి సంబంధాలు కుదిరాయండీ చేసేస్తే నా బాధ్యత తీరుతుంది. మళ్ళీ నేనెల్లా వుంటానో... మా అమ్మా నాన్న పెద్దవాళ్లు .... అయినా చిన్నపిల్ల పెళ్ళయినా అత్తారింటికి కొన్నాళ్ళయ్యాకే వెళ్తుంది లెండి" అన్నాడు. ఈ రోజుల్లో ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు కావడం విడ్డూరమే మరి!

కానీ అది వాళ్ళిష్టం. ఇదీ ఒకందుకు మంచిదేనేమో. "ఎడోలిసెన్స్" అమ్మాయిలు బాయ్‌ఫ్రెండ్స్ కావాలనుంటే భర్తలతోనే తిరగొచ్చు. ఆరోగ్యకరం!

"ముహూర్తాలు కూడా పెట్టుకున్నామండీ ఇంక రెండు నెలలలోనే పెళ్లిళ్లు. మావూళ్ళోనే ... మీరు తప్పకుండా రావాలి"

"తప్పకుండా వస్తాం" అన్నాను.

అతవెళ్ళిపోయాడు.

కొండయ పెళ్ళి పనుల మీద హడావిడిగా తిరుగుతున్నాడు. పెళ్ళి పల్లెటూరులోనేమో-ఇక్కడ్నించి చాలా చేరేస్తున్నాడు.

పెళ్ళి దగ్గిరిలో కొచ్చింది. ఇంక ఒక నెలే వుంది కొండయ్య ఇంటికి ఎవరెవరో వచ్చి పోతూనే వున్నారు.

ఆరోజు-

నేను బయటి గేట్లోనించి ఇంట్లోకి వస్తుంటే-కొండయ్య ఎదురుపడి నమస్కారం చేశాడు.

నేను పెళ్ళి విశేషాలడుగుతూ "మీ ఇంటికి చాలామందే గెస్టులు వస్తున్నారే వియ్యాల వారా?" అన్నాను.

అతడు ఎందుకో తడ బడుతూ తల వంచుకున్నాడు.

నా కాశ్చర్యం వేసింది.

"మా పేరెంట్స్ వచ్చారండీ....ఇంకా, ఒక విధంగా వియ్యాలవారే..."

అన్నాడు మెల్లిగా.

"అంటే? ఒక విధంగా ఏమిటి?" అన్నాను.

"మానాన్న-అమ్మా నాకు సంబంధాన్ని మాట్లాడుతున్నారు" అన్నాడు.

"మీకా?" అన్నాను తెల్లబోయి.

"అవును-నన్ను ఒకటే బలవంత పెడుతున్నారు. వాళ్ళు అంతగా బలవంత పెడుతుంటే కాదన లేక పోయాను."

నాలో ఏవేవో ఆలోచనలు.

"సంబంధం సెటిలయినట్లే........ఆ అమ్మాయి మా కులం కాదు. ఇంకోటేమిటంటే ఆ అమ్మాయిది కూడా ఒక రకంగా నా లాంటి కేసే .. డైవర్స్‌డ్ .......ఒక ఆడపిల్ల కూడా వుంది."

చెప్తున్నాడు కొండయ్య—

అయితే ఆదర్శ వివాహ మన్నమాట—

కొంత వరకూ మంచి వాడే... కన్నె పిల్లల వరకూ పోలేదు.

"అయితే మీ పిల్లల పెళ్ళిళ్ళవంగానే మీ పెళ్ళన్న మాట-" అన్నాను.

"కాదు ఈ లోపలే అంటున్నారు. పెళ్ళంటే పెద్ద ఆడంబరంగా కాదు. ఒక చిన్న ఫంక్షన్ లాగా గుళ్ళోనే కానిస్తాం."

"మంచిది, చాలా సంతోషం-" అన్నాను.

"ఆ భార్య మీద వున్న ప్రేమా-బ్రహ్మచర్యం-అన్నీ ఏమయి పోయాయి?" అదే అన్నాను మావారితో.

"ప్రపంచంలో మనుషులు అనేకరకాలు" అంటూ మావారు నాకింకో విచిత్ర వార్త చెప్పారు. ఈయన చేసుకోబోయే అమ్మాయిని భర్త వదిలెయ్యలేదు. భర్తనే ఈవిడ వదిలేసింది.

భర్తకి పిచ్చి. అదీ కారణం.

మెంటల్ హాస్పటల్లో వున్నాడాయన.

అందుకని ఈవిడ ఇంకో పెళ్ళి చేసుకుంటోంది! నా తల తిరిగి పోయింది.

ఇదే దేశం? భారత దేశమేనా?

ఈదేశ సంస్కార మేమిటి?

భర్త బతికి వుండగా భారత స్త్రీ ఇంకో పెళ్ళి చేసుకోడమా?

భర్తకి పిచ్చి-అయితే నయం కాదూ? నయం కాదే అనుకో అయినా అభర్తని-మనస్థితి సరిగ్గా లేని భర్తని చూసుకుంటూ ఆయనకి చేయూత నిచ్చి ఆ పిచ్చి నయం కావడానికి దోహదం చేసి మామూలు మనిషిని చేసుకో నక్కరలేదా?

ఆయన ఖర్మానికి ఆయన్ని వదిలి

తను వేరేపెళ్ళి-దేనికి?

తుచ్ఛమైన శరీర సుఖాలకోసం చేసుకొని సుఖస్తుందా అది సుఖమా?

దేనికోసం ఈ పెళ్ళి? తనకి భవిష్యత్తులో చూసుకోడానికి తను కడుపున కన్న పిల్లుంది అంత వరకూ అండ దండలుగా తల్లి దండ్రులున్నారు — అన్నదమ్ములున్నారు-డబ్బుంది.

ఇంకెందుకు మరో పెళ్ళి

ఆ భర్తకి నయమయి వస్తే ఆయన సంగతి?

కనీస మానవ ధర్మం-స్త్రీ హృదయం, కరుణ, జాలి, కనికరం అన్నా వుండాలి. ఏవి, ఎక్కడున్నాయి?

నాకు నేను ఎప్పుడో కొన్ని సంవత్సరాల కిందట చదివిన కోమలాదేవి గారి నవల "బంగారు పంజరం" గుర్తొచ్చింది.

అందులో నాయిక భర్తకి పిచ్చి పడుతుంది. యావజ్జీవం ఆయనతో వుండి, సేవలు చేసి అహర్నిశలూ కనిపెట్టుకుని వుండి చాలా ఏళ్ళకి దాదాపు వార్ధక్య దశలో ఆయనకి పిచ్చి తగ్గితే అప్పుడు ఆయనతో సంసార జీవితం సాగిస్తుంది. ఎవరేమన్నా లెక్క చెయ్యదు. ఎన్నో కష్టాలు ఎదుర్కొంటుంది.

అవునుమరి. పెళ్ళంటే అది కేవలం మూడు ముళ్ళ బంధమే కాదు.

అది జీవితానుబంధం జన్మజన్మల బంధం. లేకపోతే పెళ్ళికి అర్థం ఏమిటి?

మాంగల్యానికి విలువ ఏమిటి?

సుఖంగా వున్నన్నాళ్ళూ సుఖించి, కష్టంలో వున్నప్పుడు ఆయన మాంగల్యం ఆయనకి పడేసి తను మరోపెళ్ళి చేసుకోడం భార్యకి; భార్య కష్టంలోవుంటే తన కపానికి తనని వదిలేసి - మరో పెళ్లి చేసుకోడం భర్తకీ న్యాయమేనా? ధర్మమేనా-కాదు-కాదు.

ఇది చాలా అన్యాయం. నా మనసు ఘోషించింది.

మావారు అనునయంగా నా భుజం మీద చెయ్యేశారు.

"నువ్వు అతిగా ఆలోచించి నీ మనసుని పాడు చేసుకోకు పిచ్చి.... మంచిదానివి కదూ?"

నన్ను లోపలికి నడిపించుకు వెళ్ళారు మావారు.



# ఈగ తేనెటీగ

## లేజీ

కల్పనకి తల నొప్పిగా వుంది. అది ఫిజిక్స్ పీరియడ్‌లో మరింత ఎక్కువయింది. ఆఖరి పీరియడ్ ఫిజిక్సేమిటి అని లిట్టుకుంది. బి. యెస్సీలో చేరినందుకు పశ్చాత్తాపడింది కూడా! వాచీ చూసుకుంది. నాలుగున్నర. ఇంకా అరగంట ఏడ్వాలి. లెక్చరర్ చెబుతున్నది చెవుల దాకా పోవడం లేదు. సుమలత, శిరీష భావన కేసి చూసింది. వాళ్లు నవ్వు ముఖాలతో వింటున్నారు. కల్పనకి అది మరీ కసనిపించింది. శిరీషని గిల్లిందికూడా!

గంట మ్రోగింది. పీడ విరగడైందనుకుంది. వ్యానిటి బాగ్‌నుంచి మాత్ర తీసుకుని, క్యాంటీన్‌కి వెళ్ళింది. గరంచాయ్‌తో పాటు చాక్‌లెట్లు కూడ తింది. బస్‌స్టాప్ కాలేజీ ఎదురుగా లేదు. ప్రక్క సందు నుంచి మెయిన్‌రోడ్ ఎక్కాలి. గేటు దాటగానే ఆటో కనపడింది. కల్పన ఎక్కి కూర్చుంది అంతదూరం ఎవరు నడస్తారు? కల్పన దగ్గర పదిహేను రూపాయలు దాకా వున్నాయి. గైడ్ కొందామని ఉంచుకుంది. స్టోర్స్ మూడో అంతస్థులో వుంది. అక్కడదాకా పోడానికి బద్ధకం వేసింది. రేపు కొనుక్కుందామనుకుంది.

గుమ్మంలో ఆగింది ఆటో. ఆరు రూపాయలు చెల్లించింది. నాగలక్ష్మి వరండా వూడుస్తోంది. మాతంగరావు రాజీఛైర్‌లో చుట్టలు చుట్టుకుంటున్నాడు.

"అరమైలు పైసలతో పోయేదానికి ఆటో ఎందుకే?" నాగలక్ష్మికి ఖర్చులంటే యిష్టముండదు.

"ఎంతకీ బస్సు రాలేదు" (ఓ అబద్ధం)

"కాస్సేపు ఆగకూడదూ"? (ఓ నిష్ఠూరం)

"తలనొప్పిగా వుంది" (ఓ మూలుగు)

"బాగున్నాయి వద్ధతులు" (ఓ యీసడింపు)

మాతంగరావు తాజా లంక పుగాకు

చెల్లూరి సీతారాజేశ్వరరావు

చుట్టను వెలిగించి "ఇంట్లోకి రాగానే దానిమీద పడతావేమిటే? వస్తే వచ్చిం దిలే! అనలే నా చిట్టితల్లి చదువుతో చిక్కి పోతోంది" అన్నాడు.

కూతురు లోపలికి వెళ్ళిపోడంచూసి "ఇలాగే ముద్దుచేయండి, మొద్దులా తయా రవుతుంది." అంది వూడుస్తూ.

వాడేసి, మంచం మీద అడ్డదిడ్డంగా పడు కుంది.

మేడ మీది గది ఆమెకి ప్రత్యేకం. ఆమె తర్వాత సుందరం మద్రాసులో చదువు కుంటున్నాడు. సెలవులకి వచ్చిన పుడు అక్కగది తనకిమ్మని పేచీ పెడ తాడు. నాగలక్ష్మి కొడుకుని సమర్థి



మాతంగరావుకి కూతురి మీద అభి మానం ఎక్కువ. ఆమె పుట్టాకనే లాయర్‌గా అతడికి గుర్తింపు లభించింది.

కల్పన పుస్తకాలు టేబిల్ మీద గిర

స్తుంది. మాతంగరావు పడనిస్తేగా!

నాగలక్ష్మి పెసర పుణుకులు, టీ కల్పన దగ్గరకి పట్టుకెళ్ళింది. "పనిమ నిషి రాలేదు. అన్నీ నేనే చేసుకోవా

....కథల పోటీలో కన్సొలేషన్



లాయే!" దీర్ఘం తీసుకుంటూ వెళ్ళిపోయింది.

తనని చెయ్యమని కాబోలు!

పడుకునే పెసర పునుకుల పళ్లెం అందుకుని ఉంది. టీకూడా అలాగే అందుకుంది. గ్లాసు మంచంపై ఒలికింది. తెల్లటి దుప్పటి కరాబయింది. కాస్సేపటికి నాగలక్ష్మి అలా వచ్చింది "భానుమతి గారు పేరంటానికి పిలిచారు, వెళ్ళకూడదే...." అంటూ దుప్పటి చూసింది.

"నీ బద్దకం కూలా? రేపు సంసారం ఏంచేస్తావే? ఏళ్లు వస్తున్నా వివేకం రాపడం లేదు" నాగలక్ష్మి అప్రసన్నంగా వెళ్ళిపోయింది.

సినిమా పత్రిక చూస్తూ పడుకుంది. తొమ్మిదిన్నరయింది. అన్నానికి పిలుపు వచ్చింది. డైనింగ్ టేబిల్ దగ్గర అద్దంలో తనని చూసుకుంది! అలసటగా కనపడింది.

ముఖం రుద్దుకోడానికి చలి అడ్డం వచ్చింది. దువ్వెనతో పైపైన దువ్వుకుని, పౌడరు రాసుకొని చీర మార్చుకుంది.

---

# బహుమతి పొందిన కథ

కల్పన పదహారేళ్ళ వయసులో లేక పోయినా పసందైన వయసులో వుంది. అప్సరస, వెరపుతీగ, అందాల భామ వగైరా ... నాలు ఆమెకి సరిపోతాయి. మనిషి సన్నగా ... బద్ధకం లావు! కాల క్షేపం కోసం కాలేజీ చదువు!

ఆరసంవత్సరం పరీక్షలు వస్తున్నాయి అర్ధరాత్రిదాకా చదువుదామను కుంది, పుస్తకం అందుకోగానే నిద్ర ముంచుకు వచ్చింది మాతంగరావు వచ్చి లైట్ ఆర్పి, రగ్గు కప్పి వెళ్ళాడు "వెర్రితల్లి" అనుకుంటూ!

అలవాటుగానే అయిందిటికి అలారం మ్రోగింది. కల్పన లేవ లేదు. తల్లి పిలుపులతో ఎనిమిదిన్నరకి ఆవలిస్తూ లేచింది.

ఏదో పండుగరోజు! ఇంకా పనులు కాలేదని నాగలక్ష్మి హైరాన పడి పోతోంది. ఆమెకి కంగారు ఎక్కువ. ప్రతి చిన్న పనీ అవుతుందో, అవ దోనంటూ చిందులు తొక్కుతుంది.

కల్పనకి లేచినప్పటి నుంచి తన బ్రష్ బట్టలు వగైరా వెతుక్కోవడంతోనే సరిపోతుంది. ఎక్కడివక్కడ గిరవ వేస్తుంది. దాంతో ఏవస్తువు ఎక్కడ వుంటుందో ఆమెకే తెలియదు. తల్లి బలవంతంవల్ల తలంటి పోసుకుంది.

"వంటయ్యేసరికి ఆ పప్పు రుబ్బి యియ్యమ్మా? నీకు మీనాన్న గారికి మషాళా గారెలు యిష్టం కదా!" గారెలు ఆమెకిష్టమే! చాకిరీ యిష్టం లేదు! "నాకెలా కుదురుతుందమ్మా! ప్రయివేటు క్లాసు వుంది."

"పండగ రోజున క్లాసులేమిటే?" ఆ చాకిరీ తనకే మిగిలిందన్న ఉక్రోషంతో!

మాతంగరావు రంగంలోకి దిగాడు. "నీలా వానాకాలం చదువనుకున్నావా? అమ్మాయి గ్రాడ్యుయేట్! దానికి పనులు చెప్పక, ఓపిక వుంటే నువ్వుచేసుకో. లేకపోతే మానెయ్యి?"

"తండ్రీ కూతురూ ఒకటి! నేనే ఈ యింట్లో దాసీ మనిషిని! ఎవరి వల్ల పూచిక సాయం లేదు!" నాగలక్ష్మి సణుక్కుంది.

కల్పన హాయిగా మార్నింగ్ షోకి పోయింది, పుస్తకాలు డిఫెన్సు.

రెండు గంటలకి వచ్చింది చదివి నంత అలసట ముఖంలోకి తెచ్చుకుని. భర్తకి కూతురికి డైనింగ్ టేబిల్ మీద వడ్డించింది.

"అమ్మడూ! ఏమాట కామాటే చెప్పుకోవాలి. మీ అమ్మ గారెలు వండితే మహా బాగుంటాయి!" అన్నాడు కొరుకుతూ.

"నాకూ వచ్చుడాడీ, పప్పు రుబ్బి మషాలా కలిపి నూనెలో వడేయడమే!

"వెధవ బుద్ధి పోనిచ్చుకోవు!" నవ్వుతూ కసురుకుంది తల్లి.

నాలుగు రోజులు పోయాక యూని వర్సిటీ పరీక్షల కోసమని వంద రూపా యలు పట్టుకెళ్ళింది. కాని కల్పనకి ఆఫీసురూం ముందు క్యూ చూసి భయం వేసింది. నిలబడే ఓపికలేదు ఆమెకి. క్లాసుకువచ్చి సత్యవతికి యిచ్చింది. "నీదాంతోబాటు నాకూ కట్టేయి!"

మర్నాడు సత్యవతి ఏడుపుముఖంతో కనిపించింది. "ఏమైందే?" కల్పన అడిగింది.

"నన్ను క్షమించవే! చిన్న పొరపాటు

జరిగింది."

"ఏమిటి?"

"నిన్న ఫీజు కడదామని వెళుతుండగా అమ్మకి ఒంట్లో బాగా లేదని కబురు వచ్చింది. అమ్మకి జ్వరం. ఆ హడావుడిలో వుండగా మాతమ్ముడు వానిటీ బ్యాగ్‌లోని డబ్బు తీసుకుని వుడాయించాడు. వెతికినా కనపడలేదు వెధవ!"

కల్పన ఏమనగలదు?

"ఆ డబ్బు బాధ్యత నాదేననుకో. నెమ్మదిగా యిచ్చుకుంటాను. ప్రస్తుతానికి ఎలాగో కట్టేసుకో!" నెమ్మదిగా చెప్పింది.

ఇవాళే ఆఖరిరోజు ఫీజు కట్టడానికి. క్లాసుమాని యింటికి వచ్చింది. తండ్రి కోర్టుకి వెళ్ళబోతున్నాడు.

నసుగుతూ చెప్పింది.

"పోన్లే. మళ్లాకట్టు" మరో పంద యిచ్చాడాయన.

నాగలక్ష్మి నోరు నొక్కుకుంది. "డబ్బు దగ్గర ఎంత జాగ్రతగా వుండాలే? ఎవరికో యివ్వడం ఏమిటి"

"దాన్నే మనకు... నువ్వెళ్లమ్మా?" అన్నాడు.

కల్పన కాలేజీ కెళ్ళింది.

"దీని సోమరితనం-ఎలాతగ్గుతుంది?" ఆ తల్లి ప్రశ్న!

० ० ०

# బి జీ

రైళ్లు యిరవైనాలుగు గంటలు తిరుగుతాయి.

బెజవాడ బస్సు స్టాండు ఎప్పుడూ రద్దీగా వుంటుంది.

వాగ్దానాలు సీరియల్‌గా చేస్తాడు రాజకీయనాయకుడు.

వేణు కూడ డిటోరావు. పని, వేణు వేరు వేరు కాదు. పని = వేణు; వేణు = పని. ఇంతకి వేణు ఎవరు.

వేణు బి.ఏ 4. నాలుగో సంవత్సరం చదువుతున్నాడనికాదు. డిగ్రీ వచ్చి నాలుగేళ్లయింది. ఆ డిగ్రీ కాగితానికి రోడ్డు మీద ఎగిరే చెత్త కాగితానికి పెద్ద తేడా కనిపించడంలేదు. అయినా నిరాశ నింపుకోకుండా తాజా వ్రాత పరీక్షలకి, యింటర్వ్యూలకి వెళ్ళి వస్తూనేవున్నాడు.

అలాంటి వేణుకి మెలకువ వచ్చింది. గోడ గడియారం నాలుగు చూపిస్తోంది. లేచి తమ్ముళ్ళిద్దర్నీ లేపాడు. వాసు, సారథి నిద్రనుంచి లేవడానికి గుణిసారు, లైటు వేసి లేపి కూర్చోపెట్టాడు. వాళిద్దరూ 10వ తరగతే, "చదవండి!" గదమాయించాడు!

తల్లి దగ్గర పడుకున్న బేబీని కూడ లేపి పీథి గదిలోకి తీసుకువచ్చాడు! ఆ పిల్ల ఏడు చదువుతోంది. చదువుకోడానికి ఏడుస్తూంటుంది. అన్న బాధ పడలేక లెక్కలుతీసి "హోం వర్క్ చేసి పెట్టన్నయ్యా" అని, చాపలో తను ఒరిగింది.

ఇరవై లెక్కలు చేసే సరికి గంట పట్టింది,

"పెద్దాడా! పాలకి వెళ్లావురా?" అనసూయమ్మ కేకేసింది.

"వెళుతున్నానమ్మా"

"ఇవాళ ఓ ప్యాకెట్ ఎక్కువ తీసుకురా!"

బీరువాలోని డబ్బు తీసుకుని పాలకి పరిగెత్తాడు! పాలు తెచ్చి వాటిని పాల

5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరీ సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను
15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారతదేశంలో (ప్రప్రథమంగా తయారు చేస్తు
దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొం
అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే,
వి. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి. (వి. పి. పి. చార్జీలు అదనం)




# MERI GOLD COVERING WORKS

P.O. BOX 1405, 14, RANGANATHAN STREET
T. NAGAR MADRAS-600 017 INDIA

కుక్కర్‌లో పోసి కాచాడు! ఫిల్టర్‌లో కాఫీ డికాషన్ తీశాడు! అనసూయమ్మ అప్పుడు లేచివచ్చింది. "నల్లా రావటం లేదు. నూతినుంచి నాలుగు బిందెలు అందుకోరా!"

ఆ నుయ్యి చాలా లోతు. బొక్కి తెగి పోయింది. గేలంతో దాన్ని తీయడం ఓ పెద్దపని.

"ఏ పని చెబితే దానికే కూర్చుంటా వురా? ముందర కూరలు తీసుకురా! ఇక మీ నాన్నగారు పంటికి నిలవ నియ్యరు."

సైకిలూ కూరల సంచితో బజారుకి బయలు దేరాడు. ఆ సందు చివర చిన్న మార్కెట్టువుంది. ఖరీదు ఎక్కువని అక్కడకొనడు.

మైలు దూరంలో వున్న పెద్ద మార్కెట్‌కి వెళతాడు అక్కడ నాలుగు దుకాణాల్లోను ధరలు వాకబుచేసి అప్పుడు కొంటాడు. కొనరు అడుగుతాడు. ఇదంతా చెయ్యటం వల్ల అలస్యమవుతుంది. ఇంట్లో అక్షింతలు తప్పవు.

వేణు యింటికి వచ్చేసరికి పరశురాం లేచి షేవింగ్ సెట్టుతో వున్నాడు. బ్లేడు లేదు. "వేణూ! వేణూ..." చిందులు త్రొక్కుతున్నాడాయన. మిగతా యిద్దరు కొడుకులున్నా వాళ్ళకి పని చెప్పడు.

అసలా ఇంట్లో అందరూ అంతే! వేణుకి పని చెప్పే ధోరణికి అలవాటు పడి వున్నారు! వేణు చెయ్యడానికి అల వాటు పడి వున్నాడు.

'డూడూ బసవన్న. ఎవరేం చెప్పినా కాదనడు. తర్వాతనడు. ఏ పనికీ వెర వడు! ఇన్ని విధాలుగా యింత చేస్తున్నా అతడి మీద ఎవరికీ గొప్ప అభిప్రాయం లేదు.

"ఉద్యోగం సద్యోగం లేక ఖాళీగా వున్నాడు. చెయ్యడేం?"

పరశురాం పదింటికే ఆఫీసుకి పోతాడు. గుమ్మం దిగేదాకా వేణుకి వూపిరి సలపనివ్వడు.

పదింటికి ఆయన ఆఫీసుకి, మిగతా వాళ్ళు స్కూళ్ళకి వెళ్ళిపోయారు. అనసూయమ్మకి అప్పుడు తెలివి వచ్చింది. "ఏరా కాఫీ త్రాగావా ప్రొద్దుట్నుంచి."

"లేదమ్మా"

"తెలివి తెల్లారినట్లే వుంది-అడగద్దురా!" నాలుగు యిడ్డెన్లు కాఫీ యిచ్చింది.

ఎల్లుండి యింటర్వ్యూ వుందని గుర్తు వచ్చింది. బాత్‌రూంలో కూర్చుని బట్టలకి సబ్బు పెట్టుకుంటున్నాడు.

ఇంతలో తల్లి పిలిచింది. "తొందరగా రారా! ఇంటివారు వెల్లవేయడానికి మనుషులని పంపారు! ఆ సామాను తీయాలి"

వేణు వేగిరం బట్టలు ఆరవేసుకుని, హాల్లోన్ని గదుల్లోని సామాను తీసి గార్డెన్‌లో పెట్టాడు.

వెల్ల వేయడానికి ఓ ముసలి వ్యక్తి వచ్చాడు. మరొకడు కూడా రావల్సిందే నట. పనివుండి ఎక్కడికో వెళ్ళాడట.

ముసలివాడు దగ్గుతూ పని చేస్తున్నాడు. ఒంట్లో బాగలేదన్నాడు. చీమలా జరుగుతోంది పని.

"ఇలాగయితే ఎన్నిరోజులు వేస్తావు" వేణు అడిగాడు.

"చేస్తున్నాకదా బాబయ్యా!"

వెల్ల వెయ్యడానికి వేణుకూడా సాయపడ్డాడు. మధ్యాన్నం రెండు గంటలకి

రెండు గదులకీ పైగా అయినాయి.

పని అవడం అనసూయమ్మకి లోపల సంతోషంగా వున్నా పైకి మాత్రం హర్షించలేక పోయింది.

"వాడితో నువ్వు కూర్చుంటే ఎలా గరా? కరంటు పోయినట్లుంది. హెల్పర్‌ని చూడు ముందర! మీ నాన్నగారు తిట్టిపో స్తారు?"

వేణు భోజనం ఏదో అయిందనిపించి హెల్పర్ గురించి నాలుగు వీధులు తిరి గాడు. హెల్పర్ చివరకో పెళ్ళి పంది రిలో దొరికాడు.

"ఇవాళ రావడం కుదరదండి" అన్నాడు మొదట బిరాగ్గా.

మామూలు పడగానే మామూలుగా అయిపోయాడు. "ఇక్కడ పని తెవ ల్లేదు. ప్రొద్దుటనుంచి చేస్తున్నాను!"

వేణు కూడా ఓ చెయ్యి వేసాడు. మరో గంటలో హెల్పర్ వేణుతో కూడా యింటికి వచ్చాడు.

"నిచ్చెన తెండి ఇల్లెక్కాలి. సర్వీసు వైర్ దెబ్బ తింది"

వేణు నిచ్చెన సరఫరా చేశాడు. సాయంత్రానికి దీపాలు వెలిగాయి.

వేణు పెరట్లో మొక్కలకు నీళ్ళు పోస్తున్నాడు.

ఇంట్లోనుంచి ఏదో గలాభా విన పడింది. వేణు కూడ లోపలికి పరిగెత్తాడు. వాసు గాలిపటం కోసం యిల్లెక్కి నిచ్చెన మీద నుంచి పడిపోయాడు. రక్తం వస్తోంది. పరశురాం సరిగ్గా అప్పుడే వచ్చాడు.

"అసలు అంత నిచ్చెన వాడెలా మోయగలిగాడు!"

"వేణు యిందాక బయట వేశాడు" అన్నది అనసూయమ్మ తన తప్పు ఎంత మాత్రమూ లేదన్నట్లు.

వాడు బయట వేసినా నువ్వు లోపల వేయవద్దా అని భార్యని గద్దించలేదు. మరి!

వేణుని తిట్టి పోశాడు! (రు)

నలుగరన్న మాటలకి తల వంచు కున్నాడు! వేణుకి జీవితం అదే నేర్పింది. పరిస్థితులు ఎదిరించటం చెప్పలేదు.

గానుగెద్దులా, గాడిదలా ఎంత బరువు మోస్తూన్నా మిగిలేది తిరస్కా రాలు! తిట్లు!

ఇలాగే వెడుతున్నాయి రోజులు! ఎన్నాళ్ళో మరి?

"తిరిగి తిరిగి వచ్చి యిప్పుడా హాస్పటల్‌కి నేను పోలేను! వెధవ సంత తిన్నగా చావరు." పరశురాం విసుక్కు న్నాడు.

ఆ బాధ్యత వేణుమీద పడి ది. తమ్ముడ్ని సైకిల్ మీద ఎక్కించుకుని డాక్టరు వరదరావు యింటికి వెళ్ళాడు.

వరదరావు గవర్నమెంటు డాక్ట రయినా యింటి దగ్గరా ప్రాక్టీసు చేస్తూ వుంటాడు. వేణు వెళ్ళిన కాస్సేపటికి ఆయనా వచ్చాడు. "ప్రమాదం లేదుల్రా! కాస్త టీ త్రాగి వస్తానాగు!" అంటూ లోపలకి వెళ్ళాడు!

అర గంటకి కాని రాలేదు!

అప్పటికే పేషంట్ల సంఖ్య పెరిగింది. డబ్బున్న వాళ్ళని పవరున్న వారిని మొదట చూసి, పంపి అప్పుడు వాసు దగ్గరకి వచ్చాడు. బాండేజీ వేసి యింజెక్షను యిచ్చాడు.

# ఫలమివ్వని జీవితాలు

అది అంజూరపు పండ్ల కాలం కాదు. అయితే క్రీస్తుప్రభు ఒక అంజూరపు వృక్షం దగ్గరకు వెళ్ళి, అందులో ఆకులు తప్ప ఫలాలు లేవని కోపించి దానిని శపించాడు. "ఇకమీదట ఎన్నటికీని నీవు కాయకుందువుగాక" అని శపించటం న్యాయమేనా? అని కొందరు ప్రశ్నించారు.

'బెతనియ' అనే గ్రామమునుండి 'యెరూషలేము'కు వెళ్ళే త్రోవలో ఎన్నో అంజూరపు చెట్లు ఉండి వుండవచ్చు. అయితే క్రీస్తుప్రభు ఫలములను ఆశించే ఆచెట్ల యొద్దకు పోలేదు. అంజూరపు చెట్టు పచ్చగా కళకళలాడుతూ వుందంటే అందులో కాయలు, పళ్ళుకూడా వున్నాయని అర్థం. అయితే పచ్చని ఆకులతో చూపరులను ఆకర్షిస్తున్న ఈ చెట్టులో మానవుల ఆకలి తీర్చే ఫలాల కోసం ప్రభువెదికాడు. కానీ అందులో ఒక్క పండుకూడ ఆయనకు దొరకలేదు. అంతాపై బూటకం. వేషధారణ. ఆకుల అందమేగాని ఆకలి తీర్చే ఫలం ఒక్కటి కూడ లేదు.

నాస్తికుల యొద్దనుండి, భక్తిహీనుల యొద్దనుండి, అవిశ్వాసుల యొద్దనుండి దేవుడుకూడ ఫలములను ఆశించడు. అయితే 'భక్తి' అనే ముసుగు వేసుకొని, దేవుని సేవించే వారమని చెప్పుకునే వ్యక్తుల వైపు ఆధ్యాత్మిక ఆకలితీర్చే ఫలముల కొరకు మానవ సమాజం ఆశతో ఎదురు చూస్తున్నది. ఆత్మదాహం తీర్చే ఊటలకోసం తహతహలాడే వ్యక్తులకు ఏమాత్రం ఊరట కలిగించని సంఘాలు, సమాజాలు గొడ్డు అంజూరపు వృక్షం వంటివి కావా!

"దేవుని రాజ్యం మీయొద్ద నుండి తొలగింపబడి దాని ఫలమిచ్చు జనుల కియ్యబడునని" పలికిన క్రీస్తును గూర్చి తెలుసుకున్నారా!

వేణు తమ్ముణ్ణి తీసుకుని యింటికి బయలు దేరాడు. ఎనిమిది గంటల రాత్రి పొదుపుకి చిహ్నంగా వీధి దీపాలు వెలగడంలేదు! రిక్షా వాడు తాగిన నిషాలో గుద్దేశాడు.

వాసు క్షేమం, సైకిల్ క్షేమం.

వేణుకి దెబ్బలు తగిలాయి. అలాగే యింటికి చేరుకున్నాడు!

"ఏమిట్రా ఆ బూడిద?" పరశురాం అడిగాడు.

వాసు చెప్పేశాడు.

"పిల్లాడికేం దెబ్బ తగల లేదా?" అనసూయమ్మ వచ్చి వాసుని పరీక్షించింది.

రక్తాలు కారుతూ వేణు ఎదుటే వున్నాడాయె!

"నిద్రలో ఏడుస్తావురా? ఏ కొబ్బరినూనో రాసుకుని ఏడు!" తండ్రి-తల్లి గదమాయించారు!

సరిగ్గా అప్పుడే భూలోకం దిగాడు. అందరూ అతగాణ్ణి ఆహ్వానించడంలో పడిపోయారు.

భూలోకం అనసూయమ్మ తమ్ముడు. కోర్టు పక్షి పన్నెం వచ్చి నప్పుడల్లా అనసూయమ్మకి వెన్నపూస, కొబ్బరి కాయలు వగైరా మోసుకువచ్చి, పనులయ్యేదాకా ఓష్టు వేస్తాడు. అనసూయమ్మ తమ్ముడికి బ్రహ్మ రథం పడుతుంది.

"వేణూ! మామయ్యకి వేణ్నీళ్ళు కాచు!" పురమాయింపు.

దెబ్బలు బాధపెడుతున్నాయి. తప్పదు మరి! కాస్సేపటికి వేణు తనకి దెబ్బలు తగిలిన మాట మరచి పోయాడు.

○ ○ ○

ఆ కల్పనకీ, ఈ వేణుకి చుట్టరికం ఏర్పడింది.

3 ముళ్లు వేశాడు ఆమె మెడలో!

7 అడుగులు నడిచేశారు!

100 ఏళ్ళ భవితవ్యం కోసం.

200 రూపాయిల అద్దింట్లో దిగారు!

○ ○ ○

# నో లేజీ

కల్పన కెప్పుమంది.

ఆమెకేం ప్రమాదం జరగలేదు. ఏ దుర్వార్త వినలేదు. శారీరకంగా ఏ దెబ్బా తగల్లేదు.

మనసుకి తగిలింది. మనసు పడ్డ జీవితం మాయమై పోయింది, మనక బారిన బ్రతుకు మిగిలింది.

ఏమైంది?

చదువు పూర్తయింది. ఇంకా చదువు దామని ఆమెకిలేదు, చదివించేదే పాసవుతుందని నమ్మకంలేదు.

"మంచి సంబంధ మమ్మా. ఎప్పటికైనా నిన్ను ఓ అయ్య చేతిలో పెట్టక తప్పదు. మనం కోరినపుడు మంచి సంబంధాలు వస్తాయా?" అన్నాడు తండ్రి.

వేణుని చూసింది. ఎర్రగా ఆపిల్ పండులా వున్నాడు. బుద్ధి మంతుడిలా వున్నాడు. ఆఫీసరుద్యోగంవుంది.

పెళ్ళికి ఒప్పుకుంది.

పెళ్ళికి స్త్రీ సౌకర్యాలు చూస్తుంది. మగవాడు ఆకర్షణ కొలుచుకుంటాడు. ఈ వ్యాపారంలో ఎవరి లాభాలు వారివి.

# రెక్సోనా, మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





# మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

## రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన
## నాలుగు నూనెల సమ్మేళనం—

కాపుష్ (దేవదారు జాతి), పరళం. రెక్సోనాతో స్నానం
చెయ్యండి—అది మీ చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది,
మీరెంతో ఇష్టపడే
పరిమళాన్ని చర్మంపై
చిలిపి గుబాళింపజేసే
రెక్సోనా మీ చర్మ
సంరక్షణ కోసం
[illegible] సాధనం.




# రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

మొగుడితో ముద్దుగా కాపురం చేద్దామనుకుంది. సారథి, వాసు చదువుకి యిక్కడికే వచ్చారు.

అనసూయమ్మకి పైకి కనపడని ఏదో రోగం. ఏ పనీ చెయ్యకూడదు. కోడల్ని చూడగానే ఆ రోగం ఎక్కువైంది. వైద్యానికి యిక్కడికే వచ్చింది.

ఈ పటాలాన్ని చూసి కల్పన దడుసుకుంది. మొగుడు ప్లస్ పీళ్లూనూ! అసలే బద్ధకాలరాణి ఇంత మందికి సేవలా? తప్పలేదు.

తెల్లవారు ఝామున పాలవాడు రాకుండానే అత్తగారు తలుపు కొడుతుంది. ముసలివాళ్ళకి నిద్ర పట్టదేమో! కల్పనకి లేవబుద్ధికాదు. మొగుడు తోస్తాడు. "గట్టిగా బాదుతోంది. బాగోదు"

గది బయటకి వచ్చేసరికి అనసూయమ్మ మంచం మీదకి చేరి "ఏం పాడునిద్రలో! మేమూ కాపురాలు చేశాం! ఇంత విడ్డూరం .. మొగుడితో కులకడానికేబాధ వుండదు. అత్త ముందని చూడగానే వస్తాయి అన్ని జబ్బులూ" సణుగుతుంది.

సమాధానం చెప్పాలనుకుంటుంది. కల్పన. కాని నోరురాదు. అదోరకం భయం.

కాఫీ కాచిస్తుంది అత్తగారికి. ఇంతలో మరదులు లేస్తారు "వదినా" అంటూ కాకిగోల.

వాళ్ళ అవసరాలు చూడాలి.

ఏమాత్రం తేడా వచ్చినా తల్లికి ఫిర్యాదు. అనసూయమ్మ ఎప్పుడు తిడదామాని వుంటుంది.

సారథి, వాసు ఏడింటికి ట్యూషన్‌కి పోతారు. అప్పట్నుంచి అత్తగారి పూజా, స్నానం కార్యక్రమాలు.

అవి చూస్తూనే టిఫిన్ ప్రయత్నాలు చెయ్యాలి-భర్త వెళ్ళిపోతాడు.

మొగుడ్ని పంపేసరికి తొమ్మిది.

"ఇంకా వంట మొదలు పెట్టడం లేదా? పిల్లలు వచ్చేస్తారు" అనసూయమ్మ హెచ్చరిక.

ఏదోలా చేస్తే కాదు మడిగా చెయ్యాలి. అప్పటికి బాయిలర్ ఆరి వుంటుంది.

చన్నీళ్లే చెయ్యాలి అర్జంటుగా.

అనసూయమ్మ గుప్పెడు మందులూ, గ్లాసుడు ఓవల్‌టీన్ త్రాగి వంటింటి పెరడు గుమ్మంలో భగవద్గీత పుచ్చుకుని కూర్చుంటుంది. ఆ గీతం చదవదు, కోడలు చేస్తున్న వంటమీదే వుంటుంది దృష్టి.

సారథి వాసు తయారు. కంచాలకి రెడీ. వాళ్ళకేం చేసినా నచ్చదు. టిప్పలు-అసంతృప్తి.

"వదిన వంట బాగోదమ్మా !"

"అలా వెంచారు నాయనా ! అది మనఖర్మ" అనసూయమ్మ కామెంటు.

రవరవ లాడినా కల్పన ఏం చెయ్యలేదు ! బాగోలేదని గుణిసిన వెధవలు కంచెడూతిని కాలేజీలకి పోతారు. "నహించని వాళ్ళు వదిలెయ్యరేం ?" అనుకుంటుంది.

అత్తగారికి ఏదో స్పెషల్‌గా తయారు చెయ్యాలి. కల్పన చేస్తున్నంత సేపూ అదిలిస్తూ వుంటుంది. అది తన హక్కనుకుంటుంది ఆవిడ !

అనసూయమ్మ సుష్టుగాతిని, రోగాల

నోసారి తలచుకుని గుర్రు పెడుతుంది.

ఇంతలో దాసీది తయారు. అది వెళ్ళేసరికి అత్తగారి నిద్ర మాయం.

"వంటి క్రిందకి ఏదైనా వుందటే, ఈ రోగం వచ్చినప్పటి నుంచి ఏమీ అన్నం ఎక్కడం లేదు!"

వేడి వేడిగా ఏదో తయారుచేసి పెట్టాలి.

అప్పటికి రెండు దాటుతుంది. భోజనం చెయ్యగానే కల్పనకి నిద్ర పోవాలని వుంటుంది. కాని అనసూయమ్మ పడనీయదు. ఏదో పురమాయిస్తుంది.

చెయ్యక తప్పదు. సాయంత్రం అవుతుంది. మరదులురెడీ, వచ్చేటప్పటికే టిఫిన్ చేసి వుండాలి. లేకపోతే చిందులు తొక్కేస్తారు.

పనులన్నీ అయ్యేసరికి రాత్రి పది. అప్పుడు గదిలోకి వెళ్ళడం! మంచం మీద వాలితే 'అమ్మయ్య' అనిపిస్తుంది.

పరుగెత్తి మంచినీళ్ళు త్రాగినప్పుడు లాంటి అనుభూతి—కాని ఆమెకి రోజూ ఓ యుగంలా గడుస్తోంది.

"వీళ్ళని వంపేయండి" మొగుడు చీర సవరిస్తున్నప్పుడు మురిపెంగా అడుగుతుంది.

"అలా ఎప్పుడూ మాట్లాడకు. అమ్మ నొచ్చుకుంటుంది. ఆమె ఏదో వంట్లో బాగా లేక వచ్చింది"

మొగుడి మాతృభక్తికి ఏపగింపు కలిగేది. "నేను ఎలా పోయినా ఫర్వా లేదు. అమ్మ ముఖ్యం"

ఏడుపు ఛూవించేది.

ఫలితం సున్న.

మొగుడితో ఝూంఝూంగా సంసారం చెయ్యాలని కన్న కలర్ కలలు కరిగి పోయాయి.

మొగుడు వంటరిగాలేడు. పటాలంతో వున్నాడు. తను గౌరవమైన దాసీమనిషి. యిరవై నాలుగు గంటలూ చాకిరీ! చేసిన దానికి మెప్పు గివ్పులేదు. తిట్లు తప్ప!

శాంతి ఎప్పుడు? విశ్రాంతి ఎప్పుడు!

పెళ్ళి ఆమెకి చేదయిన తీపి పాటలా తయారయింది. మోసపోయాననుకుంది.

చుట్టంచూపుగా తల్లీ తండ్రి వచ్చారు. వారికి చెప్పుకుంది ఏడుస్తూ "నేను వుండ లేనమ్మా!"

"ఏమ్మా! ఏమైంది-అతడు తిన్నగా చూడటం లేదా?" మాతంగిరావు ఆదుర్దాగా అడిగాడు.

"ఆయన దేముడే నాన్నా" అంటూ చాకిరీ బాధ చెప్పుకుంది.

అంతావిని "కొన్నాళ్లు మనింటికి రామ్మా" అన్నాడు.

కొన్నాళ్ళు....తర్వాత మళ్ళీ యిక్కడికి రావల్సిందేగా! లాభంలేదు. సుఖపడి కష్టపడలేను. రానంది.

"సర్లే కొన్నాళ్ళు ఓపికపట్టు" అంది నాగలక్ష్మి దాటవేస్తూ. కాపురం చెరిపి కూతుర్ని తీసుకుపోలేరు కదా!

ఆ ఓర్పే ఎంతకాలం?

క్యాలండర్లు తిరుగుతున్నాయి.

కల్పనలో మార్పులేదు. మాలిమి కాలేదు జీవితం!

నిరాశా.... నిట్టూర్పులూ!

○ ○ ○

# నోబిజీ

"భలే! భలే" అనుకున్నాడు మొదణ్ణ

వేణు.

హఠాత్తుగా పెద్ద ప్రయివేటు కంపెనీలో రెండువేల జీతంతో వుద్యోగం. తర్వాత అందాలభామ కల్పనతో యాభై వేల కట్నంతో పెళ్ళి!

రెండూ వూహించని సంఘటనలు. పాలేరు ప్రభువయ్యాడు. ఇంటా బయట గౌరవాలు! వి. ఐ. పి.

"ఛ...ఛ...."అనుకున్నాడు తర్వాత.

ఎంచేత? బొంగరంలా తిరిగే మనిషికి బంధం వేసినట్లయింది. విశ్రాంతితో ముఖం మొత్తుతోంది.

కంపెనీలో కూడ పెద్ద పనివుండదు. పచ్చ యింకు సంతకాలూ, పెద్దబాసుకి ఫోన్‌లో సమాచారం చెప్పడం అంతే. గుమస్తాలు, జవానులు, అతన్నేం చెయ్య నివ్వరు.

కుర్చీలో ఈజీగా కూర్చోవడం రాత్రి దాకా! వేణుకి పుస్తకాలు చదివే అలవాటు లేదు పెద్దగా.

కాలక్షేపం పెద్ద సమస్యయింది. టీవి ముఖం మొత్తుతోంది. టీవి వెంట టీవి, రుచి తెలిడం లేదు.

ఇంటి దగ్గరయినా ఓజీగా వుందా మంటే పొసగడం లేదు. కల్పన అన్నీ ఒంటరిగా చేసుకోలేక పోతోంది.

ఏదైన చెయ్యబోతే తల్లి అడ్డేస్తుంది.

"నీకెందుకు రా నాన్నా! అది చేస్తుం దిలే! ఆఫీసు పనితో అలసిపోయి వస్తావు. ఇంటి దగ్గరయినా కొంచెం స్థిమితపడు. అన్నీ నువ్వు చేస్తే దానికి లోకువయి పోతావు."

అనసూయమ్మ లాలనగా చెబుతుంది. పటం, మొద్దు అన్న పెద్ద కొడుకునే ఆవిడ యిప్పుడు ప్రయోజకుడంటోంది. మావాడిది అఖండ జాతకమని చెబుతుంది. అనేక విధాల పొగుడుతుంది. ఆవిడేమిటి ఇంట్లో అందరూ అంతే వేణు గుడ్ లుక్స్ కోసం తాపత్రయ పడతారు.

కారణం. వేణు డబ్బు సంపాదిస్తు న్నాడు. హోదా వుంది అవి చాలు! లోకా నికి కావల్సింది వెలుగు!

బెడ్ కాఫీ మంచం దగ్గరకే వస్తుంది. పేపరు చూస్తాడు. తర్వాత చేసే పని కనిపించదు, పడుకుందామంటే నిద్రా పట్టదు. ఆఫీసుకెళ్ళేదాకా అక్కడా యిక్కడా కూర్చోవడం.

ఇలా కాదని ఓసారి కూరల కోసం మార్కెట్‌కి బయల్దేరాడు కాలక్షే పంగా వుంటుంది.

ఇది పెద్దబాస్‌కి ఎలాగో చేరింది.

వేణుని పిలిచాడాయన!

"మీరు గోనీ పెట్టుకుని ఆఫీసుకి వస్తే ఏమవుతుంది?"

పనిగట్టుకు పిలిచి యిలాంటి వెర్రి ప్రశ్నలు వేస్తాడేమిటని నిర్ఘాంతపోయి "నవ్వుతారు సార్" అన్నాడు పైకి.

"ఆపని యిప్పటికే జరిగింది. ఇంకా మన కంపెనీని నవ్వులపాలు చేయకండి. కూరలకి, చేపలకి మార్కెట్టుకి పోయి లోలెవెల్‌లో ప్రవర్తించకండి' జవాన్లు న్నారు కదా! వాళ్ళని వుపయోగించు కోండి. ఇలాంటి సందర్భాలు మరలా రాకూడదని ఆశిస్తున్నాను!"

"యస్సార్!"

"బయటకూడ మీరు హుందాగా వుండాలి."



# బంగారుభూమి

కలర్

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: పి.చంద్రశేఖరరెడ్డి B.A.

నిర్మాత: ఎస్.పి.వెంకన్నబాబు

నెల్లూరు: కళ్యాణి ఫిలింస్
సీడెడ్: నాగార్జున పిక్చర్స్
చిత్తూరు జిల్లా: నవభారత్ ఫిలింస్
నైజాం: విక్రమ్ ఫిలింస్





అలాగే కష్టపడి మెయిన్‌టైన్ చేస్తున్నాడు. ఇల్లు-ఆఫీసు. కొత్తగా క్లబ్బుకి వెళ్ళడం నేర్చుకున్నాడు.

సరదాగా పేకాట మిగతా వ్యసనాలనీ జతచేసింది! మందు .. అర్ధరాత్రి దేవదాసులా కొంపకి!

"నీకిలాంటి పాడు బుద్ధులు పుడుతున్నా యేంరా?" అనసూయమ్మ చివాట్లతో ఆగకుండా మొగుడ్ని పిలిచింది.

"భేష్... మంచి లక్షణాలే అబ్బుతున్నాయి! నాలుగు డబ్బులు చేరగానే విర్రవీగిపోక! నీకంటే పెద్ద ఉద్యోగస్తులే వళ్ళు దగ్గర పెట్టుకుని వుంటున్నారు, నీకేం పొయ్యేకాలం మరి?"

పరశురాం నాలుగక్షింతలువేసి, జీతం రాగానే తల్లికిచ్చేలా ఏర్పాటు చేశాడు (భార్యకి)

అనసూయమ్మకి శాశ్వతస్థానం. సంపాదనకి కొడుకూ, చాకిరీకి కోడలూ!

డబ్బు అడక పోవడంతో పెంద రాళే యింటికి రావల్సివస్తోంది.

పనిలేని మంగలితను!

వెనకటి రోజులే బాగున్నాయని పిస్తోంది. బంతిలా తిరిగేవాడు. పని! పని... ఇప్పుడు చేద్దామన్నాలేదు.

తగిన పనిలేక లావెక్కిపోతున్నాడు. వేణు మాటి మాటికి బరువు చూసుకుంటున్నాడీమధ్య. గుండె గుబేల్ మంటోంది. తిండి దగ్గర జాగ్రత్తగా వుందామన్నా కుదరడంలేదు. తల్లి కొసరి కొసరి తినిపిస్తుంది. ఆఫీసులో ఏవో పార్టీలు!

"మనిషికి తగినంత పనివుండాలి. కాదు వూపిరి తిరగని పనివుండాలి. అప్పుడే ఆరోగ్యం! మనసు కోతిలాంటిది. ఖాళీ మీద అనేక చెడ్డలకి దారితీస్తుంది!" అనుకునేవాడు!

వుద్యోగంమారితే బాగుండును. పెద్ద వుద్యోగాలు అంత త్వరగా దొరుకుతాయా? చిన్న వుద్యోగంకేసి అతడు పోతానన్నా యింట్లోవారు, బయటవారు పోనీయరు. "నీకేమైనాపిచ్చా?"అంటారు.

. ఆ రోజు రాత్రి భోజనంచేసి మంచం ఎక్కాడు. కల్పన కొద్దిగా మూలుగుతోంది.

"ఏం కల్పా?"

"కాళ్లనొప్పి!"

వేణు లేచి కూర్చుని భార్య కాళ్లు నొక్క సాగేడు. కల్పన భారతీయ స్త్రీ. సీతా, సావిత్రుల వారసురాలు.

"ఛ....ఛ... అదేంపని-లేవండి" విదిలించుకుంది.

"నొక్కితే తగ్గిపోతుంది కల్పా" అతడికి తృప్తిగావుంది.

కల్పన ఒప్పుకోలేదు. లేచి మంచం పట్టిమీద కూర్చుంది. "నేను పని చెయ్యలేక ఏడుస్తుంటే, ' లేదని మీగోల. త్వరలో మీ కోరిక తీరుతుందిలెండి!"

"ఎలా?"

"మనం ముగ్గరం అవుతున్నాం."

"ముగ్గరవడం ఏమిటి? లెక్కల మాస్టారిలా మాట్లాడక!"

కల్పన కిసుక్కున నవ్వింది. "ఉత్త ట్యూబ్‌లైట్--మీరు తండ్రి కాబోతున్నారు. ఇంకా అర్థంకాదేమో - అబ్బాయిగారికి యువరాజో, యువరాణియో వస్తారు."

వేణుకి సంతోషం-కాని సందేహం. "వాళ్లు వస్తే నాకెలా పని తగులుతుంది?"


జయ కృష్ణ సమర్పించు
తప్పక చూడండి!
సంచలన చిత్రం!
LAKSHMI PUBS.
ముద్దు క్రిష్ణా మూవీస్ వారి
సావిత్రి
దర్శకత్వం: భరతన్ నిర్మాత: మాచన వెంకట్రామ చౌదరి
లక్ష్మీ ఫిలింస్

"ఎత్తుకుని తిప్పుదురుగాని."

"మా అమ్మ వాళ్ళని వదులుతుందా?"

"అయితే మీరు కొన్నాళ్లు ఓర్పు వహించక తప్పదు."

"ఎన్నాళ్ళు?" వేణు నీరసంగా ప్రక్క మీదకి చేరపడుకున్నాడు.

కాలం దొర్లుకుంటూ పోతోంది. వేణు ఆశ తీరే రోజు యింకా తెరచాటునే వుంది. అశాంతిగా బ్రతికేస్తున్నాడు. తృప్తినివ్వని జీవితంలో ఎన్ని వున్నా ఒకటే!

తృప్తి ఉప్పులాంటిది.

రుచిని యిస్తుంది. వేణు అతడి దృష్టిలో "ఉప్పులేని కూరే!" ఎవరికైనా బాధ చెప్పుకోడానికి లేదు. నవ్వేస్తారు.

తీయటి బాధలుంటాయని తెలియదు తనకి తానే సానుభూతి చూపించుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు.

రోజులు - వారాలు - సంవత్సరాలు..

అలా....అలా ముందుకు పోతున్నాడు. కోరిక తీరడంలేదు, అక్కడే వుంది. అశాంతిగానే వుంది.

o o o

## వేడిజీ

కథనం అయిపోయింది. అర్థమైన వాళ్ళుయిది చదవనవసరం లేదు. ఇది కొనమరుపు కాదు. కొసరు మాత్రమే, నారికేళ పాకాలు రుచించవు కాబట్టి, అరటి పండు ఒలిచి యిచ్చేయడం, అందుకే అపబంధంగా గైడ్!

సోమరి కల్పనకి విరుగు లేని పని,

కష్టపడే వేణుకి సోమరి తనం!

వారు కోరుకోని విధంగా జీవితాలు మలుపు తిరిగాయి. అనుకున్నది ఒకటి. అశాంతి పొడిగింప బడుతోంది. అంతా ఒకవైపు దారి. ఇష్టమున్నా లేకున్నా అందులోనుంచే పోవాలి.

అంటే జీవితం ఒక లాటరీ!

ఏ ప్రయిజు వస్తుందో, రాదో తెలియదు.

టిక్కెట్టు కొనుక్కొని ప్రారంభిస్తాం. లాటరీలో ప్రయిజు వచ్చిన వాడు సంతోషంగా మరోసారి టిక్కెట్టు కొంటుంటాడు.

రాని వాడు ఆశావహంగా బహుమతి రావాలని కొంటుంటాడు!

ఇద్దరు ప్రోత్సహిస్తున్నారు.

జీవితంలో నలిగి పోతున్నవారూ, లాభాలు పిండు కుంటున్న వారూ కాలం వెంబడి పయనిస్తూనే వున్నారు.

కాలం వారిని ముందుకు నెట్టుతోంది. ఇక్కడ ఆశమాత్రమే టిక్కెట్టు. కోరుకున్న జీవనం బహుమతి కావాలని.

జీవితం నిండా చిన్న చిన్న లాటరీలు ఉద్యోగం, ఉత్సాహం, నిరంతర నిట్టూర్పులు.

ఈ రకం ఉత్కంఠతతో ఈ స్రవంతి సాగిపోతుంటుంది. ఈ తపన బ్రతుకు యొక్క పునాది. కాక కనిపించ పునాదే పురోగమనానికి కారణ

అంచేత జీవితం ఒక జూదం ఏ క్షణం టోయీ వని చేయిస్తుందో ఏ క్షణం వల్లకి ఎక్కిస్తుందో తెలవదు.

అంతా బహుమతిలో వుంది.

సాధించాలని అందరికీ ఆశ, ఆశంస. అభిలాష.

"కర్మణ్యేవా........" అంటోంది భగవత్ గీత. ప్రయత్నమే నాది ఫలితం ఎలా వున్నా సరే!

ఆ సంస్కృతికి మనం వారసులం! ❀

# అమ్మో! నాన్న...!!?

## చింతపల్లి వెంకటరావు

"పాలు కుర్చీలో చేరబడి పేపరు చదువుతున్న గుర్నాథం నెత్తిమీద పిడుగు పడ్డట్టు ఉలిక్కి పడ్డాడు. పెరట్లోనుంచి కేకలు వినిపడేసరికి.

ఒకటే కక్కుకోవడం నిర్విరామంగా కక్కుకుంటున్న భార్యవద్దకు పోబుద్ధికాక కదలక మెదలక అలా కుర్చీకే అంటుకు పోయాడు.

అసలు గుర్నాథానికి వాంతులంటే మహాభయం

మొదట్లో...కాపురానికి వచ్చిన కొద్ది నెలలకే రోజూ మాదిరిగా భళ్లున తెల్లారిన ఓ శుభదినాన భళ్లున కక్కుకుంటున్న శ్రీమతిని చూసి తెల్లబోయాడు. కొంత సేపు తెప్పరిల్లాక భార్య చెవిలో ఏదో ఊదితే, తండ్రి కాబోతున్నందుకు ఎగిరి చంకలు గుద్దాడు. ఆ కక్కుకున్న శుభ సందర్భంలో వేవిళ్ళంటూ పిండివంటలు, పళ్ళూ ఫలహారాలపు అభీష్టాన్ని తెలిపి నానాగడ్డి తిని. తిని తినీ మొగుడనే వాడిని కూడా తినేసే భార్య మంగమ్మ ధోరణికి భయభ్రాంతుడయ్యేడు సదరు మొగుడు గుర్నాథం.

మరో ఏడాదిన్నర పోయాక మంగమ్మ మళ్ళీ వాంతులేసుకుంది ఈసారి తెల్లబోలేదు మరో పాపకో, బాబుకో మళ్ళీ తను బాబు కాబోతున్నాడని గ్రహించి చంకలు గుద్దాడు. అంతే గాని మొదట్లో ఎగిరినట్టు చంకలు గుద్ది సంబరపడ్డ గుర్నాథం రాన్రాను వయసు తరిగి, సత్తువ కరిగి, ఆరుగురి పిల్లలతో, పెళ్ళీడుకెదిగిన ఆడపిల్లతో, పది వేల రూపాయల అప్పు (అక్షరాల పదివేల రూపాయలు మాత్రమే) తో మిగిలిపోయాడు

-మళ్ళీ ఇప్పుడు ఈ వయసులో...

భార్యపై మండి పడ్డాడు.

పళ్ళు పటపట కొరికాడు....ఉరిమాడు..

పెరట్లోకి ఉరికాడు.

నోటనిండా నీరు పోసుకుని పుక్కిలిస్తున్న కూతుర్ని పట్టుకు నిలబడ్డ మంగమ్మ పెరట్లోకి వస్తున్న భర్తవంక చూసి "ఏవండీ! అమ్మాయికి...."

ఇందాక నెత్తిమీద పిడుగు పడ్డట్టయితే, ఇప్పుడు ఒకటి .. రెండు... మూడు వందల్లో .. వేలల్లో పిడుగులు కురిసి, గుభేలుమన్న గుండె సమ్మె చేసి నట్టయి బొమ్మలా నిలబడి పోయాడు- పాపం గుర్నాథం.

"ఏవండీ!" అని దగ్గర కొచ్చిన మంగమ్మ భుజం పట్టుకు కుదిపితే ముసలి పులిలా గర్జించాడు. దాంతో ఏదో సన్ని

వేశం చూస్తున్న ప్రేక్షకుల్లా నిలబడి పోయారు.

"నా కొంప ముంచిందే. పరువు గంగలో కలిపిందే" అంటూ అరుస్తున్నట్టుగా చిందులు తొక్కుతున్నాడు. తండ్రి చిందు లెందుకో? ఏమిటో అర్థంకాక, అయోమయంగా ఎనిమిదేళ్ళ చిట్టిగాడు తన చిట్టి చిట్టి కళ్ళల్లో పెద్ద, పెద్ద క్వశ్చెన్ మార్కుల గుర్తు తీసుకొని మరీ చూస్తున్నాడు.

ఒక్కుదుటలో పోయి భార్య అడ్డు పడుతున్నా కూతురి చెంపలు కంది పోయేలా వాయించేశాడు.

"పాపిష్టిదానా! ఎంతకు బరితెగించావే! రేపు నలుగురిలో నేనెలా తలెత్తుకు తిరిగేది....పెళ్ళి కాకుండానే తల్లిపికాబోతున్నావంటే విన్న వాళ్ళు నవ్విపోతారు, మన మొహాల మీద ఉమ్మి ఉమ్మేస్తారే .. ఉమ్మేస్తారు" అంటూ నాలుగు దులిపేసి, "నిన్ను....నిన్ను నిన్నిలా కాదే!" రెచ్చిపోతూ ఇంట్లోకి దారి తీసే సరికి కుటుంబం యావత్తుకు తుఫాను వస్తున్న సూచనలు కనబడ్డాయి

గదంతా వెతికేస్తున్నాడు కూతుర్ని హతమార్చే ఆయుధం కోసం. "వెధవది గన్నయిన లేదు కాల్చేద్దామంటే" అనుకున్నాడు. టేబిల్ పైనున్న పళ్ళు కోసుకునే చాకుపై దృష్టిపడి, కూతుర్ని చంపేయాలన్న గర్రుతో గర్భాధం సర్రున చాకు చేతిలోకి తీసుకొనే సరికి సర్రున వేలుతెగి బొట బొట నెత్తురు బొట్లు కారే సరికి "అమ్మో" అంటూ గట్టిగా అరచి వేలుని నోట్లో పెట్టుకొని చప్పరించ సాగాడు బాధగా.

భర్త ఏదో ఇబ్బందిలో పడ్డాడని, కుటుంబ సిబ్బందిని వెంట బెట్టుకొని లోపలికొచ్చిన మంగమ్మ ఆత్రుతగా "ఏం వయ్యిందండీ! ఏంవయ్యింది" అనే సరికి వేలును నోట్లోంచి తీసేసి ఆ చెయ్యిని వెనక్కి దాచేసుకుంటూ "నాకేం కాలేదుగాని. " అంటూ గంభీరంగా పలికి మళ్ళీ వెతకసాగాడు. కూతుర్ని హతమార్చే ఆయుధం కోసం గదంతా కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. ఓవరకు సరాసరి వంటగదిలోనికి పోయాడు.

వంట గదిలోనుండి చేతిలో కత్తి పీటతో దర్శనమిచ్చి, ఒకొక్క అడుగు వేస్తూ కూతురివైపు పోతున్నాడు.

తన వైపే వస్తున్న తండ్రిని చూసి భయంతో నిలువెల్లా వణికి పోయింది తాయారు. దగ్గర కొచ్చేస్తున్నాడు .. కానిప్పుడు తల్లి ముఖకవళికల్లో మార్పు లేక పోయేసరికి ఆందోళన పడుతూ ఏడుపు అందుకుంది. చిట్టిగాడు మినహాయించి పిల్లలందరూ ఏడుస్తూ, ఉమ్మడిగా ఒకేసారి తండ్రి కాళ్ళపైపడి, కాళ్లకు సంకెళ్లలా చేతులు పోనిచ్చి కదలకుండా గట్టిగా పట్టుకున్నారు.

"వదలండి!. దాన్నిరోజు చంపేసి నాకు పుట్టలేదనుకుంటాను ఆ పాపిష్టి దాన్ని. " అంటూ పెనుగులాడుతుంటే "వదలండర్రా! ఏంచేస్తారో? ఎలా చంపే

# హాస్యకథల పోటీలో



## ఎన్నికైన కథ

సారో... చూద్దాం. వంకాయ కూడా తెగని ఆ కత్తిపీటతో దాని మెడకాయ ఎలా కోస్తారో చూద్దాం" అనేసరికి పిల్లలందరూ తండ్రి కాళ్ళను వదిలేశారు.

భార్యవంక రుసరుస చూస్తూ; కత్తి పీట వంక ఓసారి చూసి కత్తి పీట పదున్ను వేలితో పరీక్షించసాగాడు.

"ఇంతకీ ఏంవయ్యిందనీ అలా ఎగిరి పోతున్నారు?"

"నీకు ఏంవీకానట్టే ఉందే! రేపది బిడ్డను కంటే లోకం దుమ్మెత్తి పోస్తుంది! ఇంత జరిగినా ఏం కానట్టు ఎలా ఉన్నావే? నా కొంప ముంచిందే.... పరువు గంగలో కలిపిందే" అన్న రక్షరాన్ని సాగదీస్తూ శోకాలు పెట్టసాగాడు.

"ఇంతకీ చెప్పింది వినండి! అదేదో పాడు పన్చేసి, కడుపొచ్చి కక్కుకుంటుందను కుంటున్నారా? రాత్రి తిన్నద రక్క అది కక్కుకు చస్తుంటే.... మధ్యలో చంపేస్తా....చంపేస్తా అంటూ మీ అరుపులు, మీరునూ! మీ కంగారు ముండా!"

"అయితే ఇంతకీ చెప్పి చావ్వేమే!"

"నన్ను చెప్పనిస్తున్నారటండీ! కంగారుతో చంపేస్తుంటే ఇంకేంవి చెప్పేది"- ఆ మాటతో మళ్ళీ మనిషైన గుర్నాధం ముఖం చిన్నది చేసుకొని కూతురి వద్ద కొచ్చి "ఇది నా కూతురే?! .. అలాంటి పాడు పన్చెయ్యదే!" భార్యతో గర్వంగా అన్నాడు.

అప్పటికి తుఫాను వెలిసింది. . గుర్నాధం మనసు శాంతపడి, ఇంట్లో ప్రశాంతత ఏర్పడింది.

గుర్నాధం మహా కంగారు మనిషి, తాడును చూసి పామనుకొని భయపడే గుర్నాధంలో ఆ కంగారన్నది చిన్ననాడే మొలకెత్తి, వృక్షమై నేడు నరనరాల్లో వేళ్ళతో పాతుకుపోయింది. ఆ కంగారు వల్లనే తరచు ఆఫీసరుచే దీవనలు పొందుతుంటాడు. ఆఫీసులో ఆయన నామధేయం కె. జి. నాదం (కంగారు గురునాధం). చూడ్డానికి పొట్టిగా, లావుగా, పొడుచ్చు కొచ్చిన పొట్టతో టిప్ టాప్‌గా నిత్యం ఓకవ్‌లో ఉంటూ, వయసు మీద పడినా వయసుతో ఉన్నట్టుండేందుకు కొన్ని జాగ్రత్తలు తీసుకుంటుంటాడు, చాలా జాగ్రత్తయిన మనిషి కూడా. పిల్లలను ఒకకంట కనిపెడుతూ మరీ జాగ్రత్త వహిస్తుంటాడు. అలా ఓకంట కని పెడ్తున్న ఓరోజున ఎదురింటి అబ్బాయి డాబాపైనుంచొని, కనుసైగలు చేయటం, ఇట్నుంచి అమ్మాయి మునిముని నవ్వులు విసరడం కంటపడింది. కాని అడిగేందుకు అవకాశం చిక్కక ఊరుకున్నాడు.

ం ం ం

"ఏంవండీ! అమ్మాయి మనకిక లేదండీ! చూడండీ!..ఎంత అఘాయిత్యం చేసిందో?" బొబ్బలు పెడూ వర్షిస్తున్న కళ్ళతో అందించింది చేతిలో కాగితాన్ని.

వణుకుతున్న చేతుల్తో అందుకొని గుర్నాధం ఆందోళనతో విప్పి చదవసాగాడు.

"నాన్నా!"

అమ్మ నా మీద ప్రేమ కొద్ది విషయాన్ని మరుగుపరచి తిన్నది అరక్క కక్కుకున్నానని చెప్పింది నీకు భయపడి. కాని అసలు విషయం—మన ఎదురింటి మోహన్ తో తొందరపడి

కథ
దాసరి నారాయణరావు






# నాయుడుగారబ్బాయి

నిర్మాతలు
ఎస్. రామలింగేశ్వరరావు
బి.వి.పి.ఎస్. గోపీనాథ్
శ్రీ లక్ష్మి పిక్చర్స్ • సువర్ణయుగ మూవీస్



మీ ర న్న ట్టు గా మీ కొంప ముంచి పరువు గంగలో కలిపాను. అందుకే నేనే ఏదైనా గంగలో పడి ఆత్మహత్య చేసుకుందామనే మన బావిలో దు కి మీకు దూర మవుతున్నా! మన బావిలో దూకి బావినీళ్ళను కూడ అపవిత్రం చేసినందుకు నన్ను క్షమించండి. పైవాళ్ళ బావిలో పడి పోదామంటే ఈ విషయం బయటకి పొక్కి పోతుందని భయపడి మన బావిలోకే దూకేశాను మీకు పోతూ పోతూ నీళ్ళకు కూడా ఇబ్బంది కలిగించా! మరేమీ అనుకోకుండా మన పక్కింటి కామాక్షమ్మ గారింటికి పోయి బావి నీళ్ళు తెచ్చుకోమని అమ్మకు మ రీ మ రి చెప్పండి.

మీకు ఈత వచ్చునో, రాదో నాకు తెలియదు. మీరే ఏదో ప్రయాసపడి నా శవాన్ని వెలికి తీసి గట్టు చప్పుడు కాకుండా ఎక్కడో పాతెయ్యడమో, పారేయడమో చేయండి. నన్ను క్షమించి మన్నించండి.

మీ జ్యేష్ఠ పుత్రిక,
-తాయారు.

"అమ్మా! తాయారూ!" అంటూ గట్టిగా ఇంటి పెంకులు ఎగిరిపోయేలా ఒకే ఒక్క కేక పెట్టాడు. ఆ కేకకు నిద్ర పోతున్న మంగమ్మ అదిరిపడి, మేల్కొని, "అమ్మా! తాయారూ . తాయా రెంత పన్చేశావమ్మా తాయారూ ....తాయారెంత పన్చేశావమ్మా" మంచంపై విలపిస్తున్న భర్తను చూసి, కుదిపి మరీ అడిగింది. "ఏంవిటండీ! మీ కలవరింతలు మీరూనూ! ఏదైనా పాడు కలొచ్చిందా"

కొంత సేపటికి తేరుకొని, క్షణం సేపు గదంతా పరికించగా ఆ మూలకు మంచంపై హాయిగా నిద్ర పోతున్న కూతురు తాయారు వంక చూసి గుండె నిబ్బరం చేసుకొని "అబ్బె! ఏం లేదు.. వెళ్ళి నిద్రపో" భార్యను గద్దించాడు గద్దించాడు.

ఏ ఒక్క విషయాన్నయినా దృష్టిలో పెట్టుకున్నా, దృష్టి పడ్డా కలల రూపంలో వచ్చి దాని ప్రభావం మనిషి పై బాగా దెబ్బ తీస్తుంది. ఆ మాదిరిగానే దెబ్బ తిన్న గుర్నాధం మళ్ళీ నిదుర పోయేందుకు కళ్ళు మూసు కుంటున్నాడు విశ్వ ప్రయత్నం చేస్తూ.

అర్థరాత్రి .. కీచుమంటూ శబ్దం.

అడుగుల చప్పుడు .. రాలిన ఎండుటాకులపై అడుగులు పడి ఫెళ ఫెళ మని విరుగుతున్న చప్పుడు.

ఇప్పుడా చ ప్పు డు గుర్నాధం స్పష్టంగా వింటున్నాడు.

భయంతో లేచాడు.

క్షణంక్రితం మంచంపై నిద్రపోతున్న కూతురు మంచంపై లేక, ఖాళీగావున్న మంచంకేసి చూసి మరింత ఆందోళన పడి. తడ బడుతూ, అడుగు లేద్దామన్నా అడుగు పడనట్టు వణుకుతున్న కాళ్ళతో తలుపు తెరచుకొని పెరట్లోకి వెళ్ళేసరికి తాయారు నెమ్మదిగా, చప్పుడు కాకుండా బావివైపు వెళ్ళడం గుర్నాధం కంట పడింది.

గుర్నాధం బెంబేలెత్తి పోయాడు.

క్షణం క్రితం వచ్చిన కల నిజం కాబోతుంది. ఇక ఆగితే లాభంలేదు.... బావిలో దూకేస్తుంది.....దూకేస్తుంది- →




# కోల్గేట్ టూత్ పౌడర్‌తో మీ చిగుళ్ళను, చెడుశ్వాసను కూడా అరికట్టండి పళ్ళను కాపాడుకోండి.







కోల్గేట్ టూత్ పౌడర్ ఎంతో మెత్తగా ఉండే తెల్లని పౌడర్. అది అతి మృదువుగా మీ చిగుళ్ళను తోముతుంది. అంతేగాకుండా దానిలో ఉండే సున్నితమైన మెరుగునిచ్చే పదార్థం మీ పళ్ళ మీది పాచిపొరలను తొలగిస్తుంది. మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా చేస్తుంది కోల్గేట్‌లోని పుష్కలమైన నురుగునిచ్చే చర్య పళ్ళ సందులలోనికి చొచ్చుకుపోయి చెడు వాసనను దంతక్షయకారకములైన సూక్ష్మ క్రిములను తొలగిస్తుంది.

**మీ కుటుంబానికి కోల్గేట్ టూత్ పౌడర్‌తో అధునాతనమైన తీరులో దంతరక్షణ సమకూర్చండి. దానియొక్క చల్లని, పిప్పర్‌మెంట్ రుచిని వారంతా మెచ్చుకుంటారు.**

ఆP.G. 30 గ్ర

నిర్ధారించుకున్నాడు. ఒక్కుదుటలో పోయి కూతురు భుజం పట్టుకుని వెనక్కి లాగ "ఒసే! మంగమ్మా" గట్టిగా అరిచాడు. ఆ అరుపుకి తుళ్ళిపడి నిద్ర కళ్ళతో "ఏవయిందండీ!" బావిలోకి అంది.

"చూడే! చంపేస్తానని బెదిరించినందుకు అది చావాలనుకుని బావిలోకి దూకబోతుందే!"

తండ్రి మాటలకు కలవరపడిన తాయారు తల్లి చెవిలో గుసగుసలాడింది.

ఒక్క పెట్టున పెద్దగా నవ్వుతూ "మీరు మరీనండీ... బావిలో ఎందుకు దూకుతుంది .. అదేవి చేసిందని. మీ కంగారుగాని. బావిలోకి దూకాలని కాదండీ బాత్‌రూముకి పోవాలనది పోతుంటే, ఏవిటండీ! ఇదంతా?" చివరకు మొగుడిపై మండిపడి కూతుర్ని లోనికు తీసుకుపోయింది.

ఖంగు తిన్నట్టు గుర్నాధం అక్కడే నిలబడి పోయాడు.

ం ం ం

"నాన్నా! నేను బేట్ కొనుక్కోవాలని చెప్పి వారమయ్యింది. ఐవాంట్ మనీ!"—ఇది టెన్త్ చదువుతున్న పెద్ద కొడుకు కమాండ్ బజారుకు చేతసంచి పట్టుకుని వెళ్తున్న గుర్నాధం కొడుకు డబ్బు అడుగుతున్న తీరుకు ముఖం చిట్లించాడు.

"నాన్నగారూ! వచ్చేటప్పుడు ఎక్సరసైజు నోట్‌బుక్ తీసుకురండి"—ఇది మూడవ సంతానం అభ్యర్థన.

"నాన్నా! నాకు ఎర్రరిబ్బన్లు.. ." పదేళ్ళ అమ్మాయి కోరిక.

మరో క్షణం నిలబడుంటే మిగిలినవాళ్ళు కూడ వాంటింగ్‌లతో చంపేస్తారని తనను కాదన్నట్టుగా పోతున్న గుర్నాధం చెవిలో "నాన్నా! వచ్చేటప్పుడు చింతకాయలు కొనుక్కురండి....నాకు తినాలనుంది"

"ఆఁ! ఏఁవిటి చింతకాయలాఁ?" గతుక్కు మన్నాడు.

"ఏఁ వన్నావే?. ఏం కావాలే?" అంటూ కూతురు దగ్గఁరకెళ్ళి "ఇప్పుడు చెప్పే! ఏఁవన్నావ్?" గట్టిగా అరిచాడు.

ఇదంతా కూర లు తరుగుతున్న మంగమ్మ చూసి "ఇప్పుడదేవన్నదండీ! అసలది నోరేనా కదిపిందా? బాసిమట్టు కూర్చున్నేదో కథల పుస్తకం చదువుకుంటుంటే...."ఏవన్నావ్? ఏవన్నావ్" అంటూ దానిమీద కెళ్ళారేం. మీకేమయినా మతిపోయిందా?"

"అదేఁవీ అనలేదా?"

"ఏఁవీ అనలేదు" ఖచ్చితంగా అంది.

"ఆఁ ఏఁవీ అనలేదా?" రెట్టిస్తూ అడిగాడు.

"ఏఁవనలేదంటున్నాగా... పోనీ.. అదేమందో చెప్పండి!"

"ఏవందా? బజారు నుండి వచ్చేటప్పుడు చింతకాయలు 'తీసుకురమ్మంది తినాలనుందట!" చెప్పబోయాడు, చెబితే మీరు .. మీకంగారంటూ ఫక్కున నవ్వుతుందని చెప్పలేక చల్లగా జారుకున్నాడు.

బజారు నుండి తిరిగి వస్తూ ఇంట్లో కడుగుపెట్టిన గుర్నాధందృష్టి తాయారు పై బడింది. విసురుగాపోయి కూతురి పై చేయి చేసుకున్నాడు—అంతే! తాయారు చెంపలు కందిపోయాయి. దాంతో




"అమ్మో! నాన్న చంపేస్తున్నాడు" అంటూ శృతిచేసుకుని గొంతువిప్పి ఏడ్వ సాగింది. అదివిన్న మంగమ్మ వంటగది లోనుండి వస్తూ పరిస్థితిని గమనించి "ఏమిటండీ?" భర్తపై రెచ్చిపోయింది.

"చాలా బాగుందే! అసలు నువ్వేమైనా పట్టించుకుంటేగా! అదేవి తింటుందో చూడే... చూడు! మామిడికాయలు తింటుంది....నాకేదో అనుమానంగానే ఉందే .. నువ్వుకూడా ఇందులో ఏదో దాస్తున్నావే"

"ఆపండీ! మీమాటలు.. ." అంటూ కూతురి చేతిలో నుండి సగం తినగా మిగిలినది తీసుకుని భర్త కళ్లముందరగా పెట్టి "చూడండీ! ఇదేమిటో... సరిగ్గా చూసి చెప్పండి! మామిడికాయో?... జాంకాయో?....చెప్పండీ!"

"ఆఁ జాంకాయా?!"

ం ం ం

గుర్నాధానికి స్వతహాగా కంగారుంటే ఉండొచ్చుగానీ మరీ అంత మతి చెడిన మనిషి కాదు. అందుకే బాగా తల కొట్టుకొని మరీ ఆలోచిస్తున్నాడు.

తనలో కంగారు పెరిగినట్టే, ధ్యానాను అమ్మాయి కడుపుకూడ గాలి కొడ్తున్న బెలూన్‌లా పెరిగిపెరిగి ముందుకు వస్తూంది. ఇందులో సందేహం లేదు. భార్యను నెమ్మదిగా ఆరా తీయాలని వంటగదిలోకి అడుగు పెడుతుండగా లోనుంచి మాటలు స్పష్టంగా చెవిని పడుతున్నాయి.

"అమ్మా! మరి దాచి లాభంలేదే! ఈ విషయం నాన్నకి చెప్పేస్తానమ్మా.. చంపేస్తే చంపనీ. ఈ నిజాన్ని దాచడానికి మనమిద్దరము ఇంకా ఈ నాటకం ఆడలేవమ్మా!"

"ఓ రెండురోజులు ఓపికపట్టవే! ఆ మోహన్‌తో అన్ని విషయాలు మాట్లాడాను. త్వరలో మీ నాన్నతో పెళ్ళి గురించి మాటాడతానని మాటిచ్చాడే!" అనునయిస్తూ అంది.

కూతుర్ని వెనకేసుకొనివచ్చి, ఇంత నాటకమాడుతూ కూతుర్ని సమర్థిస్తున్న భార్యపై మండిపడి, ప్రళయకాల రుద్రునిలా లోనికి జొరబడేసరికి "ఏమండీ! గుర్నాధంగారున్నారా ?"

బయటనుండి పిలుపు. వెళ్ళిచూస్తే ఎదురుగా... ఎదురింటి మోహన్. 'వెధవ . . ఎదురింటి వెధవ....ఎంత పన్చేశావురా' లోలోన తిట్టుకుంటున్నాడేగాని లోనికి రమ్మనమనలేదు.

మోహన్ పిలుపుకి తల్లీకూతుళ్లు గదిలోకి వచ్చి చూస్తున్నారేగాని లోనికి రమ్మనమనలే దెవ్వరూ.

తన్నెవరూ ఆహ్వానించకపోయినా పెదవులపై చిరునవ్వుతో లోనికివస్తూ "ఏదో జరిగిందేదో జరిగిపోయింది. మా తొందరపాటుకు క్షమించావంటే మీ అమ్మాయిని పెళ్ళి చేసుకునేందుకు సిద్ధంగా ఉన్నాను" సవినయంగా అన్నాడు.

"నో! నీ కులమేవిటో... నువ్వేంటో మంచిచెడ్డలు తెలియకుండా....తగుదునంటూ పెళ్ళి చేసుకొనేందుకు పిల్ల నడగడానికొచ్చావా? సిగ్గులేదూ!" నీదరించుకున్నాడు.

మధ్యలో మంగమ్మ కలుగజేసుకొని భర్త చెవిలో నెమ్మదిగా "మీ తెలివితేటలు....మీరూ....చాల బాగున్నాయి.... మీవద్ద ఈ విషయం దాచినందుకు క్షమించండి. అమ్మాయి గర్భవతి.... ఇప్పుడు క్షమించమని కోరి చేసుకుంటుంటే కాదంటారేవిటి? కులము... మంచిచెడ్డలంటూ వాదన కట్టిపెట్టండి. అబ్బాయి కెవరూ లేరు. ఏదో గవర్నమెంటు ఉద్యోగం చేసుకుంటున్నాడాయె! ఇంతకన్నా మనకేం కావాలి. పరిస్థితి చేయిదాటిపోయా కింకా చూస్తారేవిటండీ! ముందు మాటివ్వండీ సంతోషంగా" అంది.

కొంచెం దీర్ఘంగా ఆలోచించి, వెనుకాడితే ప్రమాదముందని చివరకు చేసేది లేక గంగిరెద్దులా తలూపి పెళ్ళికి అంగీకరించాడు.

o o o

నెలరోజుల్లో అమ్మాయిని ఓ ఇంటిదాన్ని చేసి, అల్లుడితో అమ్మాయి తన ఇంటి కొచ్చేనరికి అన్ని ఏర్పాట్లు చేసాడు... ఊపిరి తీసుకున్నాడు నిశ్చింతగా.

ఆరోజు మంచి విందివంటలతో చక్కని విందిచ్చాడు అల్లుడికి.

విందారగించాక పెరట్లో ఆరుబయట వెన్నెల్లో మంచాలు వేసుకొని పిల్లాజెల్లతో, పెళ్లాంతో ఆ ముచ్చట ఈ ముచ్చట మాటాడ్తుండగా-ఒక్కసారి ఉధృతంగా ఉప్పెనొచ్చినట్లు-వాంతులు.. ఒకటే కక్కుకోవడం.

ఈసారి గుర్నాధం చిందులు తొక్కలేదు. ఎందుకంటే ఆ కక్కుకుంటున్నది అమ్మాయి కాదు... భాగ్య... ఊహు! భార్య అంతకన్నా కాదు. సాక్షాత్తు గుర్నాధమే కక్కుకుంటున్నాడు. పీకలమొయ్యా తిన్నదరక్క నీళ్లుబికిన కళ్ళతో అదేపనిగా కక్కుకుంటున్నాడు.

మునుపు అక్కయ్య కక్కుకోవడం ....అప్పుడు తండ్రన్నమాటలు మెదడులో రికార్డయిపోయిన చిట్టిగాడు ఇప్పుడు తండ్రి పరిస్థితిచూసి "అమ్మా! నాన్న మన కొంప ముంచాడే! పరువు గంగలో కలిపాడే!" అంటూ తండ్రి ధోరణిలో శోకాలు పెట్టేసరికి లోని గదిలో ఉక్కిరిబిక్కిరి అవుతున్న తాయారూ, తాయారు మొగుడు ఇక ఒకటే నవ్వు.

తన్ను నవ్వుల పాల్జేసేందుకు భరించలేక టక్కున చిట్టిగాడి నోరు మూసేశాడు గుర్నాధం

సీరియల్

# సౌభాగ్యలత

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి రామశాస్త్రి

(జరిగిన కథ)

(నరదా షికారులో, పార్టీలో శ్రీమంత్, వకుళకు దర్శనం ఇచ్చాడు మహేష్. ఆఫీసర్ సమక్షంలో శ్రీమంత్‌ని విమర్శించి కించపరచటానికి ప్రయత్నించాడు మహేష్-శ్రీమంత్ చురుకుగా సమాధానం చెప్పాడు. బెదిరింపుగా మాట విరిచాడు చాటుగా మహేష్. తరువాత శశిరేఖ మహేష్‌ని మరింత కవ్వించింది ఈ విషయంలో విశ్వేశ్వరి, శశిరేఖ, వకుళని, శ్రీమంత్‌నీ అవమానిస్తూ ప్రచ్ఛన్న యుద్ధం చేశారు.)

—ఇక చదవండి—

## 30

శారద నుండి వచ్చిన ఉత్తరం పదే పదే చదువుకోసాగింది వకుళ.

"వదినా,

క్షేమం. నీవూ అన్నయ్యా కులాసాగా వున్నట్లు వ్రాయి. ఏమైనా విశేషాలు వ్రాస్తావేమో ననుకుంటాను కాని, ముక్తసరిగా వ్రాస్తావు. అందుకే నాన్న గార్ని మరికొన్ని రోజులు నాదగ్గరనే అట్టేపెట్టుకో దలచుకున్నాను. కోప్పడవుగా? ఎందుకంటే నీకూ అన్నయ్యకూ నడుమ మాట్లాడేవాళ్ళు రాయబారాలు జరిపేవాళ్ళు వుండకూడదు, అందుకు. అప్పుడే మీ పెంకెతనాలు కట్టి, ఇద్దరూ ఒకటౌతారు. ఔనా?

వకుళా! అన్నయ్యది చాలా మృదువైన మనసు, సుకుమారమైన స్వభావం, నువ్వే కొంత చొరవ తీసుకొని అతడిని నీవాడిగా చేసుకో. అంతవరకూ, మీమధ్య మూడవ మనిషి వుండరాదు. అందుకే పండుగకు నేను రాలేదనిగానీ, నాన్నగార్ని నేను స్వంతం చేసుకున్నానని గానీ ఊహోహలు పెట్టుకోకు. నువ్వూ అన్నయ్యాకలసి కొంచం ఏటైనాకువెళ్తున్నారా? ఎవరైనా విందులకూ వినోదాలకూ పిలుస్తుంటారు, తప్పకుండా వెళ్ళు అన్నయ్యతో కలసి. అలా కలసి తిరగడంలో కూడా మీరు సన్నిహితులవకేంల సందర్భాలు ఏర్పడతాయి.

"ఇంకేం వ్రాయను? మీ అన్నగారు కులాసా. అన్నట్టు, అత్తయ్యా, శశీ, మామయ్యల గురించి నీవేమీ వ్రాయడం లేదెందుకని? మనస్పర్థలింకా అలాగే వున్నాయా? ఏమైనా మార్పు వచ్చిందా? మామయ్యను చూడక, ఆయనతో చదరంగం ఆడక నాన్నగారికేమీ తోచడంలేదు. వుంటాను మరి. నా హెచ్చరికను కాస్త దృష్టిలో వుట్టుకో. అన్నయ్యను అడిగానని చెప్పు.

—శారద"

'హుఁ!' వకుళ హృదయం తెలియని భావంతో నిశ్వసించింది. "శారద తోబుట్టువు కాదు; అయినా తోబుట్టువువలె తన సుఖాన్ని కాంక్షించుతోంది.

కన్నతల్లికాదు—అయినా అనుంగుబిడ్డ విషయంలో అమ్మ ఆరాటం జెంది నట్టే ఆరాట పడుతోంది.

'అబ్బ, మామయ్యకు కూడ తమ విషయం తెలిసి పోయిందా? ఎంత సిగ్గు!!

ఉత్తరం మరల చదివింది,

'అలా కలసి తిరగడంలో కూడ మీరు సన్నిహితులవ్వగల సందర్భాలు ఏర్పడతాయి.'

'నిజమే! ఆ ఆశతోనే తానూ వున్నది. కానీ ఎక్కడికక్కడే ఎవరో ఒకళ్లు రాహు కేతువుల వలె అడ్డుపడుతున్నారు. ఆఖరుకు జన్మనిచ్చిన తల్లీ, రక్తం వంచుకు పుట్టిన అక్కాకూడ తమ యిరువురి నడుమా అగాధాలు మరిన్ని ఏర్పడ గల సందర్భాలనే సృష్టించుతున్నారు కానీ ఒకళ్ళూ తమను ఆప్యాయంగా ఆహ్వా నించడంగానీ, క్రొత్త సంసారం గురించి అడగడం కానీ, సలహాలీయడం లేదు, స్వంతవారి కంటే స్నేహితులే నయం. పిక్నిక్‌లో వారందరి సరదాలూ హాస్యాలూ శ్రీమంత్‌ను తనకు సన్నిహితుడిని కావింప గలవని తాను ఆశించింది, కానీ మహేష్ అక్కడ గ్రహణం వలె అడ్డు పడ్డాడు?

"వకుళా, ఏమిటా ఉత్తరం?"

శ్రీమంత్ రెండవసారి అడిగిన తర్వాత వకుళ తన పరధ్యానత నుండి తేరు కొని కొంచం కలవర పడింది.

"ఏమిటా ఉత్తరం? అలావున్నావేమిటి? ఏమున్నది అందులో?"

అతడి వదనంలో కలవరం స్పష్టంగా కాన వచ్చింది, దగ్గరగా వచ్చి ఆ ఉత్తరాన్ని తీసుకోబోయాడు కానీ, వకుళ యివ్వలేక పోయింది.

"ఏమీలేదు, శారద........వ్రాసింది," అంటూ వెనక్కి దాచింది.

"నాన్నగారెందుకు రాలేదటా? ఆరోగ్యం బాగున్నదా?"

"ఆఁ. కులాసాయే, ఇంకొన్నాళ్ళుంటారట అక్కడే."

అతడి భృకుటి ముడిపడింది.

"ఎందువల్ల?"

"ఏ....... ఏమీలేదు."

"ఏం? నేను చూడకూడదా ఉత్తరం? ఇటుతే."

వకుళ సంకోచంతో చూచింది.

శ్రీమంత్ వదనం చాలా గంభీరంగా, అనుమానంగా వున్నది.

అదే అనురాగమున్న దంపతులైతే?

'నేనెందుకా ఉత్తరం చూడకూడదు? ఇటుతే' అని భార్యను తరిమి తరిమి పట్టి బంధించి మరీ తీసుకొంటాడు ఆ లేఖను.

ఇక్కడ అటువంటి కవ్వింపుకే తావు లేకపోగా, మీదు మిక్కిలి అదేమైనా అనుమానాలకు కూడ తావు సీయవచ్చు.

మెదలకండా ఆ ఉత్తరాన్ని అతడి చేతులలో వుంచి, ఎవరో తరిమినట్లే లోపలి గదులలోకి పారిపోయింది.

ఆజాబును చదువుకొన్న శ్రీమంత్ నిర్విణ్ణుడైనాడు.

పిల్లి కన్నులు మూసుకు పాలు త్రాగిన చందమైంది తన నటన అంతా.

తండ్రికీ, శారదకూ కూడ తమ సంసార నాటకపు నిజస్వరూపం తెలిసి పోయిందా?

ఎంత లజ్జాకరమైన విషయం?

జ్ఞప్తికి తెచ్చుకొవటానికి ప్రయత్నించాడు-ఔను... ఆరోజు....ఆఫీసువారు అల్మైరా తెచ్చి తెల్లవారుఝామున లేపిన రోజు తానూ వకుళా వేర్వేరు గదులలో వుండడం తండ్రి గమనించినట్టు అనుమానాస్పదంగా, బాధగా చూచారు. మనసులో ఎంత మధన పడ్డారో-నోటితో అడగకుండా, చెప్పకుండా ఈ పరిష్కారం ఆలోచించారన్నమాట!

కానీ ...కానీ .. ఇవన్నీ మార్చగల మామూలు దెబ్బకాదు తన మనసుకు తగిలినది. అదొక మానని వ్రణం. అందుకే మనసు వజ్ర సదృశ్యమై పోయింది.

శిలాసదృశ్యుడై ఆలోచనతో నిలచిపోయిన అతడిని వకుళ పిలుపు మేల్కొలిపి తెచ్చింది ఈ లోకంలోనికి.

"స్నానంచేసి, భోజనానికి రావచ్చు. అన్నీ సిద్ధంగా వున్నాయి." అనేసి మరలా వెళ్ళిపోయింది.

"ఊహుఁ వద్దు"

దుస్తులైనా మార్చుకోకుండా షోయి శయ్యపై కనులకు చేతులు అడ్డు వుంచుకు పడుకున్న శ్రీమంత్‌ను జాలిగా చూచింది వకుళ.

మెదలకుండా వంట ఇంట్లోకి నడిచింది. పది నిమిషల అనంతరం భోజనం పళ్ళెరంతో వచ్చిన వకుళ సవ్వడికి శ్రీమంత కనలు విప్పి చూచాడు.

"ఎందుకు శ్రమ? వద్దన్నాను కదా" అంటూ లేచి కూర్చున్నాడు.

మాట్లాడకుండా వకుళ అతడి మంచం వద్దనే చిన్న బల్లవేసి పళ్ళెం, మంచి నీరూ వుంచింది.

"వద్దు. తీసుకుపో. ఆకలైతే నేనే వచ్చి తింటాను కదా?" తిరిగి పక్క మీద వాలాడు.

అతడి పాదాలచెంత కూర్చుని వకుళ మౌనంగా బూటు విప్పబోయింది.

"ఏమిటిది?" దిగ్గున లేచి కూర్చున్నాడు.

"ఫర్వాలేదు." వకుళ తన పని మానలేదు. "నీవు అలసి వున్నపుడు తల్లీ, తోబుట్టువూ, నౌకరూ-ఎవరైన సేవ చేస్తారు. ఆ ముగ్గురూ నీ చెంతలేరు. ఆ అన్ని స్వరూపాలూ కలసిన బంధం మనది"

"వద్దు. అటువంటి పనులతో ఎందుకు నిన్ను నీవు కించ పరచుకుంటావు. ఆడవారి చేత యిటువంటి పనులు చేయించే వారినీ, చేయించాలనే వారినీ నేను ఆమోదించలేను."

కాళ్ళు దూరంగా జరిపి, వారింపుగా వకుళ చేతిని పట్టుకున్నాడు.

"హుఁ. ఆదేశించి చేయించుకునే మ్రొక్కుబడి చాకిరీ వెరు. అనురాగం తనకై తాను అందించే ఆప్యాయత వేరు. కష్టమూ, సుఖమూ, సంతోషమూ, సమస్యా అన్నీ, అహర్నిశలూ పంచుకొనేద అర్ధాంగి."

"ఔను, అందుకే ఆదరణలేని సేవలు వద్దంటున్నాను!" అతడి వారింపును సరకు జేయక బూట్లు తీసి ప్రక్కన వుంచింది.

"ఇదిగో, ఈ గిన్నెలో చేయి కడుక్కుని భోజనం చెయ్యి శ్రీమంత్, ఎందుకు అనవసర ఆలోచనలతో శరీరాన్ని కూడ కృశింపజేసుకోవడం?"

"మరి నువ్వు?"

"తర్వాత"

"కాదు, పద, తర్వాత నీవొక్కతెవూ తింటావో లేదో నాకు తెలుసు. ఇద్దరం అక్కడే చేద్దాం."

వకుళ కనుదోయి ఆశ్చర్యంతో మిల మిల లాడింది. తనకు తెలియకనే అతడు తనపై శ్రద్ధను పెంచుకొంటున్నాడు. తనపై అతడికి ఏవగింపేమీలేదు.

ఇరువురికీ పీటలు వాల్చి వకుళ వడ్డిస్తోంటే అతడు త్వరగా స్నానం ముగించి వచ్చాడు.

పీటమీద కూర్చుంటూ అన్నాడు.

"జీతం—మనకు బాగానే సరిపోతోందా?"

"ఆఁ,"

"యేమో ఎలా నడుపుతున్నావో యేమో? నాకేమీ తెలియదు, నాన్నగారు కూడా లేరు."

ప్రక్కనే కూర్చుంటూ అన్నది.

"నాకటువంటి సమస్యలేమీ వద్దు శ్రీమంత్, అన్నీ నేను సంభాళించుకో గలను." అన్నది నెమ్మదిగా.

అతడు కృతజ్ఞతతో చూచి, భోజనాని కుపక్రమించాడు.

"నాకు సాధ్యమైనంత వరకూ నీకు సమస్యలు కల్పింపక సుఖపెట్టాలనే ఈ వివాహం చేసుకున్నాను శ్రీమంత్. నిన్ను సమస్యలకూ, యితరుల సవాళ్ళకూ గురిచేసే దానను కాదు నేను" భోజనం ముగించిన అతడి చేతికి తువ్వాలు అందించుతూ.

అతడు మౌనంగా చూచాడు మరింత వివరణ కొరకు.

"మామయ్యకు గానీ, శారదకుగానీ నేనేమీ చెప్పలేదనేది నీవు నమ్మితేచాలు, ఇటువంటివి సిగ్గు విడచి ఒకరికి చెప్పుకోలేము." అంటూన్న ఆమె కంఠం ఒణికింది.

"ఊఁ" అంతరాంతరాలనుండి భారమైన నిట్టూర్పు వెలువడింది. "అటువంటి అనుమానాలు నీపై నాకు లేవు. నీ ఓర్మి నాకు తెలుసు"

తన గదిలోనికి నడచపోతూన్న అతడిని నిరసంగా చూచింది వకుళ.

"ఔను, నా కన్నీరు తుడవ వలసిన అవసరం అతడికేమిటి? ఆ మనసున తిష్టవేసుకు కూర్చున్న శశిరూపం ఈ జన్మకు బహుశః ఆ పీఠం దిగదేమో?"

వకుళ ఎదుట గాంభీర్యం నటించిన శ్రీమంత్ తనలోతాను వగచసాగాడు.

"శశీ! ఎటూకాని దౌర్భాగ్యదశకు గురిచేశావు నా మనసునూ, జీవితాన్నీ. నిన్ను మరువలేను, నీ చెల్లెలిని ఆదరించలేను, ఆమె ఒక పరిచితురాలు, అంతే అంతకంటే దగ్గర స్థానం ఈయలేకున్నా నామెకు. ఆమెను చూచి నా మనసు అలరదు; నా ఎద పొంగదు, శరీరం తహ తహలాడదు. నేనేం చేయను? నాతో బాటు ఆ అమాయకురాలు కూడ చిత్ర హింసకు గురి ఔతోంది!

# 31

"శ్రీమంత్, నాన్నగారెందుకో నిన్ను రమ్మన్నారు. ఇందాక మేడమీది నుండి చెప్పారు."

"ఆఁ, నాకూ పనుంది ఆయనతో, రా నువ్వు కూడా."

"ఎందుకూ? నేనువస్తే ఏదో రగడ జరిగి తీరుతుంది."

సంగ్రహ ప్రకటన

బి.కాం పాసైన 24 సం॥ వయసు కలిగిన
అందమైన యువకునకు ప్రశస్తమైన ఉద్యోగం
కావలెను. జీతం కనీసం రు..800/- ఉండాలి
వివరాలకు క్రింద సంతకం దారును సంప్రదించండి.
టీవీయన్మూర్తి.

"జరగనీ."

"అయినా ఏమిటి పని?"

"ఇదిగో జీతం ప్లస్ బోనస్."

"చాలా వచ్చిందే!"

"ఆఁ. కంపెనీకి లాభాలు బాగా వచ్చాయి. సర్వీస్‌ను బట్టిగాక తెలివిని బట్టి ఒక్కొక్కరికి ఒక్కోరీతిగా యిచ్చారు, ఇంక్రిమెంట్సు కూడా."

"అంటే?"

"అంటే నా జీతం కూడ పెరిగింది. ఇకనుండీ ఎనిమిది వందలు."

వకుళ వదనాన్ని ఆనందం ఆక్రమించింది.

"కంగ్రాచ్యులేషన్స్."

విస్మయంగా చూచాడు శ్రీమంత్.

"ఎందుకూ? ఆఫీసు వాళ్ళంతా నిన్నభినందిస్తున్నారు."

"ఏం?"

"భార్య వచ్చేముందు ఉద్యోగం పర్మనెంట్ అయ్యిందీ; వచ్చాకా ఇంక్రిమెంటు వానజల్లులా వచ్చిందీ అని."

వకుళ సిగ్గుగా తల వాల్చింది.

"మీ శ్రమకు ఫలితం. నాదేముందీ? అయితే నాన్నగారి దగ్గర పనేమిటీ? ఇది చెప్పాలనా?"

"ఔను, చెప్పాలి, ఆ డబ్బులో ఒక వెయ్యి మీ నాన్నగారికివ్వాలి, మిగిలిన దానితో ఈనెల ఇల్లు జరపలేవా?"

"నాన్నగారి కెందుకూ?"

"ఈ యిల్లు అమ్మి—అదే—శారద వివాహమై ఎంత కాలమైంది? ఆర్నెల్లు, ఔనా?"

"మరి నెలకు రెండు వందల చొప్పున అయిదు నెలల అద్దె వెయ్యి కాదూ? ఈ నెలది తర్వాత ఇవ్వవచ్చు"

క్షణాలలో వకుళ వదనం వివర్ణమైంది. ఏదో చెప్పాలనుకుంటున్నట్టు పెదవులు అదురుతున్నాయి. కానీ మాట రావడంలేదు.

అంత వరకూ కిటికీ వద్ద నిలచి బయటకు చూస్తూ మాట్లాడుతూన్న శ్రీమంత్ వకుళ మౌనంలో ఆమె సమాధాన మేమిటో తెలియక యిటు తిరిగి చూచాడు.

"నిగ్రహించుకున్నా ఆగని సెలయేళ్ళుదుముకుతున్నాయి ఆమె కపోలాలపై"

"ఏం? ఏమిటది?"

"నాన్నగారు బాధపడరా శ్రీమంత్? ఆ యింటికి మనం యింత దూరమై పోయామా?"

"అలా బేలగా మాట్లాడకు వకుళా, నేను బాధపడడం మాత్రం నీకు యిష్టమా? ఆ రోజు మీ అమ్మగారూ, అక్కా ఏమన్నారు? మామగారింట వుంటున్న వాడవూ, అంతస్థూ అదీ యిదీ అని మాటలనలేదూ?" ఆనాడే నిశ్చయించుకున్నాను అద్దె చెల్లించాలని, ఇదిగో యిపుడు వచ్చింది."

"అమ్మా అక్కలమాటలకు హద్దులేమిటి? నాన్నగారు అనలేదుకదా శ్రీమంత్?"

"మరో విధంగా ఆలోచించు, ఆయనకు అమ్మివేసిన యింట మనం అప్పనంగా వుండవచ్చా?"

కనులు తుడుచుకు, తలఎత్తి తీవ్రంగా అన్నది.

"అయితే అలా ఆలోచించ వలసినవి చాలా వున్నాయి. ఈ ఆస్తులన్నీ వాళ్లు కట్టబెట్టబోతూన్న దెవరికి? ఏం నాకు యింటి మీద హక్కులేదా?"

"వకుళా!"

"ఓ! సారీ శ్రీమంత్! నా మాటలో తప్పు లేదు,"

"తప్పులేదులే, కానీ మీ నాన్నగారు నీకేమిస్తారో ఇవ్వరో అది తర్వాత తేలేది. ఇవ్వవలసిన బాధ్యత వారి కున్నదనుకుంటే ఇస్తారు, లేకుంటేలేదు. అది నీకు సంబంధించిన సమస్య, కానీ నాకర్తవ్యాన్ని దానితో లంకె పెట్టవద్దు, నేను నా కుటుంబ పోషణా, వసతి సౌకర్యమూ నారెక్కలతో ఏర్పరచుకొనగలగాలి. పురుషునిగా అది నాబాధ్యత, అదే నాకు గౌరవం. పరాధారంగా బ్రతకరాదు ఎంత చిన్న విషయం లోనూ."

పదే పదే కనులు తుడుచుకుంటూ నేల చూపులు చూస్తూన్న వకుళను పరిశీలనగా చూచాడు, మాటలు ఆపి,

"ఏం, మాట్లాడవేం?

"....................."

"శ్రీమతి శ్రీమంత్ తనభర్త అభిమానంతోనూ ఆశయాలతోనూ ఆడుకొంటుందా?"

(సశేషం)



## ఆరెకపూడి రామశాస్త్రి

జననం. **14-2-1936** నిర్యాణం **27-2-1979**

కోటిలో ఒకరని మురిశాను
కోదండ రామునితో కొలువు దీరే పిలుపు
అట్టివారికే రాగలదని ఆలస్యంగా గ్రహించాను.

ఇంకా రెక్కలు రాని మీ బిడ్డలకోసం రోజులూ
ఘడియలూ లెక్కించుతూ బ్రతుకుతూన్న అభాగిని

—మీ కౌసల్య

జీవితమంతా చుట్టూ వున్న అందరి అవసరాలకూ
ఆనందాలకూ వెచ్చించి సార్థకనాములైన మీరు
[illegible]



# సాంస్కృతిక సమావేశాలు-విశేషాలు



## సాంస్కృతిక కార్యక్రమం

సనత్‌నగర్ సాంస్కృతిక సంఘం, నటరాజ సాంస్కృతిక కళాసమితి సంయుక్త ఆధ్వర్యంలో ఈ మధ్యనే హైదరాబాద్ రవీంద్రభారతిలో సాంస్కృతిక కార్యక్రమం జరిపింది. సత్య హరిశ్చంద్ర నాటకాన్ని ప్రదర్శించారు.

హరిశ్చంద్రుడుగా నటించిన శ్రీ కె. సత్యనారాయణ, విశ్వామిత్రుడిగా నటించిన శ్రీ సుబ్బారావు, నక్షత్రకుడిగా నటించిన శ్రీ మహమ్మద్ ఖాసిం ఎంతో చక్కగా చేశారు. వీళ్ళచేత అంత బాగా నటింపచేసిన దర్శకుడు శ్రీ కె. బలదేవ్ సింగ్. కుమారి సౌమ్య నృత్యం . .అపూర్వ శిల్పాలకి ప్రాణం వచ్చినట్టే....

ఇంతటినీ నిర్వహించిన వారు ఈరంకి శ్రీ రామయ్య.

## కథా సాహితి

### హైదరాబాదు

ఆ మధ్యన కాళీపట్నం రామారావు గారితో హైదరాబాదులోని సామాజిక చైతన్యంగల కథా రచయితలు కొంతమంది ఇష్టాగోష్ఠి జరిపారు. వర్తమాన కథా సాహిత్యం గురించి, దానిలోని విభిన్న ధోరణులను గురించి చర్చించడం జరిగింది. కథా రచయితల సమస్యల గురించీ మంచి కథలు అతి తక్కువగా రావడం గురించి చర్చించుకోవడం జరిగింది.

మంచి కథని పెంపొందించేందుకు రచయితలకు ఒక వేదిక అవసరమని భావించి 'కథాసాహితి' అనే వేదికను ఏర్పాటు చేసుకోవడం జరిగింది. రచయితలు మంచి కథలు రాసేందుకు, పాఠకులకు మంచి కథలపట్ల అభిరుచి కల్పించేందుకు కృషి చేయాలని నిర్ణయించుకోవడం జరిగింది.

ఈ వేదిక సామాజిక అవసరాలను, సమాజాభివృద్ధిని కాంక్షించే రచనలకు అండగా నిలుస్తుంది. పెడధోరణులకు వ్యతిరేకంగా మంచి కథలను అందిస్తుంది. పాఠకులలో ఉత్తమాభిరుచులను పెంచుతుందనే ఈ లక్ష్యాల దృష్ట్యా కథా సాహితి వేదిక తరపున 'కథ' అనే బులెటెన్ వెలువరించాలనుకుంటున్నారు పై లక్ష్యాలతో ఏకీభవించే రచయితలు సభ్యులుగా చేరి వేదిక కార్యక్రమాలకు అండదండలు అందించాలని మనవి చేస్తున్నారు.

కథా రచయితలే కాక సంస్థలు, సానుభూతిపరులు తమ సహాయ సహకారాలు అందిస్తారని ఆశిస్తున్నారు తెలుగులో మంచి కథలు వెలువడానికి జరిగే కృషిలో పాలు పంచుకోవలసిందిగా విజ్ఞప్తి.

చంద్ర, ఎం. పార్థసారథి, బి. నరసింగరావు, కె. కె. మీనన్, వీరభద్రరావు పమ్మిగారలతో ఒక ఎడిటోరియల్ బోర్డునీ, ట్రెజరర్‌గా లిపారియా గారినీ ఎన్నుకోవడం జరిగింది. అడ్రసు : కన్వీనర్, 1–8–1/117, సూర్యానగర్, చిక్కడపల్లి హైదరాబాదు.

## ఫ్రీవర్స్ ఫ్రంట్ బహుమతి

1981వ సంవత్సరానికి ఫ్రీవర్స్ ఫ్రంట్ బహుమ ఈ యేడు ఉగాది నాటికి నిర్ణయిస్తారు. బహుమతి విలువ 500 రూ. 1979, 980, 981 సంవత్సరాల్లో ప్రకటించిన ఫ్రీవర్స్ కావ్యాలకు యీ బహుమతి పొందే అర్హత వుంటుంది. దీని కోసం తమ కావ్యాలు పంపదలచిన వారు, ఫిబ్రవరి చివరి తేదిలోగా 4 కాపీలు పంపాలి. చిరునామా-ఫ్రీవర్స్ ఫ్రంట్, ఎం. సి. 18 మలక్‌పేట కాలనీ, హైదరాబాద్-36. పంపని వారి కావ్యాలు కూడా పరిశీలించడం జరుగుతుంది. కాని నిర్ణేతల దృష్టికి రాకపోయేవి ఉంటాయేమోనని యీ విధంగా కాపీలు కోరుతున్నాం. కాపీలు పంపడానికి అవకాశం లేనివారు కావ్యం పేర్లు, ప్రచురణ సంవత్సరం, కవి, వయస్సు, మొదలగు వివరాలు పంపవచ్చు. వివిధ కవుల రచనలుకల సంకలనాలు బహుమతి పరిధిలో లేవు. ఏక కర్తృకమైన మినీ కవితా సంపుటాలు గూడ బహుమతికి అర్హములు ఈ బహుమతి యువకులకు ఉద్దేశించి నటువంటిది.

-కుందుర్తి

## స్త్రీలకోసం...

మేము నేడు స్త్రీలకు వున్న సమస్యలపై స్త్రీలే వ్రాసిన కవితలను ఒక సంపుటిగా ప్రచురించ దల్చాము. ఎన్నికయిన ప్రతి కవితకు పారితోషికం వుంటుంది. కావున అభిరుచి గల స్త్రీలు తమ తమ కవితలను తగిన పోస్టేజి స్టాంపులతో మరియు తమ పాస్‌పోర్ట్ సైజు ఫొటోతో సహా మార్చి 15వ తేదీలోగా పంపగలరు. స్టాంపులు జత పర్చని కవితలు త్రిప్పి పంపుట సాధ్యపడదు.

మా అడ్రస్

యం. డి. షఫియొద్దీన్
జనరల్ సెక్రెటరి
అభ్యుదయ సాహితి సమితి
గంగాబిషన్ బస్తి
ఖమ్మం జిల్లా
కొత్తగూడెం-507 101.

## హైదరాబాదు — లలిత మ్యూజిక్ అండ్ డాన్స్ కాలేజి నిర్వహిస్తున్న అఖిల భారత సంగీత నృత్య పోటీలు.

కర్ణాటక గాత్రం —వీణ —సీనియర్స్
—జూనియర్స్
భరతనాట్యం—కూచిపూడి—సీనియర్స్
—జూనియర్స్

లలిత సంగీతంలో పోటీలు — విజేతలకు నగదు బహుమతులు —షీల్డు యివ్వబడును.

బహుమతి ప్రదానం జరిగే ఉత్సవం మే నెలలో జరుగుతుంది. ఈ ఉత్సవంలో శ్రీ నటరాజు రామకృష్ణ, శ్రీ ఎమ్. బాలమురళీకృష్ణ, శ్రీమతి జమున, శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నం గారిని సన్మానిస్తారు.

వివరాలకు:

శ్రీ యండమూరి సత్యనారాయణ
(ఆకాశవాణి అడ్వర్టైజర్)
సి-49, వనస్థలిపురం
హైదరాబాదు-500 661

అనే చిరునామాకు రు. 6/- లు మనియార్డరు చేసినవారికి ప్రాస్పెక్టస్ మరియు అప్లికేషన్ పంపబడును.

# శ్రీ పందిరి మల్లిఖార్జునరావు మృతి



ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు, పాత్రికేయుడు ఆంధ్ర సంస్కృత భాషలలో పండితుడూ అయిన శ్రీ పందిరి మల్లికార్జున రావు తన 79వ యేట డిసెంబరు 23వ తేదిన మద్రాసులో గుండె పోటుతో మరణించారు.

శ్రీ మల్లికార్జునరావు రాజమండ్రిలో 1903న జన్మించారు. ఇరవై సంవత్సరాల వయసులోనే గాంధీజీ పిలుపు నందుకుని స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు.

1921లో విదేశీ వస్త్ర బహిష్కారం, సహాయ నిరాకరణోద్యమాలలో పాల్గొని అలహాబాద్‌లో జైలుశిక్ష అనుభవించారు.

ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1927లో రాజమండ్రి నుండి "సుభాషి" మాస పత్రికను ప్రారంభించి రెండేండ్ల పాటు నడిపారు. తొలుత కాంగ్రెస్ వాదిగా జీవితం ప్రారంభించిన శ్రీ పందిరి మల్లికార్జునరావు తదనంతరం కమ్యూనిస్టుగా మారారు.

1938లో మద్రాసు వచ్చి స్థిరపడ్డారు. గదర్ వీరుడు దర్శి చెంచయ్య, దేశభక్తులు శ్రీ వి. ఎన్. శర్మ సాన్నిహిత్యంతో "ఇంటింటి విజ్ఞానమాల" ప్రచురణ సంస్థను స్థాపించి అభ్యుదయ సాహిత్య ప్రచురణకు దోహదం చేశారు. 1948లో మద్రాసు నుంచి "కిన్నెర" మాసపత్రికను ప్రారంభించి 1955 వరకూ ఆ పత్రికను నిర్వహించారు. భాషాసమితి కార్యదర్శిగా మద్రాసులోని తెలుగు సాంస్కృతిక కార్య కలాపాలకు దోహదం చేశారు. మద్రాసులోని తెలుగు సంస్థలన్నిటితో ఆయనకు సంబంధం వున్నది.

ఆంధ్ర ప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ కార్యవర్గ సభ్యునిగా, ఆ సంస్థ నిర్వహించిన సాహిత్య కార్య కలాపాలన్నిటిలో పాల్గొన్నారు. జీవిత చరమాంకం వరకు ప్రగతి శీలిగా నిరీశ్వర వాదిగా ప్రజాహిత కార్యక్రమాలకు చేదోడుగా వున్న శ్రీ పందిరి మల్లికార్జున రావు మృతికి అభ్యుదయ రచయితల సంఘం మద్రాసుశాఖ సంతాపం ప్రకటించింది.

# సి ని మా

## ఫి ల్మో త్స వ్ - 82

ఫిల్మోత్సవ్ 82 లో మొదటి వారంలో చూపబడిన హాంకాంగ్ చిత్రం "ఫాదర్ అండ్ సన్" ఆంశం మనస్సుల్ని ఆకట్టుకుంది. తండ్రీ - కొడుకుల-యీ చక్కటి కథను ఫాంగ్ యుక్ పింగ్ డైరెక్టుచేశాడు.

తండ్రి "లాసాన్‌మక్" నానా తంటాలూ పడతాడు కొడుకు "కాహింగ్‌ను" చదివించడానికి. "కాహింగ్"కు చదువుమీద ధ్యాసలేదు. ఐడి ఎగ్గొట్టేసి సినిమాలు చూడ్డం, చెడు తిరుగుళ్లు తిరగడం, యింటికి ఆలస్యంగా వచ్చి తండ్రివద్ద సీవాట్లు తినడం "కాహింగ్"కు పరిపాటైపోయింది. "కాహింగ్‌కు "సయ్‌కుంగ్" అనే కుర్రాడితో స్నేహం కుదురుతుంది. ఇద్దరూ ఎక్కడికి వెళ్ళినా కలిసికట్టుగానే వుంటారు. ఏది చేసినా-ఆఖరికి ఇళ్లు తగలబెట్టానికి కూడా యిద్దరూ కలిసే చేస్తారు!

"సియ్‌చుంగ్"కు తల్లిలేదు. తండ్రిని జైలులో పెట్టారు. "సియ్‌చుంగ్" అనాధ శరణాలయానికి వెళ్ళవలసి వస్తుంది. తన మిత్రుడు "కాహింగ్" నుండి పిడ్లోలు తీసుకోడానికి వస్తాడు!

సియ్‌చుంగ్ :- మానాన్నని మళ్ళీ జైల్లో పెట్టారు! నేను అనాధశరణాలయానికి వెళ్ళిపోతున్నాను!

కాహింగ్:- ఐతే నువ్వు నన్ను విడిచి వెళ్ళి పోతున్నావన్నమాట! మరి నిన్ను నేను కలిసేదెప్పుడు?

—దీనికి సమాధానంగా—

సియ్‌చుంగ్:- మీ నాన్నని జైల్లోపెట్టి నప్పుడు!!" అని అంటాడు!

ఇద్దరి కుర్రాళ్ళమధ్య జరిగిన యీ సంభాషణ ప్రేక్షకుల మనసుల్లో హత్తుకు పోయింది.

—జయదేవ్.

---

## పొ ర పా టు

డీలక్స్ పబ్లికేషన్స్, విజయవాడవారి ప్రకటనలో ఫిబ్రవరి సంచికలో శ్రీమతి మాదిరెడ్డి సులోచనగారి నవల "6000" కాపీలు....బదులు 600 లుగా పడినందుకు చింతిస్తున్నాము. -జ్యోతి




మొదట్నుంచీ ఫిలిమోత్సవం
ఆశించినంత తృప్తినివ్వలేదు!! పైగా
జనవరి 14 న "రబీంద్రసదన్" లో
గొడవలు జరిగాయి!!! అందుకే
ఆ కన్నీరు!!!



# ! కార్టూన్ ఇష్టులకో శుభవార్త !



## మాసపత్రిక ప్రప్రథమంగా నిర్వహిస్తున్న 'కార్టూన్ పోటీ'

**బ హు మ తు లు**

(1) ఒకే విషయం **(Subject)** పై కార్టూన్‌లు 10 కి మించకుండా **వుండాలి.**

| | |
|---|---|
| మొదటి బహుమతి | **300** రూ. |
| రెండవ బహుమతి | **200** రూ. |
| మూడవ బహుమతి | **100** రూ. |

2) ఇక, విడి కార్టూన్‌లకి

| | |
|---|---|
| మొదటి బహుమతి | **200** రూ. |
| రెండవ బహుమతి | **125** రూ. |
| మూడవ బహుమతి | **75** రూ. |

**ని బం ధ న లు**

1. కార్టూన్ సైజు మా పత్రికలో 10x6 సెం. మీ. వచ్చేలా వుండాలి.
2. బహుమతి పొందని కార్టూన్‌లు ప్రచురించే హక్కు వుంది మాకు,
3. గెలుపొందని కార్టూన్‌లు తిప్పి పంపబడవు.
4. పోటీ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
5. కాపీ కార్టూన్‌లు పోటీకి అంగీకరింపబడవు--ఆ 'హామీపత్రం' విధిగా జతపరచాలి. కవర్ మీద "కార్టూన్ పోటీకి" అని రాయాలి.

**మాకు కార్టూన్‌లు చేరవలసిన ఆఖరు తేదీ మార్చి 31.**



Edited & Published by V. Leelavathy Raghavaiah. at 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-20 & Printed by P. Ramakrishna at Raghava Printers. 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-500 020